# శ్రీవిద్యా పంచదశి

(పంచదశీ మహామంత్రానికి వివరణ)



సువర్ణఘంటాకంకణ, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద

# శ్రీవిద్యా పంచదశి

## (పంచదశీ మహామంత్రానికి వివరణ)


గ్రంధకర్త :

సువర్ణఘంటాకంకణ

శ్రీవిద్యా రత్నాకర, శ్రీవిద్యా విశారద

శ్రీ క్రోవి పార్థసారథి



ప్రకాశకులు :

**శివకామేశ్వరి గ్రంధమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం,

విజయవాడ - 520 013. ఫోన్ : 522824

# శ్రీవిద్యా పంచదశి

గ్రంథకర్త :

**శ్రీ క్రోవి పార్థసారథి**

23-11/1-10/2, దేవీ నిలయం,

ఓగిరాలవారి వీథి,

సత్యనారాయణపురం,

విజయవాడ - 520 011.

ఫోన్ : 530672



**వెల రూ. 60-00**

ప్రకాశకులు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం

కృష్ణలంక, విజయవాడ - 520 013.

ఫోన్ : 522824

ముద్రణ :

**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

గాంధీ నగర్ విజయవాడ - 3.

ఫోన్ : 574828

# ప్రణతులు

పరబ్రహ్మస్వరూపమైన పరాశక్తి యొక్క యంత్ర, మంత్ర, ఉపాసనలను వివరించేదే శ్రీవిద్య శ్రీవిద్యలో అతిముఖ్యమైన మంత్రము పంచదశీ మహామంత్రము. ఇది శ్రీవిద్యకు గాయత్రి వంటిదని చెప్పబడుతోంది.

పంచదశీ మహామంత్రాన్ని భూలోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ఋషి. ఇది మొత్తం 15 అక్షరాల మంత్రం. ఇది కాది విద్య హాది విద్య అని రెండు రకాలుగా ఉపాసింపబడుతోంది. అయితే మనువు, చంద్రుడు మొదలైన 12 మంది ఉపాసకులు ఈ మంత్రాన్ని 12 రకాలుగా ఉపాసించి తరించారు. ఈ మంత్రం వివిధ మంత్రాలతో సంపుటీకరణ కూడా చెయ్యబడుతోంది.

పంచదశీ మంత్రానికి వివిధ అర్థాలు చెప్పబడ్డాయి. అసలు పంచదశీ మహామంత్రమూ, గాయత్రీ మంత్రమూ రెండూ ఒక్కటే. గాయత్రీ మంత్రం బ్రాహ్మణుల కోసం ఏర్పడగా, పంచదశీ మహామంత్రం అన్ని వర్గముల వారి కోసం ఏర్పడింది.

పంచదశీ మహామంత్రంలో భేదాలు ఏమిటి ? దీన్ని ఎవరెవరు ఏ రకంగా ఉపాసించారు ? ఇతర మంత్రాలతో ఏ రకంగా సంపుటీకరణ చేశారు ? గాయత్రీ మంత్రార్థం ఏమిటి ? పంచదశీ మహామంత్రము, గాయత్రీ మంత్రము రెండూ ఏ రకంగా ఒకటౌతున్నాయి ? పంచదశీ మహామంత్రానికి భావార్థము, సంప్రదాయార్థము, నిగర్భార్థాలు ఏమిటి ? వరివస్యారహస్యము, దేవీ భాగవతము, కామకలావిలాసము, యోగినీ హృదయములలో ఈ మంత్రాన్ని గురించి ఏం చెప్పారు ? ఈ మంత్రంలో ఉన్న నిగూఢార్థాలు ఏమిటి? ప్రయోగార్థాలు ఏమిటి?

పంచదశీ మంత్రంలో హ్రీంకారానికి గల ప్రాముఖ్యత ఏమిటి ?

వాగ్దేవతలు చెప్పినవి లలితా సహస్రనామాలు కాగా శివశక్తులే స్వయంగా చెప్పింది లలితా త్రిశతి. ఇది 300 నామాలతో కూడిన స్తోత్రము. పంచదశీ మంత్రానికి 15 బీజాక్షరాలున్నాయి. ఒక్కొక్క బీజాక్షరానికి 20 చొప్పున, 15 x 20 = 300 నామాలు చెప్పటం జరిగింది. ఆ నామాల విశేషత ఏమిటి?

పంచదశీ మహామంత్రాన్ని జపం చేస్తే వచ్చే ఫలితం ఏమిటి ? ఈ మంత్రాన్ని ఎలా పలకాలి ? ఉచ్ఛారణ కాలం ఎంత ? మొదలైన అనేక విషయాలు ఇందులో వివరించబడ్డాయి.

అంతే కాకుండా, లలితా పంచరత్నాలు, పంచదశీ స్తవము, త్రిపుర తాపిన్యుపనిషత్తు మొదలైనవి కూడా ఇందులో చేర్చబడ్డాయి.

ఇటువంటి గ్రంథం ఇంత వరకూ తెలుగులోనే కాదు సంస్కృతంలో కూడా రాలేదు. శ్రీవిద్యోపాసకులంతా చదివి తీరవలసిన గ్రంథం. మంత్రార్థం తెలియకుండా మంత్ర జపం చెయ్యటం నిరర్థకము. అందుచేత పంచదశీ మహామంత్రజపం చేసే వారందరూ చదివి తీరవలసిన గ్రంథమిది.

ఈ గ్రంథానికి శ్రీముఖములు పంపిన పీఠాధిపతులందరకూ నా పాదాభివందనాలు తెలియచేస్తున్నాను.

సామాన్య మానవుడికి కూడా అర్థం కావాలనే తలంపుతో వ్రాసిన ఈ గ్రంథాన్ని సాధకులూ, పరమేశ్వరి భక్తులూ, పండితులూ అందరూ ఆదరిస్తారని ఆశిస్తూ .....

ప్రమాథినామ సం॥
మార్గశిర శుద్ధ పంచమి.
13-12-1999

బుధజన విధేయుడు,
**క్రోవి పార్థసారథి**






గ్రంథకర్త శ్రీ [illegible] సువర్ణ హస్త కంకణము [illegible] కరిస్తున్న స్వామి 'వాసుదేవానందగిరి'



Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

Sri Siddheswari Peetadhipati

Courtallam - 627 802

(Via) Tenkasi - Tirunelveli Dist. ----- South India

With Narayanasmritis

---

# అభినందన

5-5-1997

దేవీ పూజలో కౌళ, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు.
భిన్న సంప్రదాయములలో పంచదశీమహామంత్రము, షట్చక్రభేదన-
దేవి సాక్షాత్కారము. మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యేరీతిలో
శ్రీ క్రోవి పార్థ సారథిగారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## " శ్రీ విద్యారత్నాకర"

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః



13-12-99న "శ్రీవిద్యా పంచదశి" గ్రంథావిష్కరణ చేస్తున్న పరమహంస పరివ్రాజకచార్య
శ్రీ.శ్రీ.శ్రీ స్వామి వాసుదేవానందగిరి, విశ్వబిందు తపోవనం ట్రస్ట్, పెదపులిపాక.

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्
दक्षिणाम्नाय श्री शारदापीठम् शृङ्गेरी

*PRIVATE SECRETARY*
To His Holiness
Sri Jagadguru Shankaracharya
Dakshinamnaya
Sri Sharada Peetham,
SRINGERI-577139(Karnataka)



Ref : D-I\3030
Camp : శృంగేరి,
Date : 06.06.1998

శ్రీయుతులు క్రోవి పార్థసారథి గారికి

మీరు వ్రాసిన పత్రము, దానితో పంపిన "శ్రీవిద్యా పంచదశి" అను గ్రంథము అందినది. శ్రీచరణుల సన్నిధిన సమర్పించితిని. శ్రీచరణులు ఈ గ్రంథమును అవలోకించినారు.

మీరు పంచదశీ మహా మంత్రాన్ని గురించి అనేక విషయములను సేకరించి గ్రంథముగా ప్రకటించుట చాలా ముదావహముగా ఉన్నది.

శ్రీచరణుల నారాయణ స్మరణ పూర్వకాశీస్సులను మీకు తెలుపుచున్నాను. ఆశీర్మంత్రాక్షతలు, శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల ప్రసాదమును పంపుచున్నాను.

Encl: ప్రసాదము.

ఇట్లు,

Sree Krovi Partha Sarathi Garu,
23-11\1-10\2, Sree Devi Temple,
Ogiralavari Street, Satyanarayana Puram,
<u>VIJAYAWADA</u> – 520 011. *(A.P.)*

Phone : (04112) 22115
Fax : (04112) 24305
Sri Chandramouleeswaraya Namaha :
Sri Sankara Bhaghavadpadacharya Paramparagatha :
His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi
Jagadguru Sri Sankaracharya Swamigal
SRIMATAM SAMSTHANAM
No. 1, Salai Street, Kancheepuram - 631 502.

DATE 23-6-1999

శ్రీః

శ్రీ శారదా చంద్ర మౌళీశ్వరాభ్యాం నమః

బ్రహ్మ విష్ణు శివాత్మకమైన శక్తి యొక్క ఉపాసనమే శ్రీవిద్య. వేద విహితములగు ఉపాసనలన్నిటిలో మిక్కిలి శ్రేష్ఠము, శక్తివంతము, బహు ప్రయోజనకరము అగునది శ్రీవిద్యోపాసనము. మోక్షప్రదాయినియగు ఈ శ్రీవిద్య అత్యంతము నిగూఢమైనది. బహుముఖమగు ఈ శ్రీవిద్యను తెలుసుకొనుటకు, ఉపాసించుటకు ఎంతో పుణ్యము కావలెను. అందుకనే

*యస్యనో పశ్చిమం జన్మ యదివాశంకరః స్వయం ।*
*తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥*

అని చెప్పబడినది. శ్రీ ఆదిశంకరులు కూడ శ్రీపరమేశ్వరిని స్తుతించే శ్లోకంలో

*శివః శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం*
*న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ।*
*అతస్త్వామారాధ్యాం హరిహరవిరించ్యాదిభిరపి*
*ప్రణన్తుం స్తోతుం వా కథమీ కృత పుణ్యః ప్రభవతి ॥*

అని. పుణ్యాత్ముడు కానివాడు ఆ శక్తిని నమస్కరించుటకు, స్తుతించుటకు యోగ్యుడు కాడు అని నిర్దేశించినారు.

శ్రీచక్ర రూపిణియగు పరమేశ్వరి యొక్క తత్త్వమును, యంత్ర మంత్ర తంత్ర రూపమగు శ్రీవిద్యోపాసనమును గురించి తెలుసుకొని వాటిని ఆచరించుట వలన ఇహపర సౌఖ్యములు కలుగును.

శ్రీవిద్యయందు అత్యంత ప్రధానమగు పంచదశీ మహామంత్రమును జనులందరూ ఉపాసించి ఫలితములను పొందవచ్చును.

శ్రీవిద్యా రత్నాకర ఇత్యాది బిరుదాంకితులగు శ్రీక్రోవిపార్థసారథి గారు శ్రీవిద్యను ఎంతో సవిమర్శముగ అధ్యయనము చేసి శ్రీ పంచదశీ మహామంత్ర మహిమను తేటతెల్లముగ వివరించుటకై "శ్రీవిద్యా పంచదశీ" అను ఈ గ్రంథమును రచించినారు. దీనియందు పంచదశీ మహామంత్రము యొక్క నిగూఢ తత్త్వము నిరూపింపబడినది.

ఈ గ్రంథకర్తకూ, పాఠకులకూ, ఉపాసకులకూ సకల శ్రేయస్సులు సిద్ధించుగాక.

లోకాస్సమస్తాః సుఖినోభవంతు.

For Sri Kanchi Kamakoti Peetam
Sri Sankaracharya Swamigal Mutt

P N Neelakantan
Srikaryam & Agent



Phone: 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU

**SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI**

SRI SIDDHESWARI PEETADHIPATI

COURTALLAM - 627 802.

(Via.) Tenkasi — Tirunelveli Dist. — South India.

With Narayanasmritis




శ్రీ విద్యాపరిచయంతో ప్రారంభమై, త్రిపుర తాపిన్యుపనిషత్తుతో సమాప్తమైన "శ్రీవిద్యా పంచదశీ" గ్రంథాన్ని పరిశీలించటం జరిగింది.

దీని రచయిత చిరంజీవి క్రోవి పార్థసారథి మిక్కిలి ఆత్మ విశ్వాసంతో ఈ మంచి రచన చేయటం మాకెంతో ఆనందం కలిగించింది.

శ్రీవిద్యకు సంబంధించిన గ్రంథాలు మూడు, నాలుగు లోగడ రచించటం, అవి పెద్దల మనస్సు నాకర్షించటం, జిజ్ఞాసువులకు శ్రీవిద్యా ప్రవేశోత్సాహాన్ని కలిగించేవిగా ఉండటం విజ్ఞులందరికీ తెలిసిందే.

ప్రస్తుత మీ "శ్రీవిద్యా పంచదశి"ని పరికిస్తే రచయిత శ్రీవిద్యా పరిశీలనంలో ఎంత పరిశ్రమ కావించిందీ స్పష్టమవుతుంది. ఇతని రచనా విధానాన్ని గమనిస్తే, ఆసక్తి కొద్దీ ఆకళింపు చేసుకొన్న విషయము యొక్క వివరణం, ఎలా క్రమాభివృద్ధిని సాధించిందీ అవగతమవుతుంది.

ఇందుకు సంబంధించిన అనేక గ్రంథాల నవలోకనం చేసి, మనస్సుకు బాగా పట్టించుకొని, శ్రీవిద్యకు సంబంధించిన కావలసిన సకల విషయాలను గుదిగ్రుచ్చి ఒకచోటికి చేర్చి శ్రీవిద్యా ప్రియులకు మహోపకారం చేసినట్లు భావిస్తున్నాం. పంచదశీ మంత్రాన్ని ప్రధానంగా చేసుకొని అందులోని గూఢార్థాలు, సూక్ష్మ భేదాలు, ఇంకా అనేక మంత్రాలతో సంపుటీకరించటం లాంటి విశ్లేష విశేషాల నందించిన శ్రీపార్థసారథిని మనసారా ఆశీర్వదిస్తున్నాం.

మరో విశేషమేమంటే పంచదశీ మంత్రస్తవం మొదలుకొని షోడశీ కవచం వరకు లలితా సంబంధ స్తోత్రాలు, కవచాలు, హృదయాలు, ప్రతిదినం పారాయణ చేసుకోటానికి వీలుగా పొందుపరచటం చాలా బాగుంది.

పంచదశీ మహామంత్ర వివరణం ఎంత ప్రధానమైందో అంత ముఖ్యమైన త్రిపురతాపిన్యుపనిషత్తును కూడా గ్రంథాంతంలో చేర్చటం బహుసముచితంగా వుంది.

రచయిత నిరంతర శ్రీవిద్యా గ్రంథపరంపరాసక్తుడు కనుక ఒక సూచన చేద్దామనిపించింది.

ఇకముందు శ్రీవిద్యా విహితమైన శ్రీచక్రార్చనా విధానాన్ని, పాత్రాసాదనం, నవావరణ పూజ, వివిధ పరివార దేవతాపూజ, దాని పౌర్వా పర్యక్రమంలో సంకల్పంతో సహేతుచ తప్పకుండా వ్రాయవలసిన అవసరమెంతైనా వుంది. అంతేకాక ప్రతి సందర్భంలోను చేయవలసిన క్రియలను, తంతును తేట తెలుగులో సూచిస్తూ సంపూర్ణంగా గ్రంథాన్ని వ్రాస్తే ఇంతవరకు చేసిన సత్కృషికి, పరిపూర్ణత, సార్థకత కలుగుతుంది.

మరోమాట. మనదేశంలో ఆచార్య శంకరుల నుండి నేటి వరకు అనూచానంగా, సంప్రదాయ బద్ధంగా ఒక శ్రీచక్రార్చనా విధానమంటూ వస్తూ వుంది.

మేధావులయిన ఉపాసకులు తమ సునిశిత ప్రజ్ఞా పాటవాలతో ఒక ఒరవడిలో వస్తున్న ఆ సనాతన విధానానికి క్రొత్త పద్ధతులను వివరణలను ఈయటం కూడా వుంటున్నది.

ఏదైనా మూల, సంప్రదాయ విధేయంగా వున్నంతవరకు విప్రతిపత్తి లేదు. శ్రుతుల బాటలో నడిచినప్పుడే ఏస్మృతులకైనా విలువ. గాడి తప్పితే సంప్రదాయజ్ఞులు గౌరవించరు. సంప్రదాయాన్ని గౌరవించే శ్రీ పార్థసారథి ప్రాచీన విధానానికి ఏ మాత్రం యిబ్బంది కలగకుండా ఉపబృంహణం చేసే విధంగా సవివరంగా అర్చనా విధిని నిరూపిస్తే చాలా బాగుంటుంది.

బుద్ధిమంతులెవరైనా తొక్కిన క్రొత్త పుంతలుంటే వాటిని ప్రక్షిప్తాలుగా గౌరవిస్తూ ప్రాచీన అనుచాన విధానాన్ని విశ్వాసంతో ధైర్యంగా వ్రాయటం అత్యంతావశ్యకం.

ఈ విషయంలో శ్రీవిద్యాపరమైన అనేక గ్రంథాలను పరిశీలించిన శ్రీ పార్థసారథి ఆయాగ్రంథ నిరూపిత విషయాలను ఒక చోటికి ప్రోదిచేసి గ్రంథం వ్రాశానని తృప్తి పడకుండా మూల విషయాన్ని వివరించే విధానంలో ఒక చక్కని సమన్వయాన్ని చేసి ఎవరేమనుకొన్నా నిర్దుష్టమైన తనసొంత అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా చెప్పటానికి రచన చేయాలి.

అలాంటి ఉత్తమ సాంప్రదాయిక రచనా శక్తిని యుక్తిని మా పీఠాధిదేవత శ్రీ రాజరాజేశ్వరీమాత సమధికంగా రచయితకు ప్రసాదించాలనీ, ఆ తల్లినభ్యర్థిస్తూ శ్రీ క్రోవి పార్థసారథికి దీర్ఘాయురారోగ్యైశ్వర్య ప్రజ్ఞాదులు ఇతోధికంగా కలగాలని నారాయణ స్మృతులతో ఆశీర్వదిస్తున్నాము.

# విషయ సూచిక

# శ్రీవిద్యా పంచదశి

## 1. శ్రీవిద్య

నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయినవాడు పరబ్రహ్మ. సృష్టి ఆరంభానికి ముందు ఆ రబ్రహ్మ పూర్ణబిందు స్వరూపంలో ఉండేవాడు. అతడు ఏకాకి. అంటే తనతో సమానమైనవారుగానీ, నకన్నా అధికులైనవారుగానీ లేనటువంటివాడు. కొంత కాలం తరువాత సృష్టి చెయ్యాలని ంకల్పించినవాడై, ఏకాకిగా ఉన్న తాను అనేక రూపాలు పొందగోరినటువంటివాడై మొదటగా నను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. అందులోని ఒక భాగము ప్రకాశ బిందువు ాగా రెండవ భాగము విమర్శ బిందువు. వారే శివశక్తులు, కామేశ్వరీ కామేశ్వరులు, పరమేశ్వరీ రమేశ్వరులు.

ఇక్కడ పరమేశ్వరుడు బింబము అయితే పరమేశ్వరి ప్రతిబింబము. సూర్యుడి ఎదురుగా ద్దం గనక ఉంచినట్లైతే, ఆకాశంలో ఉండే సూర్యుడు బింబము. అద్దంలో కనిపించేది ప్రతిబింబము. ద్దం గనక తీసివేసినట్లైతే ఆ ప్రతిబింబము కనిపించదు. అదే మాయ. అందుచేతనే ప్రతిబింబము యిన పరమేశ్వరి మాయా స్వరూపిణి. పరబ్రహ్మకు ప్రతిరూపం ఆమె.

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మ, భక్తులను రక్షించటం కోసం ఒక కారం ధరించాడు. అదే పరమేశ్వరి. అందుకే శివశక్తులకు బేధం లేదు. ఇద్దరూ ఒక్కటే. సత్త్వగుణ ధానుడు పరబ్రహ్మ. తమోగుణ ప్రధానురాలు, మాయా స్వరూపిణి పరమేశ్వరి. ప్రకాశబిందువే ర్వ కారణవస్తువు. అదే పరమాత్మ. అది సాధకుల శిరోభాగంలో బ్రహ్మ రంధ్రం దగ్గర ఉంటుంది. ఈ ప్రకాశ బిందువే సాక్షీ రూపము. అదే చిత్కళ, సాక్షి, కూటస్థుడు అని చెప్పబడుతోంది.

సూర్యబింబము అద్దంలో కనిపించి తరువాత గోడ మీద పడుతోంది. అకార స్వరూపుడు వుడు. హకార స్వరూప శక్తి. వీరిద్దరి కలయిక వల్ల ఏర్పడినదే సాక్షి. అదే గోడమీద ప్రతిబింబము. ాని ప్రతిబింబమే జీవుడు. అహం అని చెప్పబడుతున్నాడు. అహమనేదే ఆత్మ మంత్రం. హంస నేది పరమాత్మ మంత్రం. హకార సంజ్ఞ గలిగిన పరమాత్మ సకార సంజ్ఞగల ప్రకృతితో కలిసి ాంస రూపమైన శబల బ్రహ్మమై తొమ్మిది ద్వారాలు గల మానవ దేహములో ప్రవేశించి ంద్రియాలు, ప్రాణాలు, మనస్సుతో కూడినవాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు చ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. అటువంటి హంస నే జీవుడికి.

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్ర మండలాలు | - | రెక్కలు |
| ఓంకారము | - | శిరస్సు |
| జ్ఞాననేత్రము | - | ముఖము |
| హకార సకారములు | - | పాదములు |

ఈ రకంగా ఉన్న హంస అనే పరమాత్మ పాలలోపల ఉన్న నెయ్యిలాగా సమస్త ప్రాణి కోటినీ ఆశ్రయించి ఉన్నాడు. అవసాన కాలంలో శరీరంలోని డెబ్బది రెండువేల నాడులలో ఏదో ఒక దాని ద్వారా జీవుడు బయటకు పోతాడు. సాధారణంగా నవరంధ్రాలలో ఏదో ఒక రంధ్రంద్వారానే నిష్క్రమిస్తాడు. అటువంటి మానవుడు తన పాపపుణ్యాలు అనుభవించిన తరువాత మళ్ళీ జన్మ ఎత్తుతాడు. అయితే ఏ మానవుడి యొక్క జీవం బ్రహ్మనాడిగుండా బయటకు పోతుందో, అతడికి మరుజన్మ ఉండదు. అతడి ఆత్మ పరమాత్మలో లీనం అవుతుంది. అంటే ముక్తి లభిస్తుంది.

వేదాలలో రెండు రకాల విద్యలు చెప్పబడ్డాయి. అవి 1. అపరావిద్య 2. పరావిద్య. అపరావిద్య ఐహిక సుఖాలకు సంబంధించినది. దీనిని అనుసరించేవారికి లోకంలో పేరు ప్రతిష్టలూ, ధనధాన్యాదులు, వృత్తి ఉద్యోగాలు లభిస్తాయి. ఉన్నత పదవులు వస్తాయి. కాబట్టి ఎక్కువ మంది ఈ మార్గాన్నే అనుసరిస్తారు. రెండవది పరావిద్య. ఇది మోక్ష విద్య. ఈ మార్గం చాలా కష్టమైనది. జీవితంలో సుఖాలన్నింటినీ వదిలి, కఠోర నియమాలతో శరీరాన్ని శుష్కింపచేస్తూ, పరమేశ్వరుని పాదారవిందాలనే సదా ధ్యానిస్తూ ఉండే సత్వగుణ ప్రధానులైనవారికి మాత్రమే ఇది సాధ్యమవుతుంది. మోక్ష సాధనకు చెప్పబడినవి రెండు మార్గాలు. 1) కర్మ మార్గము 2) జ్ఞాన మార్గము. వీటిలో రెండవది అయిన జ్ఞానమార్గమే మోక్ష సాధనకు సులభమైన మార్గము. ఎన్ని కర్మలనాచరించినప్పటికీ జ్ఞానసముపార్జన చెయ్యనిదే మోక్షము లభించదు. అటువంటి జ్ఞానాన్ని ప్రసాదించేది పరమేశ్వరి. ఆవిడ యొక్క యంత్ర, మంత్ర, తంత్ర, పూజా విధానాలే విద్య అనబడతాయి. వీటన్నింటినీ సమిష్టిగా శ్రీవిద్య అని చెప్పటం జరిగింది.

పరమాత్మ సర్వాంతర్యామి. జన్మ, మృత్యు, జరాదులు లేనటువంటివాడు. అవ్యయుడు. అతడే సత్యము, అతడే నిత్యము. చరాచర జగత్తులోని ప్రతి వస్తువూ కూడా బ్రహ్మమయమే. దీన్ని గురించి ఉపనిషత్తులలో అనేక చోట్ల చెప్పబడింది. జగత్తుకు ఉన్న నాలుగు దిక్కులు, భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, అడవులు, కొండలు, పర్వతాలు, లోయలు, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, నక్షత్రాలు అన్నీ బ్రహ్మమయమే. శ్రవణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, మనస్సు బ్రహ్మ ఇలా అన్నీ బ్రహ్మమయాలే.

ఆనందమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ. ఆకాశం అంటే హృదయాకాశం. ఆనందమనేది పరబ్రహ్మ యొక్క సహజ రూపం. పంచభూతాలు, తన్మాత్రలు అన్నీ బ్రహ్మస్వరూపాలే. సూర్యుడిలోనూ, అగ్నిలోనూ ఉండే బ్రహ్మతత్త్వం ఒక్కటే. తూర్పు-పడమర మొదలైన

క్కలలోనూ, నక్షత్రాలలోనూ, మనలోనూ ఉన్న తత్త్వం ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ త్త్వం ఉన్నదో, అదే తత్త్వం మనలోనూ ఉన్నది. ఈ రకంగా అన్ని చోట్లా వ్యాపించి ఉండేదే హ్మతత్త్వం. ఆ తత్త్వం గనక తెలిసినట్లైతే సాధకుడికి బాధలు, భారాలూ దూరమౌతాయి. తడు మనస్సుని భ్రమకు లోనుకానీయకుండా బ్రహ్మానందం పొందుతాడు. ఆ పరబ్రహ్మ తత్త్వాన్ని నకు తెలియచేసేదే శ్రీవిద్య. అటువంటి పరబ్రహ్మకూ, అతని ప్రతిరూపమయిన పరమేశ్వరికి స్కరించి, పరమేశ్వరి స్వరూపమైన నా గురు పరంపరకు నీరాజనాలర్పించి హైందవ ధర్మ రక్షణ కోసం ఏర్పాటయిన శృంగేరీ, కంచి, పుష్పగిరి, కుర్తాళం, పీఠాధిపతులు, భగవత్స్వరూపులు యిన ఆ మహానుభావుల దివ్యపాదారవిందాలకు ప్రణమిల్లి, గణపతి సచ్చిదానంద స్వామి, మి వాసు దేవానందగిరివారల ఆశీస్సులతో హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారధి అను మ శ్రీవిద్యా పంచదశి అనే గ్రంథాన్ని సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్రాయటానికి క్రమిస్తున్నాను. పండితులు, సాధకులు, జ్ఞానులు, దేవీ భక్తులూ నా యీ సాహసాన్ని మన్నించి న్ను ఆశీర్వదింతురుగాక.

పరబ్రహ్మ యొక్క ప్రతిరూపమే పరమేశ్వరి. ఈ జగత్తు అంతా పరమేశ్వరీ స్వరూపం. ఈ జగత్తు అంతా నామరూపాత్మకమైనది. కాబట్టి అశ్వత్థ వృక్షానికి రెండు కొమ్మలున్నాయని ప్పబడింది. ఆ వృక్షానికి మూలము ప్రత్యగాత్మ. అదే పరమాత్మ. సహస్రారంలో ఉంటాడు. ని నుంచి శుక్ల రక్త మిశ్రమ బిందువులతో కూడిన త్రికోణం ఏర్పడింది. ఇది అవ్యక్తము, మూల కృతి అని చెప్పబడుతోంది. మానవశరీరంలో ఇది ఆజ్ఞాచక్రం. ఈ బిందువు వలన నామరూపాలనే ండు శాఖలు ఉత్పన్నమైనాయి. త్రికోణం నుంచి నామశాఖ వచ్చింది. దానివల్ల అకారాది స్వరాలు, ల్లులు, పదాలు, మంత్రాలు, వేదాలు ఉత్పన్నమైనాయి. అలాగే త్రికోణం నుంచి రెండవది యిన రూపాత్మక శాఖ ఏర్పడింది. పరబ్రహ్మకు సృష్టి చెయ్యాలనే కోరిక కలిగింది. అప్పుడు చ్ఛాశక్తి ఆవిర్భవించింది. అది అవ్యక్తము, త్రిగుణాత్మకము.

బిందువు నుండి శివ శక్తుల సామరస్యము వలన మహత్తత్త్వముత్పన్నమైనది.

| | | |
|---|---|---|
| మహత్తత్త్వమునుంచి | - | అహంకారము |
| అహంకారము నుంచి | - | మనస్తత్త్వము |
| మనస్తత్త్వము నుంచి | - | ఆకాశము |
| ఆకాశము నుంచి | - | వాయువు |
| వాయువు నుంచి | - | అగ్ని |
| అగ్ని నుంచి | - | జలము |

జలము నుంచి - భూమి ఏర్పడినాయి

పంచ భూతాల ధర్మాలే - శబ్ద స్పర్శరూప రసగంధాలు

పంచ భూతాల వల్లనే - ఇంద్రియాలు ఏర్పడినాయి.

మానవ శరీరమే అశ్వత్థ వృక్షము. శరీరంలోని షట్చక్రాలకూ ఆధారము సహస్రారము.

సహస్రారము నుంచి - ఆజ్ఞా చక్రము

ఆజ్ఞా చక్రము నుంచి - విశుద్ధ చక్రము

విశుద్ధ చక్రము నుంచి - అనాహతము

అనాహతము నుంచి - మణిపూరము

మణిపూరము నుంచి - స్వాధిష్ఠానము

స్వాధిష్ఠానము నుంచి - మూలాధారము

ఈ రకంగా రూపాత్మక శాఖ ఏర్పడింది. షట్చక్రాలలోని యాభై దళాలలోనూ యాభై అక్షరాలున్నాయి.

విశుద్ధి చక్రము - అ నుంచి అః వరకు అచ్చులు పదహారు.

అనాహతము - క నుంచి ఠ వరకు పన్నెండు అక్షరాలు

మణిపూరము - డ నుంచి ఫ వరకు పది అక్షరాలు

స్వాధిష్ఠానము - బ నుంచి ల వరకు ఆరు అక్షరాలు

మూలాధారము - వ, శ, ష, స నాలుగు అక్షరాలు

జ్ఞాన చక్రము - హ, క్ష రెండు అక్షరాలు

ఈ రకంగా ఆధార చక్రం నుంచి ఆజ్ఞా చక్రందాకా యాభై అక్షరాలున్నాయి. ఈ విధంగా నామాత్మక శాఖ ఏర్పడింది.

పరమేశ్వరి మొదటగా త్రిమూర్తులను సృష్టించింది. బ్రహ్మను సృష్టి చేయవలసినదిగా ఆజ్ఞాపించింది. విష్ణువు, రుద్రుడు ఇద్దరూ అతడికి సహాయకులుగా ఉంటారు అని చెప్పింది. ఆ తరువాతనే సృష్టి ఆవిర్భవించింది.

చరాచర జగత్తంతా పరమేశ్వరిమయం. ఆమె లేనిది ఏదీ లేదు. ఈ జగత్తులో ప్రాణమున్నవీ, ప్రాణము లేనివి, చలనమున్నవి, చలనము లేనివి అన్నీ ఆమే. సృష్టి స్థితిలయాలకు కారణం ఆమె. జ్ఞానమయి ఆమె. అజ్ఞానమయీ ఆమే. కల్పాంతంలో ఉండే కాళరాత్రి, యుగాంతంలో ఉండే ప్రళయ రాత్రి, మోహరాత్రి కూడా ఆమే. దేవతలకు ఆహారమైన అమృతము ఆమె. ఆమే ఓంకారము. నాదము ఆమే. శబ్దమూ ఆమే. వివిధాయుధములు ధరించి రాక్ష సంపంహారము చేసే భయంకర

్వరూపిణి ఆమె. క్షేమంకరి, శుభంకరి కూడా ఆమెయే. ఈ రకంగా అన్నీ తానే అయి భక్తుల ోరికలు తీరుస్తూ వారికి శాశ్వతానందదాన్ని కలుగచేస్తుంది పరమేశ్వరి. ఆమె సాక్షాత్కారం కలిగితే ుక్తి లభిస్తుంది.

అటువంటి పరమేశ్వరిని గురించి చెప్పేదే శ్రీవిద్య. అదే పంచదశీ మహామంత్రము. గాయత్రీ ంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాల వారి కోసం ర్పడింది. గాయత్రీ మంత్రానికీ, పంచదశీ మహామంత్రానికీ భేదం లేదు. రెండింటి సారాంశమూ క్కటే. గాయత్రీ మంత్రం యొక్క అర్థం పంచదశీ మహామంత్రంలోని ప్రతికూటమిలోనూ ప్పబడింది.అందుకనే పంచదశీ మహామంత్రాన్ని ఒకసారి గనక జపిస్తే, గాయత్రీ మంత్రాన్ని ూడు సార్లు చేసిన ఫలితం వస్తుంది. పంచదశీ మహామంత్రాన్ని గాయత్రీ మంత్రంతో ంపుటీకరణ చేసి జపం చేస్తే కోటి రెట్లు ఫలమని చెప్పబడింది.

పరదేవత యొక్క స్వరూపాన్ని సాక్షాత్కరింపచేసే మహామంత్రము పంచదశి. అందుకే ది మోక్ష విద్యాగా చెప్పబడింది. అంతేకాదు ఇది కామ్య విద్య కూడా, దీని ఫలితము చివరి ేజీలలో వివరించబడింది. పంచదశీ మహామంత్రానికి స్వరం కూడా ఉన్నది.

। । ॥ ॥ ॥

*క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥*

అయితే మానస పూజలో ఈ నియమాలు లేవు. ఈ మంత్రం మొత్తం మూడు భాగాలుగా ిభజింపబడింది. అవి 1. వాగ్భవకూటమి, 2. కామరాజకూటమి 3. శక్తి కూటమి. వీటిలో మొదటిది. ్ఞానాత్మకము, రెండవది కామ్యసిద్ధి, మూడవది మోక్ష ప్రదము. ఈ మూడు ఖండాలూ ఋగ్, ుజర్, సామవేదాలకు ప్రతీకలు. శ్రీవిద్యలో అతిముఖ్యమైన మంత్రము పంచదశి. దీనికి శ్రీం లిపితే షోడశి మహామంత్రమవుతుంది. శ్రీవిద్య చంద్రవిద్య. చంద్రమండలంలోనే పరమేశ్వరి ాక్షాత్కారము జరుగుతుంది. చంద్రుడు షోడశకళాయుక్తుడు. షోడశకళలకూ ప్రతీకగానే షోడశి ుహామంత్రంలో పదహారు అక్షరాలు చెప్పబడ్డాయి. ఇది కేవలం తాంత్రిక మంత్రం అని కొందరి ాదన. అది తప్పు. ఇది శుద్ధ వైదిక మంత్రం. ముందు పేజీలలో మంత్ర నిరూపణ కూడా ెయ్యటం జరిగింది. ఈ మంత్ర జపం చేస్తే సాధకుడికి జరగని పని అంటూ లేదు. కైవల్య ప్రాప్తి ూడా జరుగుతుంది. అందుకే పంచదశి మహామంత్రమే కాదు. మంత్ర రాజము కూడా.

## 2. పంచదశీ మహామంత్రము

ఇది పదిహేను బీజాక్షరాలు గల మంత్రము. ఈ మంత్రానికి అధిదేవత లలితాత్రిపుర సుందరి. గాయత్రీ మంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా, పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాల వారికీ ఉపాస్య. విద్యలన్నింటిలోకీ ఉత్తమమైనవి వేదములు. ఆ వేదములలోని సారమే గాయత్రీ మంత్రము. ఈ మంత్రానికి రెండు రూపాలున్నాయి. 1) ఉపనయనము చేసి వటువుకు ఉపదేశించే గాయత్రి. 2) నాలుగు వేదాలలోనూ అత్యంత రహస్యంగా చెప్పబడిన పరగాయత్రి. ఇది పదిహేను అక్షరాల రూపంలో ఉంటుంది. ఇది చాలా పురాతనమైనది. పరమేశ్వరికి సంకేతముగా చెప్పబడే మంత్రము. సకల పురుషార్థాలు సాధించటానికి ఉపయోగిస్తుంది. దీనినే **పంచదశీ మహామంత్రము** అంటారు.

ఈ మహామంత్రము మూడు కూటములుగా ఉంటుంది. 1. వాగ్భవకూటమి 2) కామరాజకూటమి 3) శక్తి కూటమి. వీటిలో

1. వాగ్భవ కూటమి నందు - నాలుగు బీజాక్షరములు
2. కామరాజకూటమి నందు - ఐదు బీజాక్షరములు
3. శక్తి కూటమి నందు - మూడు బీజాక్షరములు

వెరసి పన్నెండు బీజాక్షరాలుంటాయి. అయితే ప్రతి కూటమి చివర మాయా బీజమైన హ్రీంకారముంటుంది. ఈ రకంగా పన్నెండు బీజాక్షరాలు, మూడు హ్రీంకారాలు వెరసి పదిహేను అక్షరాలు గల మంత్రం. దీనినే పంచదశీ మహామంత్రం అంటారు. ఈ మంత్రంలో కొన్ని బీజాక్షరాలు పరమేశ్వరుడు చెప్పగా, కొన్ని బీజాక్షరాలు పరమేశ్వరి చేత చెప్పబడ్డాయి. కాగా మరికొన్ని ఇద్దరి చేతనూ చెప్పబడ్డాయి.

***కత్రయం హద్వయం చైవ శైవో భాగః ప్రకీర్తితః***

కకారత్రయము, హకార ద్వయము శివుడు చెప్పిన భాగములు.

***శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః***

హ్రీంకారములు ఉభయాత్మకములు కాగా మిగిలినవి **ఏ ఈ ల స ల స ల** అనే ఏడు అక్షరాలు శక్త్యక్షరాలు.

***న తేషా సిద్ధిదా విద్యా కల్పకోటిశతైరపి.***

ఈ విషయం తెలియకుండా ఎన్ని కోట్ల సంవత్సరములు జపం చేసినప్పటికీ మంత్రం సిద్ధించదు.

*యస్యనో పశ్చిమం జన్మ యదివా శంకరః స్వయం*
*తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచ దశాక్షరీ ॥*

ఎవరికైతే మరుజన్మ ఉండదో, ఎవరు సాక్షాత్తూ పరమేశ్వర స్వరూపుడో అతడే శ్రీవిద్యను ఉపాసించగలుగుతాడు.

**మంత్రము - వర్ణాలు :**

*క్రోధీశ : శ్రీకంఠారూఢః కోణత్రయం లక్ష్మీః ।*
*మాంసమనుత్తర రూఢం వాగ్భవకూటం ప్రకీర్తితమ్ ॥*

క్రోధీశ (క్) శ్రీకంఠ (అ) రెండూ కలసి క కారము. కోణత్రయము - ఏ కారము. లక్ష్మి - ఈ కారము. మాంసము - ల కారము. ఈ నాలుగు బీజములు కలసి ప్రధమ కూటమి. అదే వాగ్భవ కూటమి.

*శివ హంస బ్రహ్మ వియచ్ఛక్రాః ప్రత్యేక మక్షరా రూఢా : ।*
*ద్వితీయకం కూటం కథితం తత్కామరాజాఖ్యమ్ ॥*

శివ (హ) హంస (స) బ్రహ్మ (క) వియత్ (హ) శక్ర (ల). ఈ ఐదు బీజములు కలసి ద్వితీయ కూటమి. అదే కామరాజకూటమి.

*శివతో వియతో యుక్తం తృతీయ మిద మేవ శక్తి కూటాఖ్యమ్ ।*
*హృల్లేఖానాం త్రితయం కూట త్రితయేపి యోజ్య మంతేస్యాత్ ॥*

రెండవ కూటమిలోని మొదటి అక్షరము శివ (హ) వియత్ (హ) అక్షరములు తీసి వేయగా మిగిలిన సకల అనే మూడు అక్షరములు మూడవదైన శక్తి కూటమి. మూడు కూటముల చివర హ్రీంకారములు ఉండాలి.

**మంత్రము : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥**

పంచదశీ మహామంత్రంలో మొత్తం మీద 58 వర్ణాలున్నాయి. అవి ఏ విధంగా అంటే, ఒక్క హ్రీంకారములోనే పన్నెండు వర్ణాలున్నాయి. అవి

*హృల్లేఖాయాః స్వరూపంతు వ్యోమాగ్ని ర్వామ లోచనా ।*
*బింద్వర్ధ చంద్ర రోధిన్యో నాద నాదాంత శక్తయః ॥*
*వ్యాపికా సుమనోన్మన్య ఇతి ద్వాదశ సంహతి : ।*
*బింద్వాదీనాం నవనాంతు సమిష్టి ర్నాద ముచ్యతే ॥*

| | | | |
|---|---|---|---|
| 1. వ్యోమ | (హ్) | 7. | నాదము |
| 2. అగ్ని | (ర్) | 8. | నాదాంతము |
| 3. నామలోచనం | (i) | 9. | శక్తి |
| 4. బిందు | (మ్) | 10. | వ్యాసికా |
| 5. అర్ధచంద్రము | (⌣) | 11. | సుమనా |
| 6. రోధిని | | 12. | ఉన్మనీ |

వీటిలో మొదటి రెండు అక్షరాలు కేవలము హల్లులు. వాటి మీద అచ్చులు లేవు. బిందువు మొదలు తొమ్మిది వర్ణాలకు కలిపి నాదము అని పేరు.

***ప్రథమే అష్టాదశ వర్ణా ద్వావింశతి రక్షరాణి మధ్యేస్యు :।***
***ప్రథమేనతుల్య మంత్యం సంఘాతే సాష్టపంచాశత్ ॥***

ప్రథమ కూటమిలో 18, ద్వితీయ కూటమిలో 22, తృతీయ కూటమిలో 18, మొత్తం మీద పంచదశీ మహామంత్రంలో 58 వర్ణాలున్నాయి.

ప్రథమ కూటమిలో పద్దెనిమిది వర్ణాలున్నాయి.

| | | |
|---|---|---|
| క్ + అ | = | 2 |
| ఏ | = | 1 |
| ఈ | = | 1 |
| ల్ + అ | = | 2 |
| హ్రీంకారము | = | 12 |
| వెరసి | | 18 వర్ణాలు |

అలాగే ద్వితీయ కూటమిలో 22 వర్ణాలున్నాయి.

| | | |
|---|---|---|
| హ్ + అ | = | 2 |
| స్ + అ | = | 2 |
| క్ + అ | = | 2 |
| హ్ + అ | = | 2 |
| ల్ + అ | = | 2 |
| హ్రీంకారము | = | 12 |
| వెరసి | | 22 వర్ణాలు |

తృతీయ కూటమిలో 18 వర్ణాలున్నాయి.

స్ + అ = 2

క్ + అ = 2

ల్ + అ = 2

హ్రీంకారము = 12

వెరసి 18 వర్ణాలు

ఈ రకంగా మొత్తం మంత్రంలో యాభై ఎనిమిది వర్ణాలున్నాయి.

**ఉచ్చారణకాలము :**

***మాత్రా ద్వితయోచ్చార్యా కామకలా చ త్రికోణా చ ।***

***బిందు రహిత హృల్లేఖా మాత్రాకాల త్రయోచ్చార్యా : ॥***

కామకల (ఈ) త్రికోణము (ఏ) లకు ఉచ్చారణ కాలము రెండు మాత్రలు. బిందువు కుండా హ్రీంకారానికి మూడు మాత్రలు. ఈ రకంగా

| | | |
|---|---|---|
| హ్రస్వాక్షరము (అచ్చులు)ల ఉచ్చారణ కాలము | - | ఒక మాత్ర |
| దీర్ఘాక్షరముల ఉచ్చారణ కాలము | - | రెండు మాత్రలు |
| హల్లుల ఉచ్చారణ కాలము | - | అర్థ మాత్ర |
| మాత్ర అంటే | - | 256 లవములు |

***నళినీ పత్ర సంహత్యాః సూక్ష్మ సూచ్యభివేధనే ।***

***దళే దళే తుయః కాలః సకాలో లవసంజ్ఞితః ।***

***అతి సూక్ష్మ తమః కాలో నోపలభ్యో భృగూద్వహా ॥***

తామర పూవుల రేకులను కట్టగా చేసి సూదితో గ్రుచ్చినట్లైతే, ఒక్కొక్క దళానికీ గుచ్చుడు కటానికి ఎంత కాలము పడుతుందో, దానికి లవము అని పేరు. ఇంతకన్నా తక్కువ మానము లానికి చెప్పలేదు.

| | | |
|---|---|---|
| బిందువు | - | అర్థమాత్రము అంటే 128 లవములు |
| అర్ధచంద్రము | - | 64 లవములు |
| రోధిని | - | 32 లవములు |
| నాదము | - | 16 లవములు |
| నాదాంతము | - | 8 లవములు |

శక్తి - 4 లవములు

వ్యాపిక - 2 లవములు

సుమన - 1 లవము

ఉన్మన - కాల పరిమాణము లేదు.

ఈ మొత్తము కలిపితే 255 లవములు. అనగా ఒక లవము తక్కువగా ఒక మాత్ర. ఇది హ్రీంకారములోని బిందువుకు పట్టే కాలము. ఇక మొత్తం హ్రీంకారానికి పట్టే కాలము.

హ్ - అర్ధ మాత్ర
ర్ - అర్ధ మాత్ర

ఈ - రెండు మాత్రలు

బిందువు మొత్తం సుమనదాకా - 255 లవములు.

అంటే ఒక లవము తక్కువగా ఒక మాత్ర. మొత్తం హ్రీంకారానికి పట్టేకాలము ఒక లవము తక్కువగా నాలుగు మాత్రలు.

**ఏకాదశ వాక్కూటే సార్ధా ఏకాదశోదితామధ్యే ।**

**సార్ధా అష్టౌ శక్తావేకైక లవోనితా మాత్రాః ।**

**సంహత్యైక త్రింశన్మాత్రా మంత్రే లవత్రయ న్యూనాః**

| | | |
|---|---|---|
| వాగ్భవ కూటమికి | - | 11 మాత్రలు |
| మధ్య కూటమికి | - | $11\frac{1}{2}$ మాత్రలు |
| శక్తి కూటమికి | - | $8\frac{1}{2}$ మాత్రలు |

అన్ని కూటములకు ఒక్కొక్క లవము తక్కువగా అని గుర్తుంచుకోవాలి. అంటే పంచదశీ మహామంత్రానికి ఉచ్చారణ కాలము మూడు లవములు తక్కువగా 31 మాత్రలు. లేదా 30 మాత్రల 253 లవములు. ఇప్పుడు ప్రథమ కూటమి ఉచ్చారణకు పట్టే కాలము.

క (క్+అ) - $1\frac{1}{2}$ మాత్ర

ఏ (దీర్ఘము) - 2 మాత్రలు

ఈ (దీర్ఘము) - 2 మాత్రలు

ల (ల్ + అ) - $1\frac{1}{2}$ మాత్ర

హ్రీం - ఒక లవము తక్కువగా 4 మాత్రలు

మొత్తం ఒక లవము తక్కువగా 11 మాత్రలు

**రెండవ కూటమి ఉచ్ఛారణకు పట్టే కాలము :**

హ్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

స్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

క్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

హ్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

ల్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

హ్రీం = ఒక లవము తక్కువగా 4 మాత్రలు

మొత్తం ఒక లవము తక్కువగా $11\frac{1}{2}$ మాత్రలు

**మూడవ కూటమి ఉచ్ఛారణకు పట్టే కాలము :**

స్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

క్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

ల్ + అ = $1\frac{1}{2}$ మాత్ర

హ్రీం = ఒక లవము తక్కువగా 4 మాత్రలు.

మొత్తం ఒక లవము తక్కువ $8\frac{1}{2}$ మాత్రలు.

ఈ రకంగా చూసినట్లైతే పంచదశీ మహామంత్రంలో

ప్రధమ కూటమికి - ఒక లవము తక్కువగా 11 మాత్రలు

రెండవ కూటమికి - ఒక లవము తక్కువగా $11\frac{1}{2}$ మాత్రలు

మూడవ కూటమికి - ఒక లవము తక్కువగా $8\frac{1}{2}$ మాత్రలు

మొత్తం మంత్రానికి మూడు లవములు తక్కువగా 31 మాత్రలు. లేదా 30 మాత్రల 253 లవములు.

***ఇత్యేవం వర్ణానాం స్థానం జ్ఞాత్వోచ్చరే ద్యత్నాత్ ।***

మంత్రంలోని బీజాక్షరముల స్థానాలను, వాటి పుట్టుకలను తెలుసుకుని మంత్రాన్ని శ్రద్ధగా ఉచ్చరించాలి.

***నాదః ప్రాథమికస్తు ద్వితీయకూటేన సాకముచ్చార్య : ।***
***ద్వైతయీకం నాదం తార్తీయేనోచ్చరేన్న పృథక్ ॥***

మొదటి కూటమి నాదాన్ని రెండవ కూటమితోను, రెండవ కూటమి నాదాన్ని మూడవ కూటమితోను కలిపి ఉచ్చరించాలి. అంటే ప్రథమ ద్వితీయ కూటముల యొక్క నాదములకు ప్రత్యేకమైన కాలము లేదు.

***బింద్వాది నవకయోస్తు ప్రాక్తన కూటద్వయస్థయోరనయో : ।***
***సమ్మేళనేన శబలం తార్తీయీకం విభావయే త్కూటం ॥***

ఒకటి, రెండవ కూటమిలలో ఉన్న బింద్వాది నవకములను మూడవ కూటమిలో ఉన్న బింద్వాది నవకములతో కలిసిన శబల వర్ణముగా భావన చెయ్యాలి.

***బింద్వాది సుమనాంతం క్రమేణ తార్తీయముచ్చరే న్నాదమ్ ।***
***ఉన్మన్యం తల్లీనం విభావయేదత దుచ్చరణమ్ ॥***

మూడవ కూటమి నాదము బిందువుతో మొదలు పెట్టి ఉన్మనలో లీనమైనట్లు భావన చెయ్యాలి.

పంచదశీ మహామంత్రానికి ఉచ్చారణ కాలము మూడు లవములు తక్కువగా 31 మాత్రలు. కాని మొదటి రెండు కూటములందు బింద్వాది నవకములకు ఉచ్చారణ కాలము లేదు. కాబట్టి జపములో ఉచ్చారణ కాలం తగ్గుతుంది.

***ఆద్యేదశ మధ్యేతాః సార్ధాస్తార్తీయ కూటేష్టౌ ।***
***ఏకలవోన్మా ఊన త్రింశన్మాత్రా మనోర్జపే కాలః ॥***

| | | |
|---|---|---|
| మొదటి కూటమికి | - | 10 మాత్రలు |
| రెండవ కూటమికి | - | $10\frac{1}{2}$ మాత్రలు |
| మూడవ కూటమికి | - | $8\frac{1}{2}$ మాత్రలు |

మొత్తం మీద పంచదశీ మహామంత్రానికి ఒక లవము తక్కువగా 29 మాత్రలు. మానసిక జపానికి నియమం లేదు.

## కూట స్వరూప విశేష వర్ణన

**వ్యష్టి సమిష్టి విభేదా దస్యాం చత్వారి బీజాని ।**
**సృష్టి స్థితి సంహారానాఖ్యా రూపాణి భావనీయాని ॥**

పంచదశీ మహామంత్రాన్ని మొత్తం నాలుగు బీజములుగా లెక్కపెట్టాలి. అవి మూడు కూటములూ మూడు బీజములు. మంత్రము మొత్తము కలిపి ఒక బీజము.

| | | |
|---|---|---|
| ప్రథమ కూటము | - | సృష్టి రూపము |
| ద్వితీయ కూటము | - | స్థితి రూపము |
| తృతీయ కూటము | - | సంహార రూపము |
| సమిష్టి కూటము | - | తిరోదానానుగ్రహ రూపము |

**ఏకైకస్మిన్ కర్మణి సృష్ట్యాది విభేదత త్రివిధే ।**
**బ్రహ్మాద్యా అధిపతయో భారత్యాది స్వశక్తి భి స్సహితాః ॥**

సృష్టి స్థితి సంహారాలు ఒక్కొక్కటి మూడు విధాలు. అది ప్రతి కూటమిలోనూ మూడు రకాలుగా ఉంటుంది.

1. సృష్టి సృష్టి, సృష్టి స్థితి, సృష్టి సంహారము
2. స్థితి సృష్టి, స్థితి స్థితి, స్థితి సంహారము.
3. సంహార సృష్టి, సంహార స్థితి, సంహార సంహారము.

ఈ కర్మలన్నింటికి సరస్వతి మొదలైన శక్తులతో కూడిన బ్రహ్మాది దేవతలు అధిపతులు. శక్తి స్వరూపము లేని బ్రహ్మాదులు సృష్టి కార్యక్రమము చెయ్యలేరు ! కాబట్టి ఒక్కొక్క కర్మలోను ఆరుగురు ఉంటారు. వారిని మంత్రంలో భావన చెయ్యాలి. బ్రహ్మ, విష్ణు, రుద్రులు ముగ్గురు. వారి శక్తులు భారతి, పృథివి, రుద్రాణి ముగ్గురు. వీరందరూ కూడా మంత్రములోని ఒక్కొక్క అక్షర రూపమై ఉన్నారు.

**బ్రహ్మాదయస్త్రయోమీ భారత్యాద్యాశ్చ శక్తయ త్రి సః ।**
**ప్రత్యక్షర్ధే స్వరూపా శ్చాక్తార వక్ష్యమాణయారీత్యా ॥**

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు - ముగ్గురు

భారతి, పృథివి, రుద్రాణి - ముగ్గురు

ఈ ఆరుగురు మంత్రమునందలి ఒక్కొక్క అక్షరమునకు స్వరూపులు. అది ఎట్లనగా

**ప్రధమ కూటమిలో :**

క కారము - బ్రహ్మ

త్రికోణము - సరస్వతి

కామకళ - విష్ణువు

ల కారము - పృధివి

హ్రీంకారములోని హ కారము, రుద్రుడు

ర కారము - గౌరి

**ద్వితీయ, తృతీయ కూటములలో :**

రెండవ కూటమిలో ఉన్న రెండవ హకారాన్ని మూడవ కూటమికి ముందు ఉంచాలి. అప్పుడు ఈ రెండు కూటములందూ కూడా ఒకే అక్షరాలుంటాయి. వాటికి వరుసగా

హ - బ్రహ్మ

స - సరస్వతి

క - విష్ణువు

ల - పృధివి

హ్రీం - రుద్రుడు, గౌరి

ఈ మూడు కూటములందూ కూడా ఈంకారము శాంతాంబికాత్మకమైన సమిష్ఠి మిధున రూపము.

**మంత్రము - శ్రీచక్రము :**

పంచదశీ మహామంత్రానికీ, శ్రీచక్రానికీ బేధం లేదు. రెండూ ఒక్కటే. అసలు పంచదశీ మహామంత్రం నుంచే శ్రీచక్రం పుట్టిందని భాస్కరాచార్యులవారు తమ వరివస్యారహస్యము అనే గ్రంథంలో వ్రాశారు.

*కత్రిత యాదీకారా ద్బిందుర్జాతస్త దగ్రిమే చక్రే ।*
*హ్యాల్లేకాభిన్నత్పర చక్రత్రితయం హకారాభ్యామ్ ॥*
*ఏకారేణ చ తత్పర చక్రే జాతే స కారాభ్యామ్ ।*
*చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రజనిః ॥*

**పంచదశీ మహామంత్రములోని**

1. మూడు క కారములు, ఈ కారము వలన - బిందువు పుట్టినది.
2. మూడు హ్రీంకారముల వలన - త్రికోణము, అష్టకోణములు
3. రెండు హకారములు, ఏ కారము వలన - అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము
4. రెండు సకారముల వలన - అష్టదళము, షోడశదళము
5. మూడు లకారముల వలన - మూడు రేఖలు గల భూపురము పుట్టినది.

ఈ రకంగా శ్రీచక్రం అంతా ఫంచదశీ మహామంత్రమునుంచే పుట్టింది. అందుచేతనే మహామంత్రానికీ, శ్రీచక్రానికీ బేధం లేదు అని చెప్పటం జరిగింది.

పూర్వకాలంలో ఎంతోమంది మహానుభావులు పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించారు.

**మను శ్చంద్ర కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి రగ్ని సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివ స్తథా**
**క్రోధ భట్టారకోదేవ్యా ద్వాదశాదో ఉపాసకాః ॥**

| | | |
|---|---|---|
| 1. మనువు | 5. మన్మథుడు | 9. ఇంద్రుడు |
| 2. చంద్రుడు | 6. అగస్త్యుడు | 10. స్కందుడు |
| 3. కుబేరుడు | 7. అగ్నిదేవుడు | 11. శివుడు |
| 4. లోపాముద్ర | 8. సూర్యుడు | 12. దుర్వాసుడు |

**విష్ణుః శివః సురజ్యేష్టో మనుశ్చంద్రో ధనాధిపః**
**లోపాముద్రా తథాగస్త్యః స్కందః కుసుమసాయకః**
**సురాధీశో రౌహిణేయో దత్తాత్రేయో మహాముని:**
**దుర్వాసా ఇతి విఖ్యాతా ఏతో ముఖ్య ఉపాసకాః ॥**

| | | |
|---|---|---|
| 1. విష్ణువు | 6. కుబేరుడు | 11. ఇంద్రుడు |
| 2. శివుడు | 7. లోపాముద్ర | 12. బలరాముడు |
| 3. ఇంద్రుడు | 8. అగస్త్యుడు | 13. దత్తాత్రేయుడు |
| 4. మనువు | 9. స్కందుడు | 14. దుర్వాసుడు |
| 5. చంద్రుడు | 10. మన్మథుడు | |

ఈ రకంగా అనేక మంది మహానుభావులు పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించి తరించారు. ఈ మహామంత్రాన్ని దర్శించి ఈ లోకానికి తెచ్చినవాడు మన్మధుడు. అతడే ఈ మంత్రానికి ఋషి. కాగా దక్షిణామూర్తి మూలపురుషుడని కొందరంటారు.

భాషకు గల అక్షరాలలో అ నుంచీ అః వరకు గల వాటిని అచ్చులనీ, క నుంచి క్ష వరకు గల వాటిని హల్లులనీ అంటారు. వీటిలో అచ్చులు శక్తి రూపాలు కాగా హల్లులు శివరూపాలు. ఈ విషయాన్ని మాతృకా హృదయము అనే గ్రంథంలో వివరించటం జరిగింది.

***కకారా దిక్షకారాంతా వర్ణాస్తే శివరూపిణః ॥***
***సమస్త వ్యస్త రూపేణ షట్ త్రింశత్ తత్త్వవిగ్రహా ।***
***అకారాది విసర్గాంతాః స్వరాః షోడశ శక్తయః ॥***
***నిత్యాషోడశ కాత్మనః పరస్పర మమీయుతా ।***
***శివశక్తి మయావర్ణా శబ్దార్థ ప్రతిపాదకాః ॥***
***శివ స్వర పరాధీనో న స్వతంత్రః పదాన్యసౌ ॥***
***స్వరా స్వతంత్రా జాయంతే న శివస్తు కథాచన***

ఈ రకంగా అక్షరాలను మూడు భాగాలుగా చేసి

1. అ నుంచి అః వరకు 16 అక్షరములు మొదటి భాగము
2. క నుంచి త వరకు 16 అక్షరములు రెండువ భాగము
3. థ నుంచి స వరకు 16 అక్షరములు మూడవ భాగము

వాటిలో సత్త్వరజస్తమో గుణాలు, త్రిమూర్తుల, చంద్ర సూర్యాగ్నుల, జాగ్రస్వప్న సుషుప్తి అవస్థల తత్త్వాలు చేర్చబడ్డాయి. వీటిలో షోడశ నిత్యలను కూడా చేర్చటం జరిగింది. షోడశనిత్యలను వసిష్ఠ సంహితలోనూ, యామళగ్రంధాలలోనూ కూడా వివరించటం జరిగింది. ఖడ్గమాలలో

***కామేశ్వరి, భగమాలినీ, నిత్యక్లిన్నే, భేరుండే,***
***వహ్నివాసినీ, మవజ్రేశ్వరీ, శివదూతీ, త్వరితే***
***కులసుందరీ, నిత్యే, నీలపతాకే, విజయే,***
***సర్వమంగళే, జ్వాలామాలినీ, చిత్రే, మహానిత్యే ॥***

ఈ షోడశనిత్యల యొక్క చిత్రాలను, ధ్యాన శ్లోకాలను నాచే వ్రాయబడిన శ్రీవిద్యా దర్పణములో ఇవ్వటం జరిగింది. పాఠకులు గమనించగలరు.

పాడ్యమి నుండి పౌర్ణమి వరకు గల తిథులు పదిహేను. నిత్యలు తిథి స్వరూపాలు. తిథులు ళా స్వరూపాలు.

**ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమాకళా**
**ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షయోః శుక్ల కృష్ణయో :॥**

పైన చెప్పిన పదిహేను తిథులే కళాస్వరూపాలు.

**దర్శాద్యాః పూర్ణిమాంతాశ్చ కళాః పంచదశైవతు**
**షోడశీతు కళాజ్ఞేయా సచ్చిదానందరూపిణీ ॥**

పదిహేను తిథులు, పదిహేను కళలు కాగా, పదహారవ కళ సాక్షాత్తూ ఆ పరమేశ్వరి.

ఈ రకంగా తిథులను, కళలను,

| | | |
|---|---|---|
| 1. ప్రకటయోగిని | 4. సంప్రదాయ యోగిని | 7. రహస్యయోగిని |
| 2. గుప్తయోగిని | 5. కుళోత్తీర్ణయోగిని | 8. అతి రహస్య యోగిని |
| 3. గుప్తతరయోగిని | 6. నిగర్భయోగిని | 9. పరాపర రహస్యయోగిని |

అనబడే తొమ్మిది మంది యోగినులను అందులో అంతర్భావం చేసి, వాటికి కూటమి అని రు పెట్టారు.ప్రతి కూటమి చివరా హ్రీంకారము చేర్చటం జరిగింది. హ్రీంకారమనేది ప్రాణశక్తి. ది గనక లేకపోతే మంత్రము నిర్జీవమౌతుంది.

ఈ కళలన్నీ మూడు ఖండాలవుతున్నాయి. శివ, శక్తి, మాయ, శుద్ధవిద్య, జలము. అనే దుతత్త్వాలకు సంబంధించిన మొదటి ఐదు కళలు గల ప్రథమ ఖండాన్ని అగ్ని ఖండము అంటారు. నికి అధిదేవత అగ్ని. తేజస్సు, వాయువు, మనస్సు, పృథివి, ఆకాశము అనే ఐదు తత్త్వాలకు ంబంధించిన 6 నుంచి 10 వరకు గల కళలు సూర్యఖండము. దీనికి అధిదేవత సూర్యుడు. ద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశివ అనే తత్త్వాలకు సంబంధించిన చివరి ఐదు కళలు ంద్రఖండము-దీనికి అధిదేవత చంద్రుడు.

అన్ని కళలకూ, ఖండాలకూ అధిదేవత కామేశ్వరుడు. అధిష్టాత్రి కామేశ్వరి. ఈ రకంగా ోమ, సూర్య, అగ్ని ఖండాలుగా పంచదశీ మహామంత్రం విభజింపబడినది. ఈ మంత్రం అనేకచోట్ల ిరూపించబడినది. సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులవారు

***శివ (క) శక్తిః (ఏ) కామః (ఈ) క్షితి (ల) రథ రవి (హ) శ్శీతకిరణః (స)***
***స్మరో (క) హంస (హ) శ్శక్ర (ల) స్తదనుజ పరా (స) మార (క) హరయః (ల)***

*అమీ హ్యాల్లేకాభిస్తి స్స్యభిరవసానేషుఘటితా :*
*భజన్తే వర్ణాస్తే తవజనని నామావయవతామ్ ॥*

ఈ రకంగా వచ్చిన మూడు ఖండాలకూ చివర మూడు హ్రీంకారాలను చేర్చాలి.

**మంత్రము :** *క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥*

శంకర భగవత్పాదుల పరమగురువైన గౌడ పాదాచార్యులవారు తమ **సుభగోదయ స్తుతిలో**

*స్మరో (క) మారో (ఏ) మారః (ఈ) స్మర (ల) ఇతి పరో (హ) మార (స) మదనః (క)*
*స్మరానంగ (హల) శ్చేతి స్మరమదన (స) మారాః (క) స్మర (ల) ఇతి ।*

*త్రిఖండః ఖండాంతే కలిత భువనేశ్యక్షరయుత*
*శ్రుతుః పంచార్ణాస్తే త్రయ ఇతి చ పంచాక్షరమనుః ॥*

ఈ రకంగా వచ్చిన మూడు ఖండముల చివర భువనేశ్వరీ బీజమైన హ్రీంకారము ఉంచాలి. అప్పుడు **మంత్రము :** *క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥*

**కాది, హాది విద్యలు :** అకారాది క్షకారాంతము గల అక్షర సముదాయానికి 'మాతృకలు' అని పేరు. వీటిలో కకారముతో మొదలయ్యే అక్షరాలను కాది మాతృకలనీ, హకారముతో మొదలయ్యే వాటికి హాది మాతృకలనీ పేరు. పంచదశీ మహామంత్రం క కారముతో మొదలైతే కాది విద్య అనీ, హకారముతో మొదలైతే హాది విద్య అనీ అంటారు. ఇంద్రుడు, చంద్రుడు, మనువు, కుబేరుడు, మన్మథుడు మొదలైనవారు కాది విద్యనుపాసించగా లోపాముద్ర, సూర్యుడు, శివుడు, విష్ణువు మొదలైన వారు హాది విద్యనుపాసించారు. హాది విద్యలో యమ నియమాలు ఎక్కువగా ఉంటాయి. కాది విద్యలో అవి ఎక్కువగా ఉండవు. ధర్మాచరణలో స్వేచ్ఛ ఇవ్వబడింది అని **శక్తి సంగమ తంత్రంలో** చెప్పబడింది. ఈ రెండు విద్యలలోనూ కాదివిద్య శ్రేష్టమైనది.

*తేషు ద్వామనురాజేతు వరిష్టౌ వింధ్యమర్దన*
*లోపాముద్రా కామరాజానితి ఖ్యాతి ముపాగతౌ ।*
*హాదిస్తు లోపాముద్రాస్యా త్కామరాజస్తు కాది కః*
*తయోస్తు కామరాజో యం సిద్దిదో భక్తి శాలినాం ॥*

హాదివిద్యలో లోపాముద్ర ఉపాసించిన మంత్రము, కాదివిద్యలో మన్మధుడుపాసించిన మంత్రము శ్రేష్టమైనవి. కాగా ఈ రెండింటిలోనూ కాదివిద్య విశేషమైనది.

**కాదివిద్య :** కకారముతో మొదలయ్యేది కాదివిద్య.

*కామో (క) యోనిః (ఏ) కమలా (ఈ) వజ్రపాణి : (ల)*
*గుహా (హ్రీం), హసా (హస) మాతరిశ్వా (క) భ్ర (హ) మింద్రః (ల)*

పునర్గుహా (హ్రీం) సకలా (సకల) మాయయా (హ్రీం) చ
పురూచ్యేషా విశ్వమాతాది విద్యా ॥

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం / హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥

**హాది విద్య :** పైన చెప్పిన మంత్రంలోని మొదటి మూడు అక్షరాలనూ హసక అని మార్చి స్తే అది హాదివిద్య అవుతుంది. లోపాముద్ర ఉపాసించిన మంత్రం.

శివేన (హ) శక్త్యా (స) కామేన (క) శక్రే (ల) ణైవతు మాయయా (హ్రీం)
హంసేన (హ) భృగుణా (స) చైవ కామేన (క) శశిమౌళినా (హ)
శక్రేణ (ల) భువనేశేన (హ్రీం) చంద్రేణ(స) చ మనోభువా (క)
క్షిత్యా (ల) హృల్లేఖయా (హ్రీం) చైవ ప్రోక్తో హసాది మంత్రరాట్ ॥

**మంత్రము :** హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ॥

కాది విద్యలోనూ, హాది విద్యలోనూ కూడా ఈ మహామంత్రాన్ని అనేక మంది అనేక రకాలుగా ఉపాసించారు.

**శ్రీ విద్యోపాసనా ఫలితము :**

యస్యనో పశ్చిమం జన్మ యదివాశంకరః స్వయం
తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥

ఎవరికైతే మళ్ళీ జన్మ ఉండదో, ఎవరైతే సాక్షాత్తూ ఈశ్వరుని అంశతో జన్మించారో, ఎవరికైతే పూర్వజన్మ కృతం ఉంటుందో వారు మాత్రమే పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించగలుగుతారు. శ్రీవిద్య అనేది కామ్యవిద్య, మోక్షవిద్య కూడా. ఏ కార్యము సాధించదలచిన వారు ఈ జపం చేసినప్పటికీ వారికి ఆ ఫలితము కలుగుతుంది.

ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్ ।
విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వ ప్రదాయకమ్ ॥
సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్ ।
సర్వాభీష్టప్రదం చైవ దేవీనామ శతత్రయమ్ ॥

లలితాత్రిశతి అంటే పంచదశి మహామంత్రమే. దీనిని గనక జపించినట్లైతే ఇది ఆయుష్యకరము. పుష్టికరము, వశీకరణము, విద్యాప్రదము, కీర్తికరము, కవిత్వప్రదము, సంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యప్రదము, సర్వాభీష్టప్రదమై ఉన్నది.

## 3. పంచదశీ మహామంత్రము - సూక్ష్మభేదాలు

పంచదశీ మహామంత్రాన్ని ఈ లోకంలోకి తెచ్చినవాడు మన్మధుడు. అయినప్పటికీ ఈ మంత్రాన్ని ఉపాసించి తరించినవారు చాలామంది ఉన్నారు. వారిలో మనుశ్చంద్ర, విష్ణువు, శివుడు, బ్రహ్మ, మనువు, చంద్రుడు, కుబేరుడు, అగస్త్యుడు, లోపాముద్ర మొదలైన వారు ముఖ్యులు. అయితే

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | మనువు | 5. | మన్మధుడు | 9. | ఇంద్రుడు |
| 2. | చంద్రుడు | 6. | అగస్త్యుడు | 10. | విష్ణువు |
| 3. | కుబేరుడు | 7. | నందికేశ్వరుడు | 11. | శివుడు |
| 4. | లోపాముద్ర | 8. | సూర్యుడు | 12. | దుర్వాసుడు |

అనే పన్నెండు మంది స్వల్పబేధాలతో పన్నెండు రకాలయిన మంత్రాన్ని జపించారు. వీరందరూ ఉపాసించిన మంత్రానికి దక్షిణామూర్తే ఋషి కాని మంత్రం మాత్రం వేరుగా ఉంటుంది. వీటన్నింటికీ **సకుంకుమవిలేపనా .... స్మరేదంబికాం !** అనేదే ధ్యానశ్లోకము.

I. **మనువిద్యా :** ఇది మనువు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ మను విద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీ మనువిద్యాంబాదేవతా । క ఏ ఈ ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం। జపే వినియోగః ।

క ఏ ఈ ల హ్రీం - అంగుష్ఠాభ్యాం నమః
హ స క హ ల హ్రీం - తర్జనీభ్యాం నమః
స క ల హ్రీం - మధ్యమాభ్యాం నమః
క ఏ ఈ ల హ్రీం - అనామికాభ్యాం నమః
హ స క హ ల హ్రీం - కనిష్ఠికాభ్యాం నమః
స క ల హ్రీం - కరతలకరపృష్టాభ్యాం నమః

ఈ విధంగానే హృదయన్యాసము.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురాజప నిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం - హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।

**2. చంద్ర విద్యా :** ఇది చంద్రుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ చంద్ర విద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛంధః । శ్రీ చంద్ర విద్యాంబాదేవతా । స హ క ఏ ఈ ల హ్రీం బీజం । స హ క హ ల హ్రీం శక్తిః । స హ స క ల హ్రీం కీలకం । జపే వినియోగః । మూలకూటత్రయముతో అంగన్యాసకర న్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమవిలేపనా ....**

**మంత్రము : స హ క ఏ ఈ ల హ్రీం । స హ క హ ల హ్రీం । స హ స క ల హ్రీం ।**

**3. కుబేర విద్యా :** ఇది కుబేరుడు ఉపాసించిన మంత్రము. అస్యశ్రీ కుబేర విద్యాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛంద్రః । శ్రీ కుబేర విద్యాంబా దేవతా । క ఏ ఈ ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం । జపే వినియోగః । కూటత్రయముచే అంగన్యాసకర న్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమవిలేపనా ..**

**మంత్రము : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స హ స క ల హ్రీం ।**

**4. లోపాముద్ర విద్యా :** ఇది లోపాముద్ర ఉపాసించిన మంత్రము, అస్యశ్రీ లోపాముద్రాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛంధః । లోపాముద్రా విద్యాంబా దేవతా । హ స క ల హ్రీం బీజం । హ స క హల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం । జపే వినియోగః । కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ....**

**మంత్రము : హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।**

**5. మన్మథ విద్యా :** ఇది మన్మథుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ మన్మథ విద్యాంబా మహామంత్రస్య । దక్షిణా మూర్తి ఋషిః । అనుష్టుప్ఛంద్రః । శ్రీ మన్మథ విద్యాంబా దేవతా । క ఏ ఈ ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । స క ల హ్రీం కీలకం । జపే వినియోగః । కూటత్రయముతో అంగన్యాస కర న్యాములు.

**ధ్యానమ్ : సంకుకుమ విలేపనా ...**

**మంత్రము : క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।**

**6. అగస్త్యవిద్యా :** ఇది అగస్త్యుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ అగస్త్యవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణా మూర్తి ఋషిః। అనుష్టుప్ఛందః। శ్రీ అగస్త్యవిద్యాంబా దేవతా। హ స క ఏ ఈ ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। సహ సకల హ్రీం కీలకం।జపే వినియోగః। కూటత్రయముతో రెండు ఆవృత్తులు అంగన్యాస కర న్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ...**

**మంత్రమ్ : హ స క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స హ స క ల హ్రీం।**

**7. నందికేశ్వర విద్యా :** ఇది నందికేశ్వరుడుపాసించిన మంత్రము.

అస్యశ్రీ నందికేశ్వర విద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛందః। శ్రీ నందికేశ్వర విద్యాంబాదేవతా। స ఏ ఈ ల హ్రీం బీజం। స హ హ ల హ్రీం శక్తిః। స క ల హ్రీం కీలకం। జపే వినియోగః। ఖండత్రయముతో రెండు ఆవృతులు న్యాసము.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : స ఏ ఈ ల హ్రీం। స హ హ ల హ్రీం। స క ల హ్రీం।**

**8. సూర్యవిద్యా :** ఇది సూర్యుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ సూర్యవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛందః। శ్రీ సూర్యవిద్యాంబా దేవతా। హ స క ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। స క హ ల హ్రీం కీలకం। జపే వినియోగః। కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాసకరన్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : హ స క ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క హ ల హ్రీం।**

**9. ఇంద్ర విద్యా :** ఇది ఇంద్రుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ ఇంద్రవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛంద్రః। శ్రీ ఇంద్రవిద్యాంబా దేవతా। క ఏ ఈ ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। సకల హ్రీం కీలకం। జపే వినియోగః। కూటత్రయముతో రెండు ఆవృతులు న్యాసము.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ....**

**మంత్రము : క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స క ల హ్రీం।**

**10. విష్ణు విద్యా :** ఇది విష్ణువు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ విష్ణువిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛందః। శ్రీ విష్ణు విద్యాంబా దేవతా। హ స క ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। స క ల హ్రీం కీలకం। జపే వినియోగః।

1) హ స క ల హ్రీం 2) హ స క హ ల హ్రీం 3) స క ల హ్రీం 4) స ఏ ఈ ల హ్రీం
5) స హ హ ల హ్రీం 6) స క ల హ్రీం । ఈ విధంగా అంగన్యాస కరన్యాసములు

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ....**

**మంత్రము : హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । స ఏ ఈ ల హ్రీం। స హ హ ల హ్రీం । స క ల హ్రీం ।**

**11. శంకర విద్యా :** ఇది శంకరుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ శంకరవిద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషి ః । పంక్తిశ్ఛందః । శంకర విద్యాంబాదేవతా । హ స క ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తి ః । స క ల హ్రీం కీలకం । జపే వినియోగః

1) హ స క ల హ్రీం 2) హ స క హ ల హ్రీం 3) స క ల హ్రీం 4) హ స క ల
5) హ స క హ ల 6) సకల హ్రీం

ఈ విధంగా అంగన్యాసకరన్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । హ స క ల। హ స క హ ల । స క ల హ్రీం ।**

**12. దుర్వాసవిద్యా :** ఇది దుర్వాసుడు ఉపాసించిన మంత్రము.

అస్యశ్రీ దుర్వాసవిద్యాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషి ః । పంక్తిశ్ఛంధః । శ్రీ దుర్వాసవిద్యాంబాదేవతా । క ఏ ఈ ల హ రీ బీజం । హ స క హ ల హరీ శక్తి ః । స క ల హరీ కీలకం । జపే వినియోగః ।

కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాస కర న్యాసములు.

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ....**

**మంత్రము : క ఏ ఈ ల హరీ । హ స క హ ల హరీ । స క ల హరీ**

ఈ రకంగా పన్నెండు మందీ, ఈ మంత్రాన్ని సూక్ష్మ బేధాలతో జపించారు. అయితే ఈ మంత్రం ఇలాగే స్వల్ప బేధాలతో ఇంకా కనిపిస్తోంది. అవి 1) పూర్తి విద్య 2) తురీయాంబా 3) కామకళా విద్య. వీటిలో ఈ మంత్రము ఈ విధంగా ఉంటుంది. ఇక్కడ ఋషి, ధ్యాన శ్లోకము కూడా వేరు వేరుగా ఉంటాయి.

**1) పూర్తి విద్య :** అస్యశ్రీ పూర్తివిద్యా మహామంత్రస్య। దక్షిణా మూర్తి ఋషిః। పంక్తిశ్చంధః। శ్రీ పూర్తి విద్యా త్రిపుర సుందరీ దేవతా। క ఏ ఈ ల బీజం। స క ల హ్రీం శక్తిః। హ స క హ ల కీలకం। జపే వినియోగః। కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

*సర్వ విద్యాయాం సర్వశక్తిపీఠస్వరూపిణీం*
*శ్రీ పూర్తిదేవతాం వందే శ్రీకరీం ముక్తిదాయినీమ్ ॥*

**మంత్రము :** *క ఏ ఈ ల । హ స క హ ల । స క ల హ్రీం ।*

**2) తురీయాంబా :** అస్యశ్రీ తురీయాంబా మహామంత్రస్య। భోగానంద భైరవ ఋషిః। ఉష్ణిక్ఛంధః। శ్రీ తురీయాంబా మహాత్రిపురసుందరీ దేవతా। హం బీజం। ఈం శక్తిః రం కీలకం జపే వినియోగః। కూటత్రయముతో రెండు ఆవృతులు న్యాసము.

**ధ్యానమ్ :**

*పున్నాగాం బుజ జాతి కుందవకుళైః పుష్పైరలంకారితాం*
*తన్వీమిక్షు ధనుః ప్రసూన విశిఖాన్ పాశాంకుశౌ బిభ్రతీమ్ ।*
*కన్యాం ప్రోద్య దనంత భోగనిలయే కల్పే తురీయే శివే*
*నాదే నాదమయే పరాపరమయే త్వాం భావయామ్యం బికామ్ ॥*

**మంత్రము :** *హ స క ల । హ స క హ ల । స క ల హ్రీం ॥*

**3. కామకళా విద్యా:** అస్యశ్రీ కామకళాంబా మహామంత్రస్య। మన్మధ ఋషిః। జగతీఛంధః। శ్రీ కామకళాంబా దేవతా। ఈం బీజం। ఈం శక్తిః। ఈం కీలకం। జపే వినియోగః। 'ఆ' మొదలు దీర్ఘ స్వరితాలతో న్యాసము.

**ధ్యానమ్ :**

*పంకజ పాశాంకుశేక్షు । ధనుః కింశుక శాల్యగ్ర ।*
*పుష్పబాణధరాం దేవీం । సతతం వరదాభయ ।*
*హస్తాం కలయే నమామి । కామకళాధరీ మంబాం ॥*

**మంత్రము :** *హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం । క ల హ్రీం ।*
*ల హ్రీం। హ్రీం । ఈం ।*

## 4. పంచదశీ మహామంత్రము, వివిధ మంత్రాలతో సంపుటీకరణము

సంపుటీకరణము అంటే ఒక మంత్రాన్ని ఇంకొంక మంత్రముతో కలిపి చెప్పటం. లేదా కొన్ని బీజాక్షరాలను కలిపి చెప్పటం. పంచదశీ మహామంత్రము అతిశక్తివంతమైనదనీ, ఇది మంత్ర రాజము అనీ చెప్పటం జరిగింది. కాబట్టి ఈ మంత్రాన్ని ఇతర మంత్రాలతో గనక కలిపి జపం చేసినట్లైతే ఆ మంత్రాలు త్వరగా సిద్ధిస్తాయి. వాటి ఫలితం అనేక రెట్లు పెరుగుతుంది. పంచదశీ మహామంత్రం మూడు ఖండాలు లేదా కూటములుగా ఉంటుంది. 1) వాగ్భవకూటమి 2) కామరాజ కూటమి 3) శక్తి కూటమి - వాటిలో

క ఏ ఈ ల హ్రీం - వాగ్భవ కూటమి

హ స క హ ల హ్రీం - కామరాజకూటమి

స క ల హ్రీం - శక్తి కూటమి

ఇతర మంత్రాలతో సంపుటీకరణం చేసేటప్పుడు ఈ మూడు ఖండాలుగానే ఈ మంత్రాన్ని సంపుటీకరణం చేస్తారు.

**1. సౌభాగ్య విద్య :** బాలా మంత్రాన్ని పంచదశీ మహామంత్రంతో సంపుటీకరణం చేస్తే దాన్ని సౌభాగ్య విద్య అంటారు. బాలా మంత్రంలో ఐంక్లీం సౌః అనే బీజాక్షరాలు అనులోమ విలోమాలుగా ఉంటాయి.

అస్యశ్రీ సౌభాగ్యవిద్యా పంచదశాక్షరీ మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తి ఛందః శ్రీ సౌభాగ్యవిద్యేశ్వరీ త్రిపుర సుందరీ దేవతా। ఐం క ఏ ఈ ల హ్రీం బీజం। సౌః స క ల హ్రీం శక్తిః। క్లీం హ స క హ ల హ్రీం కీలకం। జపే వినియోగః

1. ఐం క ఏ ఈ ల హ్రీం సర్వజ్ఞశక్తి ధామ్నే హ్రాం
2. క్లీం హ స క హ ల హ్రీం నిత్య తృప్తి శక్తిధామ్నే హ్రీం.
3. సౌః స క ల హ్రీం అనాది బోధశక్తిధామ్నే హ్రూం
4. ఐం క ఏ ఈ ల హ్రీం స్వతంత్రశక్తి ధామ్నే హ్రైం
5. క్లీం హ స క హ ల హ్రీం నిత్యాలుప్త శక్తి ధామ్నే హ్రౌం
6. సౌ : స క ల హ్రీం అనంత శక్తి ధామ్నే హ్రః

ఈ విధంగా అంగన్యాసకరన్యాసములు

**ధ్యానమ్ : సకుంకుమ విలేపనా ...**

**మంత్రము : ఐం క ఏ ఈ ల హ్రీం। క్లీం హ స క హ ల హ్రీం। సౌః స క ల హ్రీం।**

**2) గోపాలసుందరీ మంత్రం :** గోపాల మంత్రాన్ని గనక పంచదశీ మహామంత్రంతో సంపుటీకరణం చేస్తే గోపాలసుందరి అవుతుంది.

**గోపాల మంత్రం :** క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా ।

ఈ మంత్రాన్ని పంచదశీ మహామంత్రంతో సంపుటీకరణ చేస్తారు. అప్పుడు గోపాల సుందరీ మంత్రం ఈ విధంగా ఉంటుంది.

అస్యశ్రీ గోపాలసుందరీ మహామంత్రస్య । విధాత ఋషి : । దైవీగాయత్రీచ్ఛందః । శ్రీ సుందరీయుతో గోపాలో దేవతా । క్లీం బీజం । స్వాహా శక్తిః । హ్రీం కీలకం । జపే వినియోగః ।

1. ఐం శ్రీం హ్రీం శ్రీం క్లీం
2. ఐం శ్రీం కృష్ణాయ
3. ఐం శ్రీం గోవిందాయ
4. ఐం శ్రీం గోపీజన
5. ఐం శ్రీం వల్లభాయ
6. ఐం శ్రీం స్వాహా

ఈ విధంగా అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

*అర్ధం శోణమథార్ధ మంబుదనిభం బద్ధం లలాటస్రజా*
*బర్హాకల్పితయా విలాస సదనం స్త్రీ పుం మయం వైష్ణవం*
*హస్తై రాధృత వేణునాదసృణి సత్పాశేక్షు చాపాశుగం*
*వస్త్వత్యద్భుత మస్తు మే హృది శ్రీకృష్ణ పరమాత్మకమ్ ।*

**మంత్రము :** *హ్రీం శ్రీం క్లీం । కృష్ణాయ క ఏ ఈ ల హ్రీం । గోవిందాయ హ స క హ ల హ్రీం । గోపీజన వల్లభాయ స క ల హ్రీం । స్వాహా ॥*

**3. విద్యాగణపతి :** పంచదశీ మహామంత్రాన్ని మహాగణపతి మంత్రంతో సంపుటీకరణం చేసినట్లైతే విద్యాగణపతి అంటారు.

అస్యశ్రీ విద్యాగణపతి మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషి : । దైవీగాయత్రీ ఛందః । శ్రీ విద్యా గణేశ్వరోదేవతా । గంబీజం । హ్రీం శక్తి : । జపే వినియోగః ।

**ధ్యానమ్ :**

*ద్వాభ్యాం విభ్రాజమానం వరకనక మహాశృంఖలాభ్యాం భుజాభ్యాం*
*బీజాపూరాది బిభ్రద్దశభుజలలితం చంద్రచూడం త్రినేత్రం ।*
*సంధ్యా సింధూర వర్ణం స్తన భరనమితం తుందిలం సన్నితంబం*
*కంఠాదూర్ధ్వం కరీంద్రం యువతి మయమధస్తామి విద్యాగణేశమ్ ॥*

**మంత్రము :** *ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం క ఏ ఈ ల హ్రీం । గణపతయే హ స క హ ల హ్రీం। వరవరద స క ల హ్రీం । సర్వజనంమే వశమానయ స్వాహా॥*

**4. శ్రీవిద్యారామము :** రామమంత్రాన్ని పంచదశీ మహామంత్రంతో సంపుటీకరణం చేస్తే దాన్ని శ్రీవిద్యారామము అంటారు.

అస్యశ్రీ విద్యారామ మహామంత్రస్య । అర్ధనారీశ్వర ఋషిః । గాయత్రీఛందః । శ్రీ విద్యా
రామోదేవతా । రాం బీజం । స్వాహాశక్తిః । శ్రీం కీలకం । జపే వినియోగః ।

ఐం హ్రీం శ్రీం ఐం సౌః । స క ల హ్రీం । రాం రామాయ
సర్వజ్ఞ శక్తి ధామ్నే బ్రహ్మాత్మనే శ్రాం రాం హ్రాం ॥

2. క్లీం హ స క హ ల హ్రీం క్లీం రఘునందనాయ నిత్య తృప్తి
శక్తి ధామ్నే విష్ణ్వాత్మనే శ్రీంరీం హ్రీం ॥

3. సౌః క ఏ ఈ ల హ్రీం ఐం హుం జానకీవల్లభాయ స్వాహా
అనాది బోధశక్తిధామ్నే రుద్రాత్మనే శ్రూం రూం హ్రీం ॥

4. ఐం హ్రీం శ్రీం ఐం సౌః స క ల హ్రీం రాం రామాయ
స్వతంత్రశక్తి ధామ్నే ఈశ్వరాత్మనే శ్రైం రైం హ్రైం ॥

5. క్లీం హసకహల హ్రీం క్లీం రఘునందనాయ నిత్యాలుప్త
శక్తి దామ్నే సదాశివాత్మనే శ్రౌం రౌం హ్రౌం ॥

6. సౌః క ఏ ఈ ల హ్రీం ఐం హుం జానకీ వల్లభాయస్వాహా
అనంతశక్తి ధామ్నే సర్వాత్మనే శ్రః రః హః ॥
ఈ రకంగా న్యాసము.

**ధ్యానమ్ :**

*సింహాసనే సమాసీనం దివ్యే శ్రీచక్రరూపకే ।*
*బింద్వాకార మహాతార్క్ష్య సంస్థం రామం విచింతయేత్ ॥*
*వామాంకే రామభద్రస్య సంస్థితాం పద్మధారిణీం ।*
*సీతాం ధ్యాయే న్మహాలక్ష్మీం స్పృశంతం వామపాణినా ॥*
*జ్ఞానముద్రాం దక్షిణేన వహంతం పాణినాసదా ।*
*రామం ధ్యాయన్ జపేన్మంత్రం బ్రహ్మాత్మైక్య ప్రదాయకమ్ ॥*

**మంత్రము :** ఐం హ్రీం శ్రీం ఐం సౌః స క ల హ్రీం రాం రామాయ । క్లీం హ స క హ ల హ్రీం క్లీం రఘునందనాయ । సౌః క ఏ ఈ ల హ్రీం ఐం హుం జానకీవల్లభాయ స్వాహా ॥

5. గాయత్రీ మంత్రము : గాయత్రీ మంత్రాన్ని పంచదశీ మహామంత్రంతో సంపుటీకరణం చేస్తే కోటి రెట్లు ఫలితము అని చెప్పబడింది. గాయత్రీ మంత్రాన్ని సౌభాగ్య విద్యతో సంపుటీకరణం చేస్తారు.

**మంత్రము :** ఓం భూర్భువస్సువః ఐం క్లీం సౌః తత్సవితుర్వ రేణ్యం క ఏ ఈ ల హ్రీం । భర్గోదేవస్య ధీమహి హసక హలహ్రీం । ధియోయోనః ప్రచోదయాత్ స క ల హ్రీం సౌః క్లీం ఐం ।

# 5. పంచదశీ మహామంత్రము - వివిధార్థాలు

పంచదశీ మహామంత్రంలో పదిహేను బీజాక్షరాలున్నాయనీ, ఆ మంత్రం మూడు కూటములుగా ఉన్నది అని ఇది వరకే చెప్పబడినది.

*క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం। స క ల హ్రీం ।*

ఏ మంత్రమైనా సరే అర్థం పూర్తిగా తెలుసుకుని మాత్రమే జపం చెయ్యాలి, లేకపోతే ఆ ఉపాసనకు ఫలితం ఉండదు. మంత్రార్థం తెలియని జపం వ్యర్థం అని గుర్తుంచుకోవాలి.

*నార్థజ్ఞాన విహీనంచ శబ్దస్యోచ్చారణం ఫలతి ।*
*భస్మని వహ్ని విహీనే న ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥*

అగ్ని హోత్రము లేని బూడిదలో గనక నెయ్యి మొదలైన హోమద్రవ్యాలు వేసినట్లైతే ఏ రకంగా వ్యర్థమై పోతాయో, అలాగే అర్థం తెలియకుండా చేసిన మంత్ర జపం కూడా వ్యర్థమే అవుతుంది.

*అర్థ మజానానాం నానావిధ శబ్దమాత్ర పాఠవతామ్ ।*
*ఉపమేయశ్చక్రీవాన్ మలయజ భారస్య వోఢైవ ॥*

అర్థం తెలియకుండా కేవలము శబ్దము మాత్రమే పలికేవాడు మంచి గంధపు చెక్కలు మోస్తూ వాటివాసన గ్రహించలేని గాడిద వంటివాడు. ఎన్ని గంధపుచెక్కలు మోసినప్పటికీ, వాసన తెలియకపోతే గాడిదకు ఏ రకంగా ఉపయోగం లేదో అలాగే సాధకుడికి అర్థం తెలియకుండా మంత్ర జపం చేస్తే ఫలితము ఏమీ ఉండదు.

*పురుషార్థానిచ్ఛద్భిః పురుషైరర్థాః పరిజ్ఞేయాః ।*
*అర్థానాదరభాజాం నైవార్థాః ప్రత్యుతానర్థాః ॥*

చతుర్విధ పురుషార్థాలూ సాధించటానికి మంత్రార్థము ముఖ్యమైనది. వేదశాస్త్రాలు, తంత్రాలు, కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండలను ఉపదేశించేవారు. మంత్రార్థము తెలుసుకొని ఉపదేశము, అనుష్టానము చేసినట్లైతే మంచి ఫలితము ఉంటుంది. అర్థం తెలియకుండా విపరీత సాధన చేసినట్లైతే అనర్థం జరుగుతుంది, కాబట్టి మంత్రార్థం తప్పని సరిగా తెలుసుకోవాలి.

పంచదశీ మహామంత్రానికి అనేకమైన అర్థాలు చెప్పబడ్డాయి.

*అథాతః పూర్ణ గాయత్ర్యాః ప్రతిపాద్యోర్థ ఆదిమః ।*
*భావార్థ స్సంప్రదాయర్థో నిగర్భార్థ స్తురీయకః ॥*
*కౌళికార్థో రహస్యార్థో మహాతత్వార్థ ఏవచ ।*

*నామార్థ శ్శబ్దరూపార్థశ్చార్థో నామైకదేశగః ॥*
*శాక్త్యార్థ స్సామరస్యార్థ స్సమస్త సగుణార్థకౌ ।*
*మహావాక్యార్థ ఇత్యర్థాః పంచదశ్యా స్స్వసమ్మితాః ॥*

| | | |
|---|---|---|
| 1. గాయత్ర్యార్థము | 6. రహస్యార్థము | 11. శాక్త్యార్థము |
| 2. భావార్థము | 7. మహాతత్వార్థము | 12. సామరస్యార్థము |
| 3. సంప్రదాయార్థము | 8. నామార్థము | 13. సమస్తార్థము |
| 4. నిగర్భార్థము | 9. శబ్దార్థము | 14. సగుణార్థము |
| 5. కౌళికార్థము | 10. నామైకదేశార్థము | 15. మహావాక్యార్థము, |

పంచదశీ మహామంత్రానికి పదిహేను అక్షరాలున్నాయి కాబట్టి పదిహేను అర్థాలు చెప్పబడినాయి.

## గాయత్రీ మంత్రము

**గాయత్రీ ధ్యానము :**

*"భాస్వజ్జపా ప్రసూనాభాం కుమారీం పరమేశ్వరీం ।*
*రక్తాంబుజాసనారూఢాం రక్తగంధాను లేపనాం ॥*
*రక్తమాల్యాంబరధరాం చతురాస్యాం చతుర్భుజాం ।*
*ద్వినేత్రాం స్రుక్ స్రువౌ మాలాం కుండికాంచైవ బిభ్రతీం ॥*
*సర్వాభరణ సందీప్తాం ఋగ్వేదాధ్యాయినీం పరాం ।*
*హంస పత్రామాహవనీయ మధ్యస్థాం బ్రహ్మదేవతాం ॥*
*చతుష్పదామష్టకుక్షిం సప్తశీర్షాం మహేశ్వరీం ।*
*అగ్నివక్త్రాం రుద్రశిఖాం విష్ణుచిత్తాంతు భావయేత్ ॥*
*బ్రహ్మాతుకవచం యస్యాగోత్రం సాంఖ్యాయనం స్మృతం ।*
*ఆదిత్య మండలాంతస్థాం ధ్యాయేద్దేవీం మహేశ్వరీం ॥*

"గయాన్ ప్రాణాన్‌త్రాయత ఇతి గాయత్రి." అని ఐతరేయ బ్రాహ్మణములో చెప్పబడింది. అంటే ప్రాణములను రక్షించునది గాయత్రి. గయలు - అంటే ప్రాణాలు అని అర్థము "తద్యత్ప్రాణాన్‌స్త్రాయతే తద్గాయత్రీ" ప్రాణ రక్షణ చేయునది గాయత్రి అని బృహదారణ్యకములో చెప్పబడింది. "**తస్మాద్గాయంతం త్రాయతే యతః**" గానము చేయువానిని రక్షించునది గాయత్రి. "**గీయతే తత్త్వమనయా గాయత్రీతి.**" అని శంకర భాష్యము. ఈ మంత్రంలో దైవతత్వం గానంచేయబడింది. అందుచేత గాయత్రి అనబడుతోంది.

గాయత్రీ మంత్రము రెండు రకాలుగా ఉన్నది.

1. బ్రాహ్మణులకు ఉపనయనకాలంలో ఉపదేశించేది. 2) వేదాలలో నిగూఢమైనది. ఇదే పంచదశీ మహామంత్రము. అందుచేతనే గాయత్రీ మంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా పంచదశీ మహామంత్రం అన్ని వర్ణాల వారి కోసం ఏర్పడింది అని అగస్త్య మహర్షి చెప్పారు. ఇంకా చెప్పాలి అంటే గాయత్రీ మంత్రము, పంచదశీ మహామంత్రమూ ఒక్కటే! ఈ రెండింటి అర్థమూ కూడా ఒక్కటే.

శరీరాదులను రక్షించటం చేత గాయత్రి అని, తేజస్స్వరూపమవటం చేత సావిత్రి అని, వాగ్రూపము కావటం చేత సరస్వతి అని చెప్పబడుతోంది.

***"సవితృద్యోతనాత్త్సైవ సావిత్రీ పరికీర్తితా"***

ప్రపంచాన్ని సృజించి ప్రకాశింప చేస్తుంది కాబట్టి సావిత్రి అనబడుతోంది.

***'జాత: ప్రసవితృత్వాన్ వాగ్రూపత్వాత్సరస్వతీ'***

వాగ్రూపము కలది కాబట్టి సరస్వతి. ఇరవైనాలుగు అక్షరాలతో ఏర్పడ్డ ఛందస్సే గాయత్రి.

**"శుద్ధగాయత్రీ ప్రత్యక్షర బ్రహ్మైక్య బోధికా."** శుద్ధ గాయత్రిలోని ప్రతి అక్షరము పరబ్రహ్మ గూర్చే బోధిస్తుంది. అంటే జీవాత్మ పరమాత్మల ఐక్యమునే వివరిస్తుంది.

***మహా మంత్రస్య చాపస్య । స్థానేస్థానే పదేపదే ।***
***గూఢో రహస్య గర్భేన । స్తో పదేశ సముచ్చయ: ॥***

గాయత్రీ మహామంత్రములోని ప్రతి అక్షరమునందు, ప్రతి స్థానమందు మహా రహస్యము ఇమిడి ఉన్నది.

***యోదదాతి నరశ్శైతా । మపదేశాం స్తుమానసే ।***
***జాయతే హ్యభయంతస్య । లోకమానందసంకులం ॥***

గాయత్రీ మంత్రాన్ని ఉపాసన చేసే వారికి ఇహపర సుఖము పూర్తిగా కలుగుతుంది.

***గాయత్రీంచింత యేద్యస్తు । హృత్పద్మే సముపస్థితాం***
***ధర్మాధర్మ విమర్ముక్త: । సయాతి పరమాంగతి: ॥***

హృదయ పద్మమునందు అధిష్టించి ఉన్న గాయత్రిని ఉపాసన చేసేవారు ధర్మాధర్మ విముక్తులై ముక్తిని పొందుతారు.

గాయత్రీ మంత్రానికి 24 అక్షరాలుంటాయి. ప్రజాపతి సంవత్సర స్వరూపుడు. అతడే కాలస్వరూపుడు. సంవత్సరానికి 12 మాసాలు, మాసానికి రెండు పక్షాలు. ఈ రకంగా సంవత్సరానికి 24 పక్షాలుంటాయి. ఇవే గాయత్రీ మంత్రంలోని 24 అక్షరాలు. సంవత్సరానికి మూడు కాలాలు.

) వేసవి కాలము 2) వర్షాకాలము 3) శీతాకాలము. వీటి స్వరూపంగానే గాయత్రీ మంత్రము మూడు పాదములుగా ఉన్నది. ఒక్కొక్క పాదానికి 8 ఎనిమిది అక్షరాలు చొప్పున మొత్తం మంత్రంలో 24 అక్షరాలుంటాయి. గాయత్రీ మంత్రానికి గల మూడు పాదాలూ 1) భూలోకము 2) భువర్లోకము, 3) సువర్లోకము అనబడే మూడు లోకాలకు ప్రతీకలు. అందుచేతనే ఆ పాదాలను ఆ లోకాలతో సమన్వయపరచి ధ్యానించాలి.

1. **మొదటి పాదము** : భూలోక సమన్వయము. అంటే భౌతికమైన సృష్టి రూపంలో ధ్యానం చేయాలి.

2. **రెండవ పాదము** : భువర్లోకముతో సమన్వయము. అంటే శక్తి మయాత్మక రూపంలో ధ్యానం చెయ్యాలి.

3. **మూడవ పాదము** : సువర్లోకముతో సమన్వయము, అంటే ప్రజ్ఞామయాత్మక సృష్టి రూపంలో ధ్యానం చెయ్యాలి.

ఈ విధంగా ధ్యానం చేసేటప్పుడు ముందు ద్రవ్యాత్మక లోకానికి అధిష్ఠాన దేవతలయిన అష్ట వసువుల అనుగ్రహం కలుగుతుంది. ఆ తరువాత శక్తి మయాత్మక లోకానికి అధిష్ఠాన దేవతలయిన ఏకాదశ రుద్రుల అనుగ్రహం కలుగుతుంది. అటుపైన ప్రజ్ఞామయాత్మక లోకానికి అధిష్ఠాన దేవతలైన ద్వాదశాదిత్యుల అనుగ్రహం కలుగుతుంది.

1. **గాయత్రీ మంత్రార్థము**

***ఓం భూర్భువస్సువః తత్సవితుర్వ రేణ్యమ్***
***భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ॥***

ఇది గాయత్రీ మంత్రము. ఈ మంత్రానికి అర్థం ఈ క్రింది విధంగా చెప్పబడింది.

**ఓంకారము :** ఓంకారమనేది పరబ్రహ్మ స్వరూపము. ఇదే నాదబ్రహ్మము. దీన్నే ప్రణవము అంటారు. దీని నుంచే సమస్త శబ్దాలు, మంత్రాలూ, ఉత్పన్నమైనాయి. అందుచేతనే ఓంకారము సర్వమంత్రములకు హేతువు. ప్రణవము నుంచి వ్యాహృతులు పుట్టినాయి. వ్యాహృతుల నుంచి మూడు వేదాలూ పుట్టినాయి. ప్రణవమే **భూర్భువస్సువ :** అనే వ్యాహృతులు. ఇవి ఓం భూః, ఓం భువః, ఓం సువః అనేవి.

భూ : నుండి - ఋగ్వేదము

భువః నుండి - యజుర్వేదము

సువః నుండి - సామవేదము ఏర్పడినాయి.

ఏడు వ్యాహృతులందు ఓంకారము మాటిమాటికీ చెప్పబడుతుంది. ఈ ఏడు వ్యాహృతులూ, ఏడు లోకాలకు ప్రతీకలు. అందుచేతనే ఓంకారము సర్వలోక వ్యాప్తము. సమస్త వేదాసారము.

ఓం భూర్భువస్సువః ఇది వ్యాహృతిత్రయము.

(ఓం భూః, ఓం భువః, ఓం సువః)

భూః, భువః, సువః, మహః, జనః, తపః, ఓగ్ంసత్యం ఇవి సప్తవ్యాహృతులు. గాయత్రీమంత్రాన్ని

| | |
|---|---|
| బ్రహ్మచారి, గృహస్థులు | - ప్రణయత్రయ సహితముగాను, |
| వానప్రస్తులు | - పంచప్రణవ సహితముగాను, |
| సన్యాసులు | - ఏక ప్రణవ మంత్రమును |

జపించాలని వసిష్టాది మహర్షులు చెప్పారు.

ప్రణవత్రయము అంటే - వ్యాహృతిత్రయము ముందు ఒకటి, మొదటి పాదము ముందు ఒకటి, తురీయపాదము ముందు ఒకటి. మొత్తం మూడు ప్రణవాలు.

పంచ ప్రణవాలు అంటే - ఆద్యంతములందు ప్రణావాలు రెండు, గాయత్రీ మంత్రపాదత్రయాదిన ఉన్న ప్రణవాలు మూడు. మొత్తం ఐదు.

ఏక ప్రణవము అంటే - గాయత్రీ మంత్రంలోని మూడు పాదాలూ వ్యాహృతిత్రయములో కలిసి పోతాయి. వ్యాహృతిత్రయము అకార ఉకార మకారములలో కలిసి పోతుంది. ఇప్పుడు మిగిలేది ఓంకారము ఒక్కటే. ఇదే యతులు ఉపాసించతగినది.

**గాయత్రీ మంత్రార్థము :** గాయత్రీ మంత్రము మొత్తం నాలుగు పాదములతో ఉంటుంది. దాన్ని పూర్ణ గాయత్రి అంటారు. ఈ మంత్రానికి అనేక రకాల అర్థాలు చెప్పటం జరిగింది. అవి.

| | | |
|---|---|---|
| 1. భావార్థము | 6. మహాతత్వార్థము | 11. సామరస్యార్థము |
| 2. సంప్రదాయార్థము | 7. నామార్థము | 12. సమస్తార్థము |
| 3. నిగర్భార్థము | 8. శబ్దార్థము | 13. సగుణార్థము |
| 4. కౌళికార్థము | 9. నామైకదేశార్థము | 14. మహావాక్యార్థము, |
| 5. రహస్యార్థము | 10. శాక్యార్థము | |

గాయత్రీ మంత్రానికి ఎంత అర్థం ఉన్నదో పంచదశీ మంత్రంలోగల ఒక పాదానికే అంతఅర్థం ఉంది. కాబట్టి పంచదశిని ఒకసారి జపిస్తే పూర్ణ గాయత్రిని మూడుసార్లు జపించిన ఫలితం వస్తుంది. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడు పదములకు సృష్టికర్త అయిన బ్రహ్మ అని అర్థము.

గాయత్రీ మంత్రంలో ఓంకారము తరువాత **భూః భువః సువః.** అని మూడు వ్యాహృతులున్నాయి. వీటికి త్రికము అని పేరు. ఈత్రికము అనేకార్థ బోధకము. అనేక భావనలకు,

నేక దిశలకు సంకేతము. ఇవి త్రిమూర్తులకు, సృష్టిస్థితి లయాలకు, ప్రతీకలు. సత్వరజస్తమో ుణాలనే త్రివిధ గాయత్రి అంటారు.

భూః - బ్రహ్మ, భువః - ప్రకృతి, సువః - జీవుడు. ముల్లోకాలకూ ఈత్రికము సంకేతము. గ్ని వాయు సూర్యులకు ప్రతీక. విరాడ్రూపమైన భగవంతుని సంబంధమైన జ్ఞానాన్ని ప్రకాశింప సేది వ్యాహృతి.

**భూర్భువస్సువ :** అనేవి బ్రహ్మ యొక్క జ్ఞాన దేహము నుంచి వ్యవహరింపబడటం చేత నికి వ్యాహృతులని పేరు వచ్చింది. భూర్భువస్సువములు బ్రహ్మ స్వరూపము. జలము ఓంకార ూపము. బ్రహ్మ లేనిదే సృష్టిలేదు. వ్యాహృతులనుంచే అగ్ని, వాయువు, సూర్యుడు ఉద్భవించారు. ఈ వ్యాహృతులను జపించిన వారు సర్వవేదపారాయణ చేసిన ఫలితము పొందుతారు. వేదసారము ఉపనిషత్తులు. ఉపనిషత్సారము గాయత్రి. గాయత్రీ సారము -వ్యాహృతిత్రయము.

వ్యాహృతిత్రయము : 1) ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి.

2) భూలోక, భువర్లోక, సువర్లోకములు

3) కరణము, శరీరము, సంసారము.

స్వర్గ నరకాలు మానవుడే స్వయంగా సృష్టించుకుంటాడు. సత్వరజస్తమో గుణాలు బంధ హేతువులు. వీటిని చక్కగా ఉపయోగించుకొంటే ముక్తికి కారణమవుతాయి. త్రిమూర్తుల యొక్క, సృష్టిస్థితి లయల యొక్క తత్త్వము వ్యాహృతముల యందు నిగూఢమై ఉన్నది.

**తత్ :** గాయత్రీ మంత్రంలో తత్ అనే శబ్దము పరమాత్మనుద్దేశించి చెప్పబడుతోంది. కాని పరమాత్మ రూపమైన వస్తువు సాధకుని దీక్షపైన, అతని కళ్ళలోని వెలుగుపైన ఆధారపడి ఉంటుంది. శబ్ద స్పర్శ రూప రస గంధములనబడే తన్మాత్రల చేత పరబ్రహ్మను సాధించటం సాధ్యం కాదు. అంతరాత్మ ద్వారానే అది సాధ్యం.

తచ్ఛబ్దముతో స్వయంభువమగు పరమాత్మ నిర్దేశింపబడింది. అని శంకర భాష్యంలో చెప్పబడింది. ఓం తత్ సత్ అనే మూడు శబ్దములు పరబ్రహ్మ నిర్దేశికములవటం చేత 'తత్' బ్రహ్మ స్వరూపము.

**సవితు :** సవిత్య శబ్దానికి సూర్యుడని అర్థము, సూర్యుడు ప్రత్యక్ష దైవము. తేజస్వరూపి. పరమాత్మ తేజము స్థూల నేత్రాలకు సూర్య నారాయణమూర్తిగా గోచరిస్తుంది. ప్రకాశించే సూర్య గోళమే సూర్యుడు కాదు. తేజోమయుడైన సృష్టికర్తయే 'సవిత' పరమాత్మ కనేక శక్తులు, రూపాలు ఉన్నాయి. వాటిలో తేజశ్శక్తులను సవిత అంటారు. అటువంటి సవితనే గాయత్రీ మంత్రంలో ఉపాసన చేస్తారు.

సవిత ప్రాణులను సృష్టిస్తుంది. సర్వ భావాలను కలిగిస్తుంది. పరమాత్మ యొక్క ముఖము తేజోమండలం చేత కప్పబడి ఉంటుంది. సూర్యమండలంలోనే అవ్యయుడైన పరమాత్మను ధ్యానించాలి.

సూర్యుని వల్లనే సృష్టి జరుగుతున్నది. అతడే స్థితికర్త. అతని యందే లోకాలు లయమవుతున్నాయి. అతని తేజస్సు నాశరహితమైనది. త్రివేదరూపి, తేజోమయుడు, సప్తాశ్వరథము మీద పయనిస్తూ ఉంటాడు. త్రిమూర్త్యాత్మకుడైన సవిత్యునకు భిన్నమైన దేవుడు లేడు. ప్రాణము, చంద్రుడు, విద్యుత్తూ అన్నీ సూర్యుడే. సమస్త ప్రపంచమును సృష్టించి, పాలించి, లయమొందించువాడు సూర్యుడే. బంగారు గడ్డము, బంగారు కేశముల కలిగి సూర్యమండలంలో కనిపిస్తున్నాడు. అతని కాలిగోరు నుంచి శిఖవరకు కాంతులచే ప్రకాశిస్తున్నాయి. లోకాలకు నేత్రమువంటివాడు, సృష్టిస్థితి లయాలకు కారణమైనవాడు, త్రివేద స్వరూపి, త్రిగుణ స్వరూపి, త్రిమూర్త్యాత్మకుడు అయిన సవిత్యునకు నమస్కారము.

**వరేణ్యమ్ :** స్వీకరించటానికి, దానము చెయ్యటానికి యోగ్యమైన దానిని వరేణ్యమంటారు. ధర్మము, కర్తవ్యము, అధ్యాత్మతత్త్వము, సచ్చిదానంద స్వరూపము, సత్యం శివం సుందరం వైపు మనలను నడిపించగల తత్త్వమే వరేణ్యమ్.

ఈశ్వర సంబంధమైన వరేణ్యశక్తి గాయత్రి యందున్నది. దీనివల్ల గాయత్రీ మంత్రోపాసకుని దృష్టి కోణము శ్రేష్టమవుతుంది. సంసారానికి భయపడనివారు, మోక్షగాములు సూర్య మండలంలో ఉన్న భర్గనామ తేజస్సును ప్రార్థించాలి. వరేణ్యము అంటే జనన మరణాది భయమునశించుటకు ప్రార్థింపతగినది. వరేణ్యము అంటే ప్రార్థించుటకు అర్హమైనది. అభేద జ్ఞానముచే తెలియ తగినదే వరేణ్యము. సమస్త తేజములకన్నా శ్రేష్టమైనది, వర్ణింప తగినది, స్వర్గము, మోక్షము కోరువారు ప్రార్థింపతగినది.

**భర్గ :** చెడు నుండి, అజ్ఞానాంధకారము నుండి తప్పించి రక్షించే పరమేశ్వరుణ్ణి 'భర్గ' అంటారు. వరేణ్యశక్తి ఎంత అవసరమో భర్గ శక్తి కూడా మనకు అంతే అవసరము. జీవితంలో మంచి చెడు అనే విషయాలు రెండున్నాయి. సద్విషయాలలో దైవశక్తులు, చెడ్డ విషయాలలో అసురశక్తులు ఉంటాయి. కాబట్టి చెడు విషయాలలో జాగర్త వహించవలసి ఉంటుంది.

సూర్య భగవానుని ఆత్మరూపము సర్వ ప్రాణులు ప్రార్థింపతగినది. చైతన్య లక్షణమైనది, తేజమైనది అయిన భర్గము (తేజస్సు) సేవింపదగినది. కాంతి రూపమవటం చేత భర్గ అని, పూర్ణ రూపముచే పురుషుడని, సర్వప్రాణి రూపి అవటం చేత ఆత్మ అని చెప్పబడుతుంది. ఈ భర్గము హృదయాకాశములోనూ, బయట సూర్యమండలంలోనూ ప్రకాశిస్తుంది. సప్త స్ఫులింగములతో ప్రకాశించు అగ్ని, కాలాగ్ని రూపంలో ప్రకాశిస్తూ భర్గ అనే పేరుతో విరాజిల్లుతుంటుంది. ఈ భర్గము అన్నిటికన్న శ్రేష్టమైనది. పరిపూర్ణమైనది. అందుచేత పురుషుడని చెప్పబడుతుంది. సంసార

పరమైన భయాన్ని తొలగించి, శుభాన్ని కలిగించటంచేత శివుడని చెప్పబడుతుంది. జనన మరణాది దుఃఖాలకు మూలకారణమైన పాపాలను నశింప చేసేదే భర్గము. అ విద్యను, దాని వలన కలిగే పాపకార్యములను నశింప చేసే భర్గము స్వయం ప్రకాశమైన బ్రహ్మతేజము. స్వప్రకాశముచే బాహ్యాంభ్యంతర ప్రపంచములనుండి అంధకారమును తొలగచేయునది భర్గము. తేజో రూపమైన భర్గమమే పరబ్రహ్మము. ఈశ్వర స్వరూపము, పురుష వాచ్యము, సత్యము, ధర్మ రూపము, నాశరహితము, అయిన భర్గమే ముక్తి హేతువైన విష్ణు తేజము. అదే శివుడని, శక్తి అని, సూర్యుడు అని, అగ్ని అని అంటారు. తేజోబలములను కోరువారికి భర్గోపాసన మిక్కిలి అవసరము. శారీరక, మానసిక, ఆర్థిక, చారిత్రక పుష్టి కలిగించునది భర్గము.

**దేవస్య:** సర్వ ప్రాణులలోను ఆత్మరూపమున ప్రకాశిస్తూ, కీర్తించబడుచూ, సర్వ వ్యాప్తమైన వానిని దేవుడు అంటారు. సర్వ ప్రకాశుడు, చైతన్య రూపుడు, అఖండమైనవాడు, ఏకరూపము గలవాడు దేవుడు. ఒక్క దేవుడే సమస్త ప్రాణులలోనూ వ్యాపించి ఉండే ఆత్మ. అతడే కర్మలకు ప్రభువు. సర్వ కర్మలకు నివాస భూతుడు. స్వర్గమున ప్రకాశించేవాడు; ఎవరైతే అతణ్ణి ధ్యానిస్తారో, అతని హృదయంలో నివశించేవాడు దేవుడు.

**ధీమహి :** ధ్యానం చెయ్యటాన్నే ధీమహి అంటారు. మనందేన్నయితే ధ్యానిస్తున్నామో, దాని యందు మనసు లగ్నమవుతుంది. అప్పుడే ఆకాంక్ష అధికమవుతుంది. దానివల్లనే ప్రయత్నం జరుగుతుంది. దీనివల్లనే అభీష్టసిద్ధి జరుగుతుంది. అప్పుడే ద్యానము సఫలమవుతుంది.

**ధియః:** 'ధీ' అంటే బుద్ధి 'ధియః' అంటే బుద్ధులను ధర్మాది విషయకమే బుద్ధి. ధారణచేసేదే బుద్ధి.

**యః :** యః అనే శబ్దానికి ఎవడైతే, ఏదైతే అని అర్థము. ఈ సంకేతము పరమాత్మకు వర్తిస్తుంది. గాయత్రీ మంత్రంలో ఇంతవరకు వర్ణించబడిన పరమాత్మయే ఇక్కడ చెప్పబడుతోంది. యః శబ్దము ఆత్మరూపము. ఈ శుద్ధాత్మయే పరమాత్మ. అందుచేతనే యః శబ్దము దేవుని నిర్దేశిస్తుంది.

**నః :** నః అంటే మా యొక్క అని అర్థం. పరమాత్మ నుంచి మంచి బుద్ధి లభించటం తనకొక్కడికే కాక మానవ సమాజానికే కావాలనీ సూచించటానికే మా యొక్క (నః) అని చెప్పబడింది. దీనివలన గాయత్రీ మంత్రోపాసన చేసేవారు విశ్వమానవాళి యొక్క శ్రేయస్సును దృష్టిలో ఉంచుకుని వసుధైక కుటుంబం కోసం ధ్యానం చేస్తారు.

**ప్రచోదయాత్:** ప్రచోదయాత్ అంటే ప్రేరేపించుట, పెంపొందించుట. గాయత్రీ మంత్రము చెయ్యటంలో ఉద్దేశ్యము లోకంలోని జనులందరికీ మంచి బుద్ధిని ప్రసాదించమని ప్రార్థించటమే. ప్రచోదయాత్ అంటే మంచి బుద్ధిని ప్రేరణ చెయ్యమని పరమాత్మను ప్రార్థించటం.

ఈ మంత్రంలో ప్రచోదయాత్ అనేది ముఖ్యమైనది. సాధకుడు సద్బుద్ధి కలగాలని పరమాత్మను ప్రార్థిస్తున్నాడు. ఈ రకంగా సద్బుద్ధి కలిగినవాడు తనకు కావలసినవన్నీ పొందగలుగుతాడు. అంతే కాకుండా అతడికి ఆత్మ సాక్షాత్కారము కుడా కలుగుతుంది.

| | | |
|---|---|---|
| ఓమ్ | - | బ్రహ్మ |
| భూః | - | ప్రణవ స్వరూపము |
| భువః | - | దుఃఖ నాశనము |
| స్వః | - | సుఖ స్వరూపము |
| తత్ | - | ఆ |
| సవితుః | - | తేజస్సుచే ప్రకాశించు |
| దేవస్య | - | దేవుని యొక్క |
| వరేణ్యం | - | శ్రేష్టమైన |
| భర్గః | - | పాపనాశనమైన తేజమును |
| ధీమహి | - | ధ్యానింతును |
| యః | - | ఏదైతే |
| నః | - | మా యొక్క |
| ధియః | - | బుద్ధులను |
| ప్రచోదయాత్ | - | ప్రేరేపింతురో, ఆ తేజస్సును ధ్యానింతును. |

## I. పంచదశీ మంత్రానికి గాయత్ర్యర్థము

పంచదశీ మహా మంత్రము, గాయత్రీ మంత్రమూ రెండూ ఒక్కటే అని భాస్కరరాయల వారు చెబుతూ తమ వరివశ్యా రహస్యములోని 60, 61, 62, 63 శ్లోకాలలో పంచదశీమహా మంత్రానికి గాయత్ర్యర్థ నిరూపణం చేయుట జరిగింది.

*కామయతేన కకారః కామో బ్రహ్మైవ తత్పద స్యార్థః ।*
*సవితుర్వ రేణ్య మితివై సవితుః శ్రేష్టం ద్వితీయ వర్ణార్థః ॥*

పంచదశీ మహామంత్రంలోని క కారానికి సమస్త జగత్తునూ సృష్టించాలనే కోరిక గల బ్రహ్మ అని అర్థం. గాయత్రీ మంత్రంలోని మొదటి మూడు పదాలకు బ్రహ్మ అని అర్థం. రెండవ అక్షరమైన ఏకారము గాయత్రీ మంత్రంలోని సవితుః శ్రేష్టమైన అని అర్థం. మూడో అక్షరమైన ఈకారము గాయత్రీ మంత్రంలోని భర్గోదేవస్యధీ అయిన పరమేశ్వరుణ్ణి సూచిస్తుంది.

*యదేకాదశ మాధారం బీజం కోణత్రయాత్మకమ్ ।*
*బ్రహ్మాండాది కటాహాంతం, జగ ద్వాపిచ దృశ్యతే ॥*

ఈ రకంగా శ్రీ విద్యలోని ప్రథమ కూటమిలోని రెండు అక్షరములూ, గాయత్రి మంత్రంలోని ప్రథమ పాదముచేత తెలియబడు జగత్కారణ భూతులైన కామేశ్వరీ కామేశ్వరులను చెబుతున్నది. వారిద్దరి యొక్క సామరస్యమే పరమశివుడు. అతని పరిణామమే జగత్తు. అతడే సమస్త బుద్ధులకూ ప్రేరకుడు. త్రిగుణాలకూ అతీతుడు. ప్రణవ స్వరూపుడు.

**సర్వాంతర్యామి ద ద్భర్గో దేవస్యధీతి తుర్యార్థః ।**
**పృథివీ మహీలకార స్తృతీయ తుర్యాంఘ్రి బోధికామయా ॥**

గాయత్రీ మంత్రంలోని మహి అనే శబ్దము శ్రీవిద్యలోని లకారాన్ని సూచిస్తుంది. లకారము పృథివీ బీజం కాబట్టి, దాని నుంచి పంచ భూతాత్మకమైన జగత్తు తెలుస్తుంది. ఈ జగత్తంతా పరమేశ్వరుని వల్ల సృష్టించబడింది. ఆ పరమేశ్వరుని ప్రతిబింబమే మహా త్రిపురసుందరి.

**"ధియో యోనః ప్రచోదయాత్, పరోరజసేసావదోం"** అను గాయత్రీ మంత్రంలోని చివరి రెండు పాదాల అర్థము శ్రీవిద్యలోని హ్రీంకారార్థమూ ఒక్కటే.

**"తృతీయ తుర్యాంఘ్రి బోధికామాయాం."** అంటే గాయత్రీ మంత్రంలోని మూడు, నాలుగు చరణములచే చెప్పబడు అర్థము, హ్రీంకారార్థము ఒక్కటే. మూడవ పాదము **"ధియో: యోనః ప్రచోదయాత్."** అంటే పరమేశ్వరుడు సర్వాంతర్యామియై మా బుద్ధులను ప్రేరణ చేయుగాక.

**"పరోరజ సేసావదోం"** అనే నాల్గవ పాదానికి త్రిగుణాతీతుడైన పరమేశ్వరుడు, మాటలచేత వర్ణింప శక్యము కానివాడు, లక్షణములచేత మాత్రమే చెప్పదగినవాడు, ఓంకార స్వరూపుడు అని అర్థము. **యతో వాచో నివర్తంతే** అంటే మాటలచేత చెప్పనలవి కానివాడు.

**"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, వేదైశ్చ సర్వైరహమేవ వేద్య"** అంటే లక్షణములచేత తెలియ తగినవాడు. మాయాబీజమైన హ్రీంకారానికి హృదయమని అర్థము. ఈ కారానికి సర్వాధారుడు, సర్వాంతర్యామి అయిన శివుడు అని అర్థము. ఈ రకంగా పూర్ణ గాయత్రీ మంత్రం యొక్క అర్థం శ్రీవిద్యలోని ప్రథమ కూటమిలో చెప్పబడింది.

జగత్తును సృష్టించాలనే కోరిక గల కామేశ్వరుడు, జగత్తుకు కారణ భూతురాలయిన కామేశ్వరి, వీరిద్దరి సామరస్య స్వరూపమయిన పరమశివతత్త్వము, సర్వ ప్రపంచ రూపంగా పరిణమించి సర్వాంతర్యామి అయి, సర్వాధారమయింది. కాబట్టి మన బుద్ధి, ప్రవృత్తులను పరబ్రహ్మతత్త్వమందు ప్రేరణ చేయగాక అని శ్రీవిద్యలోని మొదటి కూటానికి అర్థము.

**త్రిపదీ త్రివర్ణబోద్యా తుర్య స్తదుపరి షడక్షరోగమకః**
**అథతార్తీయే వర్ణ ద్వితీయం త్రిపదీ షడక్షరీ గమకమ్ ॥**

గాయత్రీ మంత్రంలోని "తత్సవితుర్వరేణ్యం" అనే మూడుపదాల అర్థము శ్రీవిద్యలోని రెండవ కూటమి యొక్క మూడు అక్షరములకు (హసక) చెప్పబడింది. గాయత్రిలోని "భర్గోదేవ

స్యధీమహి" అనే ఆరు అక్షరాల అర్థం రెండవ కూటమిలోని హకారము చెబుతున్నది. గాయత్రీ మంత్రంలోని "తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీ" అనే పదాల అర్థము, శ్రీవిద్యలోని మూడవ కూటమిలోని సక అనే అక్షరాలకు వర్తిస్తుంది.

***కూటద్వితయే శేషం పూర్వవదున్నేయ మితితు విద్యాయా: ।***
***గాయత్ర్యర్థ స్త్రిపురోపనిషదికథిత స్తథైవ భాగవతే ॥***

శ్రీవిద్యలోని రెండు, మూడు కూటములందు గల లహ్రీం అనే రెండు అక్షరాలకూ, గాయత్రీ మంత్రంలోని "**మహిధియో యోన: ప్రచోదయాత్ । పరోరజసే సావదోం।**" భాగానికి గల అర్థమే చెప్పబడింది.

పంచదశిలోని ఒక్కొక్క కూటమికే పూర్ణ గాయత్రి అర్థమున్నది. కాబట్టి శ్రీవిద్యను ఒకసారి జపిస్తే గాయత్రి మంత్రాన్ని మూడు సార్లు జపించిన ఫలితం వస్తుంది.

**దేవీ భాగవతము :** దేవీ భాగవంతలోని మొట్ట మొదటి శ్లోకంలో గాయత్రీ మంత్రము యొక్క సారమే శ్రీవిద్య అని వివరించటం జరిగింది.

***ఓం సర్వ చైతన్య రూపాం తా మాద్యాం విద్యాంచ ధీమహీ ।***
***బుద్ధిం యోన: ప్రచోదయాత్.***

మా బుద్ధులను ఆత్మచింతనకై ప్రేరేపించు దేవి, సర్వ చైతన్య రూపము, ఆద్య, మహావిద్య అగు శ్రీ భగవతిని ధ్యానింతుము.

ఆ పరమేశ్వరి రూప పరిణామమే సకల చరాచర జగత్తు అవటం చేత ఆమె 'స్వరూప' అని చెప్పబడుతోంది. చైతన్యాత్మకమైనటువంటి ఆమె రూపమైన ఈ జగత్తులోని ప్రాణులన్నీ ఆమె యొక్క చిద్రూపాలే. కాబట్టి ఆ పరమేశ్వరి సర్వభూతములందలి చైతన్యము అయి ఉన్నది. ఆమె అన్నింటికీ ఆద్య. పరతత్త్వ సాక్షాత్కారానికి సాధన విద్య. అటువంటి విద్యలన్నింటిలోకీ శ్రేష్ఠమైనది శ్రీవిద్య కాబట్టి ఇది ఓంకార స్వరూపము. అకార ఉకార మకారముల రూపము. ఆ ప్రణవవిద్య యొక్క విస్తృత రూపమే గాయత్రీ మంత్రము. గాయత్రీ మంత్ర రూపాంతరమే పంచదశీ మహావిద్య. దానిలో కాది విద్యకు ఆదివిద్య అని పేరు. విద్యకూ, విద్యచేత ప్రతిపాదింపబడే తత్త్వానికీ తేడా లేదు. అందుచేతనే అది 'ఆది విద్య' అనబడుతోంది. ఆ దేవి మనందరిలోనూ బుద్ధిని ప్రేరేపిస్తుంది.

ఆ ప్రేరణకు మూలము సంకల్పము. అంటే ఇచ్ఛ, బుద్ధిలకు సంబంధించిన జ్ఞానము. ఈ జ్ఞానాన్ననుసరించే సృష్ట్యాదికృత్యములు జరుగుతాయి. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు మూడు ఆ పరమేశ్వరి రూపాలే. ఆమె శక్తి త్రయ రూప, మాయారూప, త్రిగుణాత్మిక, మాయా పరిమాణ జగద్రూప. మాయా పాశాలను త్రెంచి వేసే విద్యారూప, గాయత్రీఛందోరూప అని దేవీ భాగవతంలోని మొదటి శ్లోకంలో వివరించబడింది.

ద్వాదశ స్కంధములో గాయత్రీ మంత్రాన్ని ఈ విధంగా చెప్పటం జరిగింది.

## ఋషులు

గాయత్రీ మంత్రానికి 24 మంది ఋషులు చెప్పబడుతున్నారు.

*వామదేవో త్రిర్వసిష్ఠః శుక్రః కణ్వః పరాశరః ।*
*విశ్వామిత్రో మహాతేజాః కపిలః శౌనకో మహాన్.*

*యాజ్ఞవల్కో భరద్వాజో జమదగ్ని స్తపోనిధిః ।*
*గౌతమో ముద్గలశ్చైవ వేదవ్యాసశ్చ లోమశః.*

*అగస్త్యః కౌశికో వత్సః పులస్త్యో మాండుక స్తథా ।*
*దుర్వాసా స్తపతాంశ్రేష్ఠో నారదః కశ్యప స్తథా.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | వామదేవుడు | 9. | శౌనకుడు | 17. | అగస్త్యుడు |
| 2. | అత్రి | 10. | యాజ్ఞవల్క్యుడు | 18. | కౌశికుడు |
| 3. | వసిష్ఠుడు | 11. | భరద్వాజుడు | 19. | వత్సుడు |
| 4. | శుక్రుడు | 12. | జమదగ్ని | 20. | పులత్స్యుడు |
| 5. | కణ్వుడు | 13. | గౌతముడు | 21. | మాండూకుడు |
| 6. | పరాశరుడు | 14. | ముద్గలుడు | 22. | దుర్వాసుడు |
| 7. | విశ్వామిత్రుడు | 15. | వ్యాసుడు | 23. | నారదుడు |
| 8. | కపిలుడు | 16. | లోమశుడు | 24. | కశ్యపుడు |

## ఛందస్సు

గాయత్రీ మంత్రానికి 24 ఛందస్సులు చెప్పబడుతున్నాయి.

*ఇత్యేతే ఋషయః ప్రోక్తా వర్ణానాం క్రమశో మునే।*
*గాయత్ర్యుష్ణిగనుష్టుప్చ బృహతీ పంక్తిరేవచ.*

*త్రిష్టుభం జగతీ చైవ తథాఽతిజగతీ మతా।*
*శక్వర్యతి శక్వరీ చ ధృతిశ్చాతిధృతిస్తథా.*

*విరాట్ప్రస్తార పంక్తి శ్చ కృతిః ప్రకృతి రాకృతిః*
*వికృతిః సంకృతి శ్చైవాక్షర పంక్తి స్తథైవ చ.*

*భూర్భువః స్వరితి చ్ఛందస్తథా జ్యోతిష్మతీ స్మృతమ్।*
*ఇత్యేతానిచ ఛందాంసి కీర్తితాని మహామునే.*

1. గాయత్రి
2. ఉష్ణిక్
3. అనుష్టుప్
4. బృహతీ
5. పంక్తి
6. త్రిష్టుభము
7. జగతి
8. అతి జగతి
9. శక్వరి
10. అతిశక్వరి
11. ధృతి
12. అతి ధృతి
13. విరాట్
14. ప్రసార పంక్తి
15. కృతి
16. ప్రకృతి
17. ఆకృతి
18. వికృతి
19. సంకృతి
20. అక్షర పంక్తి
21. భూః
22. ర్భువః
23. స్వః
24. జ్యోతిష్మతి

## దేవతలు

గాయత్రీ మంత్రానికి దేవతలు ఈ క్రింది విధంగా ఉన్నారు.

దైవతాని శృణు ప్రాజ్ఞ తేషా మేవానుపూర్వశః।
ఆగ్నేయం ప్రథమం ప్రోక్తం ప్రాజ్యాపత్యం ద్వితీయకమ్.

తృతీయం చ తథా సౌమ్య మీశానం చ చతుర్థకమ్।
సావిత్రం పంచమం ప్రోక్తం షష్ఠ మాదిత్యదైవతమ్.

బార్హస్పత్యం సప్తమం తు మైత్రావరుణ మష్టమమ్।
నవమం భగదైవత్యం దశమంచార్యమేశ్వరమ్.

గణేశ మేకాదశకం త్వాష్ట్రం ద్వాదశకం స్మృతమ్।
పౌష్ణం త్రయోదశం ప్రోక్త మైంద్రాగ్నం చ చతుర్దశమ్.

వాయవ్యం పంచదశకం వామదేవ్యం చ షోడశమ్।
మైత్రావరుణ దైవత్యం ప్రోక్తం సప్తదశాక్షరమ్.

అష్టాదశం వైశ్వదేవ మూనవింశం తు మాతృకమ్।
వైష్ణవం వింసతితమం వసుదైవత మీరితమ్.

ఏకవింశతి సంఖ్యాకం ద్వావింశం రుద్రదైవతమ్।
త్రయోవింశం చ కౌబేర మాశ్వినం తత్త్వసంఖ్యాకమ్.

చతుర్వింశతివర్ణానాం దేవతానాం చ సంగ్రహః।
కథితః పరమ శ్రేష్ఠో మహాపాపైకశోధనః.
యదాకర్ణనమాత్రేణ సాంగం జాప్యఫలం మునే ।

1. అగ్ని
2. ప్రజాపతి
3. చంద్రుడు
4. ఈశానుడు
5. సవిత
6. ఆదిత్యుడు
7. బృహస్పతి
8. మైత్రావరుణుడు
9. భగుడు
10. యముడు
11. గణేశుడు
12. త్వష్ట
13. పూష
14. ఇంద్రాగ్ని
15. వాయువు
16. వామదేవుడు
17. మైత్రావరుణుడు
18. వైశ్వ దేవుడు
19. మాతృకలు
20. విష్ణువు
21. వసువు
22. రుద్రుడు
23. కుబేరుడు
24. అశ్వినీకుమారులు

## శక్తులు

గాయత్రీ మంత్రానికి శక్తులు ఈ విధంగా ఉన్నాయి.

***నారాయణ ఉవాచ :***

*వర్ణానాం శక్తయః కాశ్చతాః శృణుశ్వ మహామునే ।*
*వామదేవీ ప్రియా సత్యా విశ్వభద్రా విలాసినీ ॥*

*ప్రభావతీ జయా శాంతా కాంతా దుర్గా సరస్వతీ ।*
*విద్రుమా చ విశాలేశా వ్యాపినీ విమలా తథా ॥*

*తమో పహారిణీ సూక్ష్మా విశ్వయోని ర్విజయా వశా ।*
*పద్మాలయా పరాశోభా భద్రా చ త్రిపదాస్మృతా ॥*
*చతుర్వింశతి వర్ణానాం శక్తయః సముదాహృతాః ।*

1. వామదేవి
2. ప్రియా
3. సత్యా
4. విశ్వభద్ర
5. విలాసినీ
6. ప్రభావతీ
7. జయా
8. శాంతా
9. కాంతా
10. దుర్గా
11. సరస్వతీ
12. విద్రుమా
13. విశాలేశా
14. వ్యాపినీ
15. విమలా
16. తమోపహారిణీ
17. సూక్ష్మా
18. విశ్వయోని
19. విజయా
20. వశా
21. పద్మాలయా
22. పరాశోభా
23. భద్రా
24. త్రిపదా

## వర్ణముల రంగులు

గాయత్రీ మంత్రంలోని అక్షరాలకు రంగులు ఈ విధంగా ఉన్నాయి.

**అతఃపరం వర్ణవర్ణా న్వ్యాహరామి యథాతథమ్.**
**చంపకంచాతసీ పుష్పసన్నిభం విద్రుమం తథా।**
**స్ఫటికాకారకం చైవ పద్మపుష్ప సమప్రభమ్.**
**తరుణాదిత్య సంకాశం సంఖకుందేందు సన్నిభమ్।**
**ప్రవాళం పద్మపత్రాభం పద్మరాగసమ ప్రభమ్.**
**ఇంద్రనీలమణి ప్రఖ్యం మౌక్తికం కుంకుమప్రభమ్।**
**అంజనా భం చ రక్తం చ వైడూర్యం క్షౌద్రసన్నిభమ్.**
**హారిద్రకుంద దుగ్ధాభం రవికాంతి సమప్రభమ్।**
**శుకపుచ్ఛనిభం తద్వ చ్ఛతపత్రనిభం తథా.**
**కేతకీపుష్ప సంకాశం మల్లికా కుసుమప్రభమ్।**
**కరవీరశ్చ ఇత్యేతే క్రమేణ పరికీర్తితాః**

1. సంపంగి
2. అవిసె
3. పగడము
4. స్ఫటికము
5. పద్మ పుష్పము
6. బాలాదిత్యుడు
7. శంఖకుందేలు
8. పగడము
9. పద్మ రాగము
10. ఇంద్ర నీలమణి
11. ముత్యము
12. కుంకుమ
13. కాటుక
14. రక్తము
15. వైడూర్యము
16. తేనె
17. పసుపు
18. పాలమిశ్రణము
19. సూర్యకాంతి
20. చిలుకతోక రంగు
21. శతపత్రకాంతి
22. కేతకీ పుష్పకాంతి
23. మల్లికా కుసుమకాంతి
24. కరవీర పుష్పకాంతి

## వర్ణతత్త్వములు

గాయత్రీ మంత్రంలోని అక్షరాల తత్త్వాలు ఈ విధంగా ఉన్నాయి.

*వర్ణాఃప్రోక్తా శ్చ వర్ణానాం మహాపాపవిశోధనాః।*
*పృథివ్యాప స్తథా తేజో వాయు రాకాశ ఏవ చ.*
*గందో రస శ్చ రూపం చ శబ్దః స్పర్శస్తథైవ చ।*
*ఉపస్థం పాయుపాదం చ పాణీ వాగపి చ క్రమాత్.*

**ఘ్రాణం జిహ్వా చ చక్షు శ్చ త్వక్ శ్రోత్రం చ తతఃపరమ్।**

**ప్రాణో పాన స్తథా వ్యానః సమాన శ్చ తతః పరమ్.**

**తత్త్వా న్యేతాని వర్ణానాం క్రమశః కీర్తితాని తు।**

| | | |
|---|---|---|
| 1. నేల | 9. స్పర్శ | 17. చక్షువు |
| 2. నీరు | 10. శబ్దము | 18. త్వక్ |
| 3. వెలుగు | 11. వాక్ | 19. శ్రోత్రము |
| 4. గాలి | 12. పాణి, పాదములు | 20. ప్రాణము |
| 5. ఆకాశము | 13. పాయు | 21. అపానము |
| 6. గంధము | 14. ఉపస్థ | 22. వ్యానము |
| 7. రసము | 15. ఘ్రాణము | 23. ఉదానము |
| 8. రూపము | 16. జిహ్వా | 24. సమానము |

## వర్ణముద్రలు

గాయత్రీ మంత్రానికి వర్ణముద్రలు ఈ విధంగా ఉంటాయి.

**అతః పరం ప్రవక్ష్యామి వర్ణముద్రాః క్రమేణ తు.**

**సుముఖం సంపుటం చైవ వితతం విస్తృతం తథా।**

**ద్విముఖం త్రిముఖం చైవ చతుః పంచముఖం తథా.**

**షణ్ముఖోఽధో ముఖం చైవ వ్యాపకాంజలికం తథా ।**

**శకటం యమపాశం చ గ్రథితం సన్ముఖోన్ముఖమ్.**

**విలంబం ముష్టికం చైవ మత్స్యం కూర్మం వరాహకమ్ ।**

**సింహాక్రాంతం మహాక్రాంతం ముద్గరం పల్లవం తథా.**

| | | |
|---|---|---|
| 1. సుముఖము | 9. షణ్ముఖము | 17. ముష్టికము |
| 2. సంపుటము | 10. అధోముఖము | 18. మత్స్యము |
| 3. వితతము | 11. వ్యాపకాంజలికము | 19. కూర్మము |
| 4. విస్తృతము | 12. శకటము | 20. వరాహము |
| 5. ద్వి ముఖము | 13. మమపాశము | 21. సింహా క్రాంతము |
| 6. త్రి ముఖము | 14. గ్రథితము | 22. మహాక్రాంతము |
| 7. చతుర్ముఖము | 15. సన్ముఖోన్ముఖము | 23. ముద్గరము |
| 8. పంచ ముఖము | 16. ప్రలంబము | 24. పల్లవము |

## గాయత్రి మహా ముద్రలు

ముప్పై రెండు అక్షరాలు గల గాయత్రీ మంత్రానికి ముద్రలు ఈ విధంగా ఉంటాయి.

**త్రిశూల యోనీ సురభి శ్చాక్షమాలా చ లింగకమ్ ।**

**అంబుజం చ మహాముద్రా స్తుర్యరూపాః ప్రకీర్తితాః.**

**ఇత్యేతాః కీర్తితాముద్రా వర్ణానాం తే మహామునే ।**

**మహాపాపక్షయకరాః కీర్తిదాః కాంతిదా మునే.**

| | | |
|---|---|---|
| 1. త్రిశూలము | 2. యోని | 3. సురభి |
| 4. అక్షమాలా | 5. లింగము | 6. అంబుజము |

ఇవి తురీయ పాద గాయత్రికి ముద్రలు. ఈ ముద్రలు పాపక్షయకరములు. కీర్తిని తేజస్సును ఇస్తాయి.

అవసరం లేనప్పటికీ పాఠకులకు గాయత్రీ మంత్రం గురించిన వివరాలు ఇవ్వాలనే ఉద్దేశ్యంతోనే ఈ విషయం ఇక్కడ చెప్పటం జరిగింది.

## 2. భావార్థము

పంచదశీ మహామంత్రానికి చెప్పిన అర్థాలలో భావార్థము ఒకటి. అది వరివశ్యా రహస్యములో ఈ విధంగా వివరించబడింది.

**వామేచ్ఛా బ్రహ్మ భారత్యౌ జ్యేష్ఠా జ్ఞానే హరిక్షితీ ।**

**రౌద్రీ క్రియే శివాపర్ణే ఇత్యే తన్మిథున త్రయమ్ ॥**

ప్రకాశ విమర్శలు రెండూ కలిసి, దంపతులై ఈ జగత్తును సృష్టించారు. అయితే ఇక్కడ ప్రకాశ రూపము -పురుషుడు. కాగా విమర్శరూపము స్త్రీ. ప్రకాశ రూపము వ్యష్టిగా అంటే విడివిడిగా వామా, జ్యేష్ఠా, రౌద్రీ అని చెప్పబడుతోంది. ఇదే సమిష్టిగా అంబిక అనబడుతుంది. ఇందులో వామాదిశక్తులే త్రిమూర్తులు.

వామా - బ్రహ్మ, జ్యేష్ఠా - విష్ణువు, రౌద్రీ - శివుడు

అలాగే విమర్శ శక్తి కూడా విడివిడిగా ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు అని మూడు రకాలు. సమిష్టిగా దీన్ని శాంతా అంటారు. ఇవి త్రిమూర్తుల యొక్క శక్తులు.

ఇచ్ఛాశక్తి - సరస్వతి, జ్ఞాన శక్తి - పృథివి, క్రియా శక్తి - గౌరి

ఈ రకంగా వీరందరూ కలిసి సమిష్టిగా నాలుగు మిథునాలౌతున్నారు.

ఇచ్ఛా, వామా - వాణీ హిరణ్యగర్భులు
జ్ఞాన, జ్యేష్ఠా - లక్ష్మీనారాయణలు
క్రియా, రౌద్రీ - ఉమా మహేశ్వరులు.

వీరందరూ కలసి సమిష్టిగా నాల్గవ జంట అవుతున్నారు. అదే శాంతా, అంబికల స్వరూపము.

**త్రిభిఃకూటైః క్రమాద్వాచ్య మీంకార త్రితయేనతు ।**
**ఏతత్త్రయం సమష్ట్యాత్మా వాచ్యాశాంతాంబికాత్మికా ॥**

పై శ్లోకంలోచెప్పిన మిధున త్రయమే పంచదశీ మహామంత్రంలోని మూడు కూటములు.

బ్రహ్మ, సరస్వతి - వాగ్భవ కూటమి
విష్ణువు, పృథివి - కామరాజ కూటమి
రుద్రుడు, గౌరి - శక్తి కూటమి.

ఈ మూడు కూటముల యొక్క చివరనున్నటువంటి ఈ కారానికి ఈ మూడు మిధునముల యొక్క సమిష్టి రూపము చెప్పబడినది. అదే శాంతాంబికామిధునము.

**యద్వాగీ స్సకలం బ్రహ్మ ప్రభృతీనాం త్రయం త్రయమ్ ।**
**త్రికూట వాచ్యం మాయాయా స్తురీయం మిధుననం మతమ్ ॥**

**మొదటి కూటమి అర్థము** : సరస్వతి, పృథివి, గౌరి అనే శక్తులు విమర్శత్రయము.

**రెండవ కూటమి అర్థము** : సకలులు, ప్రళయాకళలు, విజ్ఞాన కేవలులు అనబడే ఉపాసకత్రయము.

**మూడవ కూటమి అర్థము** : ప్రకాశత్రయమయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు.

**నాల్గవ కూటమి అర్థము** : హ్రీంకారములు మూడింటికి ప్రతీకలైన శాంతా, అంబికలు అనబడే నాల్గవ మిధునము.

పంచదశీ మహామంత్రానికి మూడు కూటములున్నాయి.

| | | |
|---|---|---|
| క ఏ ఈ ల హ్రీం | ప్రథమ కూటమి | సృష్టి రూపము |
| హ స క హ ల హ్రీం | ద్వితీయ కూటమి | స్థితి రూపము |
| స క ల హ్రీం | తృతీయ కూటమి | సంహార రూపము |

వీటిలో ఒక్కొక్క కర్మ తిరిగి మూడు విధాలుగా ఉంటుంది.

1. సృష్టి కర్మ - సృష్టి సృష్టి, సృష్టి స్థితి, సృష్టి సంహారము
2. స్థితికర్మ - స్థితి సృష్టి, స్థితి స్థితి, స్థితి సంహారము
3. సంహార కర్మ - సంహారసృష్టి, సంహారస్థితి, సంహార సంహారము.

ఇందులో సృష్టి కర్మకు - బ్రహ్మ, భారతి, స్థితి కర్మకు - విష్ణువు, పృథివి, సంహారకర్మకు - రుద్రుడు, గౌరి అధిపతులు.

దీని ప్రకారము ప్రథమ కూటమిలో (సృష్టి కూటమి)

క కారము - బ్రహ్మ స్వరూపము
ఏ కారము - భారతీ స్వరూపము
ఈ కారము - విష్ణు స్వరూపము
ల కారము - పృథివీ స్వరూపము
హ్రీంకారములోని హకారము - రుద్ర స్వరూపము
రేఫ - రుద్రాణీ స్వరూపము
ఈం కారము - శాంతా, అంబికల సమిష్టి రూపము.

ద్వితీయ కూటమి అయిన స్థితి రూపమందు. మధ్యన ఉన్న హ కారమును వదలి వేసినట్లైతే 'హ స క ల హ్రీం' అవుతుంది. అప్పుడు

హ కారము - బ్రహ్మ స్వరూపము
స కారము - భారతీ స్వరూపము
క కారము - విష్ణు స్వరూపము
ల కారము - పృథివీ స్వరూపము
హ్రీంకారములోని హకారము - రుద్ర స్వరూపము
రేఫ - రుద్రాణీ స్వరూపము,
ఈంకారము - శాంతా, అంబికల సమిష్టి స్వరూపము.

తృతీయ కూటమి అయిన సంహార కూటమిలో - గతంలో ద్వితీయ కూటమిలో వదలి వేసిన హకారాన్ని ఈ కూటమికి ముందు గనకచేర్చినట్లైతే 'హ స క ల హ్రీం' అవుతుంది. అప్పుడు ద్వితీయ కూటమిలో చెప్పిన మాదిరి గానే.

హకారము - బ్రహ్మ స్వరూపము
సకారము - భారతీ స్వరూపము
కకారము - విష్ణు స్వరూపము
ల కారము - పృథివీ స్వరూపము
హ్రీంకారములోని హకారము - రుద్ర స్వరూపము
రేఫ - రుద్రాణీ స్వరూపము
ఈం కారము - శాంతా, అంబికల సమిష్టి స్వరూపము.

ఈ రకంగా ప్రతి కూటమి బ్రహ్మ, భారతి మొదలైన సప్త దేవతా వాచకములయిన ఏడు అక్షారాలతో కూడి ఉన్నాయని చెబుతూ పంచదశీ మహామంత్రము యొక్క భావార్థాన్ని వివరించటం జరిగింది. అక్షరాల అర్థమే భావార్థము అని గ్రహించాలి.

పంచదశీ మహామంత్రము శివశక్తుల కలయిక చేతనే శ్రీవిద్య అవుతున్నది. శివుడు అకార స్వరూపుడు. శక్తి హకారరూపిణి వారిద్దరి కలయికయే కామకళ.

బ్రహ్మాండపురాణము, లలితా త్రిశతియందు.

**కత్రయం హద్వయం చైవ శైవభాగః ప్రకీర్తితః**
**శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః**

అని చెప్పబడింది. అంటే.

మూడు క కారములు రెండు హ కారములు - శివరూపము
ఏ, ఈ, ల, స, ల, స, ల కారములు - శక్తి స్వరూపము
హ్రీంకారములు మూడు - శివ, శక్తి స్వరూపాలు.

అని చెప్పబడింది. కాగా కొందరు లకారములు మూడు, సకారములు రెండు, ఏకారము ఈకారము మొత్తం ఏడు అక్షరాలు - సరస్వతి, పృధ్వి, గౌరి వాచకములు.

హకారములు రెండు, క కారములు మూడు మొత్తం ఐదు అక్షరాలు వీర పదముతో సూచించబడుతున్న బ్రహ్మ, విష్ణు, రుద్ర వాచకములు.

హ్రీంకారములు మూడు - శాంతా అంబికల సమిష్టి మిధున వాచకము.

మరికొందరి ప్రకారము వీరేంద్రులు అంటే బ్రహ్మ విష్ణు రుద్రులు. వీరి ప్రకారము.

ప్రథమ కూటమికి - బ్రహ్మ, సరస్వతి
ద్వితీయ కూటమికి - విష్ణువు, పృధ్వి
తృతీయ కూటమికి - రుద్రుడు, గౌరి అధిపతులు.
హ్రీంకారానికి - అంబికా శాంతా మిధునము

ఇంకా కొంత మంది ప్రకారము మూడు హ్రీంకారములూ త్రిపుర సుందరీ వాచకము. రెండవ కూటమి మధ్య గల హకారము కామ కళలోని హకారానికి మూల బీజము. అంటే హ్రీంకారానికి హ కారము మూల బీజము. అలాగే రెండు, మూడు కూటమిలలోని రెండు సకారాలకు అకారము మూల బీజము.

మంత్రంలోని మూడు హ్రీంకారాలు, రెండు సకారాలు మొత్తం ఐదు అక్షరాలు పోగా మిగిలిని పది అక్షరాలూ యోగినీత్రయము, ఉపాసకత్రయము, బ్రహ్మాదిత్రయము,

తురీయమిధున స్వరూపములు. 3 + 3+ 3 + 1 = 10 అని చెప్పి ఈ రకంగా భావార్థము వివరించబడింది.

# 3. సంప్రదాయార్థము

***వ్యో మాది జనక, హాకరసలాౖరైర్ఘటనేవ పంచభూతమయీా ।***
***పంచచత్రుస్త్రి ద్వ్యేకగ, శబ్దాది గుణాత్మ పంచదశవర్ణా ॥***

రూపసృష్టి శబ్దముల యొక్క అర్థ రూపమున పరిణమించుచున్నది. కాబట్టే అహం పదవాచ్యమైన పరాశక్తియే శబ్ద సృష్టికి, అర్థ సృష్టికి కారణమవుతున్నది. కార్యకారణములకు భేదము లేదు. అందుచేత శబ్దరూపమైన అర్థ సృష్టి రూపమైన ప్రపంచమంతా అహంతా మయమని చెప్పబడుచున్నది. కాబట్టే మాతృకలన్నీ అకార హకారముల మధ్య ఉన్నాయి. అహం పదముల సామరస్యకాలంలో మాతృకలు కనపడవు. అకారహకారములు విడిపోయినప్పుడే మాతృకలు కనపడతాయి.

మాతృకల వల్లనే నామరూపాత్మకమైన సర్వ ప్రపంచ సృష్టి కలుగుతుంది. ఇక్కడ

శబ్ద సృష్టి - పంచదశీ మహామంత్రము, అర్థ సృష్టి - ముప్పై ఆరు తత్త్వములు.

పంచభూతాలకూ కారణభూతమైన హ, క, ర, స, ల అను అక్షరములతో కూడి ఉండటం చేత పంచదశీ మహామంత్రము, పంచభూతాత్మకమైనదని చెప్పబడుతోంది.

***హాకారద్వ్యోమ సంభూతం, కకారస్తు ప్రభంజనః ।***
***రేఫాదగ్ని, స్సకారశ్చ జలతత్త్వ సముద్భవ : ।***
***లకారత్పృధివీజాతా, తస్మాద్విశ్వమయీా చ సా ॥***

హ కారము - ఆకాశతత్త్వాత్మకము.

**ఉపాసకత్రయము :** సాధకులను మూడు రకాలుగా విభజించటం జరిగింది.

***కకారత్రయ వాచ్యాస్తు సకలాః ప్రళయాః కళాః***
***విజ్ఞాన కేవలాశ్చేతి త్రిః ప్రకారా ఉపాసకాః ॥***

మహామంత్రంలో ఉన్నటువంటి మూడు క కారములచేత సాధకులు మూడు రకాలుగా విభజించబడుతున్నారు. వారు.

1. సకలులు, 2. ప్రళయా కలులు, 3. నిష్కలులు.

1. **సకలులు :** ఎక్కువగా భేదదృష్టి కలిగి కర్మల నాచరిస్తూ, ధ్యానశ్లోకంలో చెప్పిన ప్రకారము దేవత యొక్క స్థూలరూపాన్ని ఉపాసిస్తారు.

2. **ప్రళయాకలులు :** మిశ్రమ దృష్టి కలిగి, కర్మలను ఆచరిస్తూ, జ్ఞాన దృష్టి కలిగి దేవి యొక్క సూక్ష్మరూపాన్ని ఉపాసిస్తారు.

**3. నిష్కలులు :** వీరు కేవలము జ్ఞాన స్వరూపులు. జగత్తునందు భేద దృష్టి లేకుండా, ఆత్మానందాన్ని అనుభవిస్తూ, అన్నింటిలోనూ పరమేశ్వరిని చూస్తూ ఆ పరాస్వరూపాన్ని ఆరాధించే ముముక్షువులు.

క కారము - వాయుతత్త్వాత్మకము

ర కారము - అగ్ని తత్త్వాత్మకము

స కారము - జల తత్త్వాత్మకము

ల కారము - పృధివీ తత్త్వాత్మకము.

ఈ రకంగా శ్రీవిద్య పంచభూతమయమైనది. తైత్తిరీయంలో

**"ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృధివీ."**

అని చెప్పబడింది. అంటే. ఆకాశము నుండి - వాయువు, వాయువు నుండి - అగ్ని, అగ్ని నుండి - జలము, జలము నుండి - భూమి ఉద్భవించినాయి.

ఈ కారణం చేత

1. ఆకాశమందు - ఆకాశతత్త్వము ఒక్కటే ఉన్నది.
2. వాయువునందు - ఆకాశ, వాయు తత్త్వాలున్నాయి.
3. అగ్నియందు - ఆకాశ, వాయు, అగ్నితత్త్వాలున్నాయి.
4. జలము నందు - ఆకాశము, వాయువు, అగ్ని, జలతత్త్వాలున్నాయి.
5. భూమి యందు - ఆకాశ, వాయు, అగ్ని, జల, భూతత్త్వాలున్నాయి.

ఈ రకంగా చూసినట్లైతే.

| | |
|---|---|
| ఆకాశ భాగములు - | 5 |
| వాయు భాగములు - | 4 |
| అగ్ని భాగములు - | 3 |
| జల భాగములు - | 2 |
| భూ భాగము - | 1 |
| మొత్తం | 15 |

పంచభూతాల యొక్క గుణాలయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు కూడా ఈ విధంగానే ఉంటాయి.

ఆకాశమునందు - శబ్దము

వాయువునందు - శబ్దము, స్పర్శ

అగ్ని యందు - శబ్దము, స్పర్శ, రూపము

జలమునందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము.

భూమియందు - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు.

ఈ విధంగా పంచభూతాల యొక్క, వాటిగుణముల యొక్క మొత్తం 15 భాగాలే 15 బీజాక్షరాలుగల మహామంత్రము, మంత్రంలోని వివిధ అక్షరాలు పంచభూతాలకూ, తన్మాత్రలకూ ప్రతీక. మంత్రంలోని ఐదు హకారములు - ఆకాశము యొక్క అయిదు భాగములు.

ఈకారము వాయుతత్త్వాత్మకము. ఇవి నాలుగు భాగములు. కాని మంత్రములో క కారములు నాలుగు లేవు. అందుచేత మూడవ అక్షరమైన ఈ కారాన్ని, హ్రీంకారాలలో ఉన్న ఈకారాన్ని తీసుకోవాలి. ఇప్పుడు నాలుగు ఈ కారాలవుతాయి.

| | | |
|---|---|---|
| నాలుగు ఈ కారాలు | - | వాయువు యొక్క నాలుగు భాగాలు. |
| మూడు హ్రీం కారములలోని రేఫలు | - | అగ్నియొక్క మూడు భాగాలు |
| రెండు సకారాలు | - | జలము యొక్క రెండు భాగాలు |
| మూడు ల కారాలు | - | పృథ్వి వాచకము. భూలోక, భువర్లోక సువర్లోకాలను సూచిస్తుంది. కాబట్టి ఒకటిగానే తీసుకోవాలి. |

*ఏవం సప్తత్రింశ, త్సంఖ్యాక పదైర్మహావిద్యా,*
*షట్త్రింశత్తత్వానాం తత్త్వాతీతస్య చాభిదాత్రీయమ్ ॥*

మూల విద్యలో 37 పదములున్నాయి. వీటినే 37 బీజములు అంటారు. అవి వరుసగా

| | | |
|---|---|---|
| హ కారములు | - | 5 |
| ఈ కారములు | - | 4 |
| రేఫలు | - | 3 |
| స కారములు | - | 2 |
| ల కారములు | - | 3 |
| క కారములు | - | 3 |
| అ కారములు | - | 10 |
| బిందువులు | - | 3 |
| నాదములు | - | 3 |
| ఏ కారము | - | 1 |
| మొత్తం బీజములు | - | 37 |

వీటిలో తత్త్వాలు - 36. కాగా 37వది పరబ్రహ్మ స్వరూపము. అవి

| | | |
|---|---|---|
| పంచభూతాలు | - | 5 |
| తన్మాత్రలు | - | 5 |
| జ్ఞానేంద్రియాలు | - | 5 |
| కర్మేంద్రియాలు | - | 5 |
| మనస్సు, బుద్ధి<br>అహంకారము | - | 3 |
| ప్రకృతి, పురుషుడు | - | 2 |
| కళ, విద్య, రాగము<br>కాలము, నియతి | - | 5 |
| మాయ, శుద్ధ విద్య,<br>మహేశ్వరుడు,<br>సదా శివుడు | - | 4 |
| శివుడు, శక్తి | - | 2 |
| మొత్తం తత్త్వాలు | - | 36 |

ఈ తత్త్వాలన్నీ శ్రీవిద్యతో సమన్వయం చెందుతున్నాయి.

| | తత్త్వములు | | బీజములు | |
|---|---|---|---|---|
| 1. | శివ, శక్తి, శుద్ధ విద్య, ప్రకృతి | 4 | బిందువులు | 4 |
| 2. | సదాశివ, ఈశ్వర, మాయ,<br>కలా, విద్య, రాగ్య, కాలము,<br>నియతి, పురుషుడు | 9 | నాదములు | 9 |
| 3. | తన్మాత్రలు | 5 | హ కారములు | 5 |
| 4. | భూతములు | 5 | ర్యంజములు | 5 |
| 5. | ఇంద్రియములు | 10 | శ్రీకంఠులు | 10 |
| 6. | అహంకారము, బుద్ధి,<br>మనస్సు | 3 | క కారములు | 3 |
| | | 36 | | 36 |
| 7. | తత్త్వాతీతమైన పరబ్రహ్మ 37వది. | | ఏ కారము 37వది. | |

**కకారత్రయ వాచ్యాస్తు సకలాః ప్రళయాః కళాః**
**విజ్ఞానకేవలాశ్చేతి, త్రిఃప్రకారా ఉపాసకా : ॥**

కూట(త్రయమునందున్న మూడు కకారములచేత ఉపాసకులు సూచించబడుతున్నారు. వీరు 1 సకలులు 2) (ప్రళయా కలులు 3) విజ్ఞాన కేవలులు అని మూడు రకాలు వీరిని గతంలో భావార్థంలో వివరించటం జరిగింది.

*అశుద్ధ శుద్ధ మి(శ్రాణాం (ప్రమాతౄణాం పరంవపుః*
*(క్రోధీశ(త్రితయే నాస్య, విద్యాస్థేన (ప్రకాశ్యతే ॥*

జ్ఞానులు కూడా అశుద్ధులు, శుద్ధులు, మి(శులు అని మూడు రకాలుగా ఉంటారు. మం(త్రంలోని మూడు కకారములు మూడు విధాలయిన ఉపాసకులను, జ్ఞానులను సూచిస్తున్నాయి.

మం(త్రంలోని రెండు, మూడు బీజాలను (ఏ, ఈ) మూడు హ్రీంకారాలను, తీసివేయగా మిగిలేవి పది అక్షరాలు. ఇవి హల్లులు. వీటిమీద అకారములు పది. ఇవి అనంతకోటి జీవరాశులను సూచిస్తాయి. అచ్చులలో పదకొండవది ఏ కారము. ఇది తత్త్వాతీతమైన పర(బహ్మ స్వరూపము.

*శ్రీ కంఠ దశకంతద్వ దవ్యక్త స్య హివాచకమ్ ।*
*(ప్రాణభూతః స్థితో దేవి, ఆద్యదేకాదశః స్వరః ॥*

అకార దశకమునకు అంటే అ దగ్గర నుండి ౡంవరకూ గల పది అక్షరాలకూ జీవవాచకత్వము, ఏ కారానికి (ప్రాణవాచకత్వము చెప్పబడ్డాయి.

హృల్లేఖలోని మూడు బిందువులకూ రు(ద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు అని అర్థం. రు(ద్రుడు అంటే మాయా, కళ, అవిద్యా, రాగ, కాల, నియతి, పురుషుడు అను ఏడు తత్త్వములు. కూట(త్రయంలోని మూడు నాదాలకు శాంతి (ప్రకృతి, శుద్ధ విద్యాశక్తి, శివతత్త్వము అని అర్థము.

మూల విద్యలో 37 పదాలున్నాయి. అవి తత్త్వాలకు (ప్రతీకలు. ఈ విషయం గతంలో వివరించబడింది.

## 4. నిగర్భార్థము

*పరమశివే నిష్కళతా తదభిన్నత్వం స్వదేశి కేం(ద్రస్య ।*
*తత్కరుణా స్వస్మిన్నపి, తదబోధో నిగర్భార్థః ॥*

నిష్కలమైనటువంటి, పరిశుద్ధమైన ఆ పరమశివునితో సమానమైన వాడు గురువు. అంటే గురువే పర(బహ్మ స్వరూపము. అటువంటి గురువు యొక్క కరుణ వల్ల శిష్యుడు కూడా పరమేశ్వరునితో సమానమవుతున్నాడు అని నిగార్భార్థము.

మొత్తం మీద గురువు, శిష్యుడు, పరమేశ్వరుడూ ఒక్కటే అని సిద్ధాంతము. శివుడు గురుపరంపరద్వారా శిష్యునిలో (ప్రవేశిస్తాడు. అలాగే శిష్యుడు గురుపరంపర ద్వారా శివునిలో (ప్రవేశిస్తాడు.

గురువు శిష్యునిలో (బహ్మ స్వరూపముగా (ప్రవేశించటమనేది అనేక జన్మల పుణ్యము, చిత్తశుద్ధి, అహంకార, మమకారములు లేని గురుభక్తి వలన మా(త్రమే ఇది సాధ్యమవుతుంది.

రువు అంటే కేవలము మానవ చర్మం ధరించిన పరమేశ్వరుడు అని గుర్తుంచుకోవాలి. గురువు ష్టపాశబద్దుడు కాదు.

1) నింద 2) అనుమానము 3) భయము 4) సిగ్గు 5) ద్వేషము 6) కులము 7) శీలము 8) డవడి అనేవి అష్టపాశాలు. ఈ పాశములకు బద్ధుడైనవాడు పశువు. వీటి నుండి విముక్తుడైనవాడు క్షాత్తూ పరమేశ్వరుడు

## 5. కౌళికార్ధము

శ్రీచక్రానికీ, దేవతకూ, మంత్రానికీ, గురువుకూ, శిష్యుడికీ భేదము లేదు. వీరంతా ఒక్కటే ని చెప్పటమే కౌళికార్ధము.

అసలు శ్రీచక్రమే పంచదశీ మహామంత్రం నుంచి, పుట్టింది అని భాస్కరరాయలవారు మ వరివశ్యారహశ్యం అనే గ్రంథంలో వ్రాశారు.

*కత్రి తయాదీ కారాద్బిందుర్జాత స్తదగ్రిమేచక్రే,*
*హ్రాల్లేఖాభిస్తత్పర చక్రత్రితయం హకారాభ్యామ్.*
*ఏకారేణచ తత్పర చక్రేజాతే సకారాభ్యామ్,*
*చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రజని :.*

1. శ్రీవిద్యలోని మూడు క కారములవలన, ఈ కారము వలన బిందువు పుట్టింది.
2. మూడు హ్రీం కారాలవల్ల త్రికోణము, వసుకోణము పుట్టాయి.
3. రెండు హ కారములు, ఏ కారమువల్ల - అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము, వృత్త త్రయము పుట్టాయి.
4. రెండు స కారములచే అష్టదళము, షోడశదళము పుట్టాయి.
5. ల కారమువల్ల భూపురత్రయం పుట్టింది.

ఈ విధంగా పంచదశీ మహామంత్రం నుండే శ్రీచక్రము పుట్టింది.

## 5.I పరదేవత - గణేశాది రూపాలు

*గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశిరూపిణీమ్*
*దేవీం మంత్రమయీం, నౌమి, మాతృకాపీఠరూపిణీమ్ ॥*

గణేశరూపిణి, నవగ్రహరూపిణి, నక్షత్రరూపిణి, యోగినీరూపిణి, రాశిస్వరూపిణి, సకలమంత్ర రూపిణి, మాతృకాపీఠరూపిణి అయిన దేవికి నమస్కరించుచున్నాను.

పరదేవత, శ్రీవిద్య, శ్రీచక్రము, గురువు, సాధకుడు ఈ ఐదుగురు ఒక్కటే. ఈ సృష్టికి బ్రహ్మమునకు భేదము లేదు. వీరందరు ఒకే జాతివారు అని చెప్పవచ్చు. వీరందరు ఒకే

అమ్మలపాదిలోని బాణాలలాగా సజాతీయులు, సమాన ధర్మాలు కలవారు. ఆ సమానధర్మాలు ఏవి అంటే గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశి, పీఠరూపాలు. వీటిలో పంచదశీ మహామంత్రానికి, శ్రీచక్రానికి గల గణేశాది రూపాలను నాచే వ్రాయబడిన శ్రీ విద్యాదర్శనము అనే గ్రంథంలో వివరించటం జరిగింది. ఇక్కడ పరదేవత యొక్క సామ్యాలను వివరిస్తున్నాము. భాస్కరరాయలవారు తమ వరివశ్యారహస్యము అనే గ్రంథంలో ఈ విషయాలు వివరించారు.

**1. గణేశరూపము :**

*మాతా నిరుపమ తేజోమయ్యాః స్వస్యా మరీచీరూపాణామ్ ।*
*ఆవరణ దేవతానా మీశత్వా దుచ్యతే గణేశీతి ॥*

దేవి నిరుపమతేజోమయి-ఆమె తన గణాలకు, ఆవరణదేవతలకు అధిపతి-కాబట్టి ఆమె గణేశి అని చెప్పబడుతున్నది.

**2. గ్రహరూపము :**

*ఇచ్ఛా ఉ ఉ దిత్రిసమిష్టి ర్గుణ త్రయాఢ్యా ఉ వలేన్దు రవినేత్రా ।*
*ఏవం నవభిర్యోగాద్ గ్రహరూపే త్యుచ్యతే మాతా ॥*

దేవి శక్తి స్వరూపిణి. ఆశక్తులు మూడు. 1) ఇచ్ఛా 2) జ్ఞాన 3) క్రియాశక్తులు. సత్వరజస్తమోగుణాలనెడి మూడు గుణములు కలది. సోమసూర్యాగ్నులను మూడు నేత్రములుగా కలది. ఈ తొమ్మిదికీ గ్రహత్వమున్నది కాబట్టి దేవి నవగ్రహరూపిణి అవుతోంది.

**3. నక్షత్ర స్వరూపము :**

*ఇన్ద్రియదశకే నాన్తఃకరణ చతుష్కోణ విషయదశకేన ।*
*ప్రకృతి, పురుష గుణ తత్త్వైర్జాతా నక్షత్రరూపిణీ మాతా ॥*

దేవి శరీరంలో ఉన్న

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు (కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మము) | - | 5 |
| కర్మేంద్రిములు (కాలు, చేయి, వాక్కు, పాయు, ఉపస్థ) | - | 5 |
| తన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు) | - | 5 |
| వచనాదులు (వచన, దాన, గమన, విసర్గ, ఆనంద) | - | 5 |
| అంతఃకరణ (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) | - | 4 |
| తత్త్వములు (ప్రకృతి, పురుష, గుణ) | - | 3 |
| ఇవి మొత్తం | - | 27 |

నక్షత్రాలు ఇరవైఏడు. కాబట్టి దేవినక్షత్ర రూపిణి అని చెప్పబడింది.

4. **యోగినీ రూపము :**

*నరపతి రవికాష్ఠా షట్సముద్ర ద్విసంఖ్యై ॥*
*రకడబవహా పూర్వై రక్షరైర్వే ష్టితాభిః ॥*
*డరలకసహావర్ణా డాకినీ భిస్తు షడ్భి ।*
*ర్ఘటిత తనురితీయా కథ్యతే యోగినీతి ॥*

దేవి శరీరము డాకినీ, రాకినీ మొదలైన యోగినుల సముదాయమై ఉన్నది. దేహంలో ఉండే షట్చక్రాలలోనూ అకారాది క్షకారాంతము అక్షరాలున్నాయని చెప్పటం జరిగింది. వాటిలో వజ్రేశ్వరి మొదలైన దేవతలుంటారు. వారిని డాకినీ, రాకినీ మొదలైన యోగినులుగా పిలుస్తారు. ఈ దేవతలు సప్త ధాతువులకు ప్రతీకలు. ఆ వివరాలు ఈ దిగువ ఇవ్వబడినాయి.

| | చక్రము పేరు | దేవత పేరు | యోగిని పేరు | ధాతువు పేరు |
|---|---|---|---|---|
| 1. | విశుద్ధ చక్రము | వజ్రేశ్వరి | డాకినీ | త్వక్ (చర్మము) |
| 2. | అనాహత చక్రము | హిమదేవి | రాకినీ | రుధిరము |
| 3. | మణిపూరకము | వయోవస్థావివర్జితా | లాకినీ | మాంసము |
| 4. | స్వాధిష్ఠానము | సిద్దేశ్వరి | కాకినీ | మేధస్సు |
| 5. | మూలాధారము | సిద్ధవిద్యా | సాకినీ | ఎముకలు |
| 6. | ఆజ్ఞాచక్రము | సిద్ధమాతా | హాకినీ | మజ్జ |

5. **రాశి స్వరూపము :**

***పంచభిర్నాగకూర్మాద్యైః ప్రాణాపానాది పంచభి : ।***
***జీవాత్మ పరమాత్మాభ్యాం చైషా రాశి స్వరూపిణీ ॥***

వాయువులు రెండు రకాలు. అవి. 1) ప్రధాన వాయువులు 2) ఉపవాయువులు

ఇవి ఒక్కొక్కటి ఐదు రకాలు. వెరసి పది. జీవాత్మ, పరమాత్మలతో కలిపి మొత్తం పన్నెండు. రాశులు పన్నెండు. కాబట్టి దేవి రాశి స్వరూపంగా చెప్పబడింది. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| **వాయువు పేరు** | **రాశి పేరు** |
|---|---|
| ***ప్రధాన వాయువులు 5*** | |
| 1. ప్రాణ వాయువు | మేషరాశి |
| 2. అపాన వాయువు | వృషభరాశి |
| 3. వ్యాన వాయువు | మిధునరాశి |
| 4. ఉదాన వాయువు | కర్కాటక రాశి |
| 5. సమానవాయువు | సింహరాశి |

**ఉపవాయువులు 5**

| | | |
|---|---|---|
| 6. | నాగవాయువు | కన్యారాశి |
| 7. | కూర్మవాయువు | తులారాశి |
| 8. | కృకర వాయువు | వృశ్చికరాశి |
| 9. | దేవదత్తము | ధనూరాశి |
| 10. | ధనుంజయము | మకరరాశి |
| 11. | జీవాత్మ | కుంభరాశి |
| 12. | పరమాత్మ | మీనరాశి |

**6. మాతృకా పీఠరూపిణి :**

పరమేశ్వరికి, శ్రీచక్రానికి, శ్రీవిద్యకూ గ్రహాలు 9, రాశులు 12, నక్షత్రాలు 27, యోగినులు 6, గణేశము. 1 మొత్తం 55. మాతృకాపీఠాలు 51 + ఓడ్యాణ, జాలంధర, పూర్ణగిరి, కామగిరి పీఠాలు వెరసి 55. ఈ రకంగా పరమేశ్వరి మాతృకా పీఠరూపిణి అయినది.

**మాతృకా పీఠములు :**

1. కామరూపము
2. వారణాసి
3. నేపాలము
4. పౌండ్రవర్ధనము
5. పురస్థిరము
6. కన్యాకుబ్జము
7. పూర్ణ శైలము
8. అర్బుదము
9. అమ్రాతకేశ్వరము
10. ఏకామ్రము
11. త్రిస్రోతము
12. కామకోటకము
13. కైలాసము
14. భృగునగరము
15. కేదారము
16. పూర్ణచంద్రము
17. శ్రీపీఠము
18. ఓంకారపీఠము
19. జాలంధ్రము
20. మాలాఓత్కలము
21. కులాంతము
22. దేవీ కోటము
23. గోకర్ణము
24. మారుతేశ్వరము
25. అట్టహాసము
26. విరజము
27. రాజగేహము
28. మహాపథము
29. కోలాపురము
30. మేలాపురము
31. ఓంకారము
32. జయంతికము
33. ఉజ్జయిని
34. చిత్రము
35. క్షీరకము
36. హస్తినాపురము
37. ఓడ్డీశము
38. ప్రయాగ
39. షష్టము
40. మాయాపురము
41. జలేశము
42. మలయము
43. శైలము
44. మేరువు
45. గిరివరము
46. మహేంద్రము
47. వామనము
48. హిరణ్యాపురము
49. మహాలక్ష్మీపురము
50. ఓడ్యాణము
51. ఛాయాచత్రము
52. ఓడ్యాణ పీఠము
53. జాలంధర పీఠము
54. పూర్ణగిరి పీఠము
55. కామగిరి పీఠము

## 5.2 పంచదశీ మహామంత్రానికి గణేశాది రూపాలు

**1. గణేశత్వము :**

*"అకథాదికషోడశాక్షరా త్మకతా ర్త్రీయక కామవాగభివై :।*
*ఘటితాచపరాదివాగ్గణై రితివిద్యాపి గణేశరూపిణీ ॥*

1. అకారాది 16 వర్ణములు శక్తి కూటస్వరూపము
2. క నుంచి త వరకు 6 వర్ణములు కామరాజకూటము
3. ధ నుంచి స వరకు గల 16 వర్ణములు వాగ్భవ కూటము.
4. పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను నాలుగు వాగ్గణములు
5. వ్యష్టి, సముష్టి విభేదముచేత విద్యా స్వరూపము.

ఈ రకంగా వర్ణ గణస్వరూపం కలది కాబట్టి పంచదశీ మహామంత్రానికి గణేశత్వం లభించింది.

**2. యోగినీరూపము :**

*హృల్లేఖాభిస్తిస్రృభి స్తదన్యకూటైశ్చ యోగినీయోగాత్।*

శ్రీవిద్యలో హృల్లేఖలు మూడు. అవి లేని కూటములు మూడు. మొత్తం ఆరు. డాకిని, రాకిని, లాకిని, కాకిని, సాకిని, హాకిని అను యోగినులు ఆరుగురు. కాబట్టి పంచదశీ మహామంత్రానికి యోగినీ రూపం వచ్చింది.

**3. నవగ్రహరూపము :**

*బిందుత్రయనాదత్రయ తదన్యకూట త్రయై గ్రహత్వమిహ।*

1. బిందు త్రయము. (3 కూటముల చివరనున్న బిందువులు)
2. నాదత్రయము (బిందువు తరువాత ఉండు అర్ధచంద్రార్ధ్యష్టకము)
3. బిందు నాదములు లేని కూటములు మూడు, వెరసి గ్రహాలు కూడా తొమ్మిది కాబట్టి పంచదశీ మహామంత్రానికి నవగ్రహత్వం లభించింది.

**4. రాశి స్వరూపము :**

*రాశిభూతా ప్యేషా త్రీస్రృణాంపూర్వాక్షరై రైక్యాత్ ॥*

హ్రీంకారాలు గనక వదలివేసినట్లైతే మంత్రంలో ఉండే బీజాక్షరాలు 12. మేషాది రాసులు 12. కాబట్టి పంచదశీ మహామంత్రానికి రాశి స్వరూపం చెప్పబడింది.

**5. నక్షత్ర రూపం :**

**నక్షత్రత్వంచ దశాకారాణాం వ్యంజనైరపార్ధక్యాత్ ॥**

సంప్రదాయ ప్రకరణమునందు మూలవిద్యలో 37 వర్ణాలున్నాయి. అందులో పునరుత్పత్తి అయిన ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, ధ, థ, ఫ, భ అను పది అక్షరాలను తీసివేస్తే 37-10 = 27 అవుతాయి. నక్షత్రాలు 27. కాబట్టి పంచదశీ మహామంత్రానికి నక్షత్ర రూపం చెప్పబడింది.

ఈ రకంగా పంచదశీ మహా మంత్రానికి గణేశత్వము, యోగినీ స్వరూపము, నవగ్రహత్వము, రాశి స్వరూపము చెప్పబడి మంత్రరాజముగా వెలుగొందుచున్నది.

## 5.3 శ్రీ చక్రము - గణేశాది రూపాలు

శ్రీచక్రానికి 1) గణేశ రూపము, 2 యోగినీరూపము, 3) నవగ్రహ రూపము, 4) రాశి స్వరూపము, 5) నక్షత్ర రూపం కూడా వరివశ్యా రహస్యంలో చెప్పబడ్డాయి.

**1) గణేశరూపం :**

**రేఖాదళకోణగణై ర్ఘటనాచక్రే గణేశత్వమ్**

శ్రీచక్రంలో భూపురంలోని రేఖలు, అష్టదళ, షోడశదళము నందలి దళములు, త్రికోణము మొదలు చతుర్దశారము వరకు ఉన్న కోణములు మొదలైనవి గణాలుగా చెప్పబడ్డాయి. ఈ గణాలన్నీ సమూహంగా ఉండటంచేత శ్రీచక్రానికి గణేశత్వం లభించింది.

**2. యోగినీ రూపం :**

**స్థితి సంహృతి చక్రేద్వే, పద్మేద్వే, వృత్తభూగృహేచద్వే,**
**ఏవం షడ్భిర్యోగాత్ శ్రీచక్రం, యోగినీరూపమ్.**

శ్రీచక్రాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చు అవి.

1. అష్టదళము, షోడశదళము, భూపురము - సృష్టి చక్రము.
2. అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము - స్థితి చక్రము.
3. బిందువు, త్రికోణము, అష్టకోణాలు - సంహృతి చక్రము.

వీటిలో స్థితి చక్రము, సంహారచక్రము, అష్టదళము, షోడశదళము, షోడశదళము చివరనున్న వృత్తము, భూపురము, మొత్తం సంఖ్య ఆరు. ఇది షట్చక్రాలకు అధిదేవతలైన డాకిని, రాకిని లాకిని, కాకిని, సాకిని, హాకిని, అను ఆర్గురు యోగినుల సంఖ్యకు సమానము. కాబట్టి శ్రీచక్రానికి యోగినీరూపం వచ్చింది.

**3. నవగ్రహత్వం :**

**త్రైలోక్యమోహనాద్యై ర్నవభిశ్చక్రైర్గ్రహత్వంచ ॥**

శ్రీచక్రంలో తొమ్మిది చక్రాలున్నాయి. అవి

1. భూపురము - త్రైలోక్యమోహన చక్రము
2. షోడశదళము - సర్వాశాపరిపూరక చక్రము
3. అష్టదళము - సర్వసంక్షోభిణీచక్రము
4. చతుర్దశారము - సర్వసౌభాగ్యదాయినీ చక్రము
5. బహిర్దశారము - సర్వార్ధసాధక చక్రము
6. అంతర్దశారము - సర్వరక్షాకర చక్రము
7. అష్టకోణము - సర్వరోగహర చక్రము
8. త్రికోణములు - సర్వసిద్ధిప్రద చక్రము
9. బిందువు - సర్వానందమయ చక్రము

ఈ రకంగా శ్రీచక్రంలో 9 చక్రాలున్నాయి. గ్రహాల సంఖ్య కూడా 9. కాబట్టి శ్రీచక్రానికి నవగ్రహత్వం ఏర్పడింది.

**4. రాశి స్వరూపం :**

*పంచచతుశ్శక్త్యనలాబిందుః వృత్తంచ భూబింబమ్,*
*ఏవం ద్వాదశ సంఖ్యార్ఘటనాచ్చక్రస్యరాశిత్వమ్.*

శ్రీచక్రంలో కింది వైపు కోణాలు 5, పైవైపు కోణాలు 4. వృత్తత్రయం ఒకటి. భూపురము, బిందువు. మొత్తం సంఖ్య 12. రాసులసంఖ్య 12. కాబట్టి శ్రీచక్రానికి రాశి స్వరూపం ఏర్పడింది.

**5. నక్షత్రరూపం :**

*వృత్తత్రయధరణీత్రయ మన్వశ్రాణాం విభజ్యగణనేవ ।*
*సప్తభిరితరైశ్చక్రై శ్చక్రే నక్షత్రరూపత్వమ్ ॥*

శ్రీచక్రంలో వృత్తాలు 3, భూపుర రేఖలు 3, చతుర్దాశారంలో కోణాలు 14, బిందువు, త్రికోణము, అష్టకోణము, అంతర్దశారము, బహిర్దశారము, అష్టదళము, షోడశదళము. మొత్తం సంఖ్య 27. నక్షత్రాలు 27. కాబట్టి శ్రీచక్రానికి నక్షత్ర స్వరూపం ఏర్పడింది.

## 5.4 గురుశిష్యులకు గణేశాది రూపాలు

పరదేవత, మంత్రము మాదిరిగానే గురుశిష్యులకు కూడా గణేశాది రూపత్వమున్నది.

## 6. సర్వరహస్యార్థము

*మూలాధారే తటిద్రూపే వాగ్భవాకారతాంగతే ॥*

*అష్టత్రిశత్కళాయుక్త పంచాశ ద్వర్ణ విగ్రహో ।*

విద్యాకుండలినీ రూపా మండలత్రయ భేదినీ ॥
తటిత్కోటినిభప్రఖ్యా బిసతంతునిభాకృతి:
వ్యోమేంద్రు మండలాసక్తా సుధా స్రోత: స్వరూపిణీ ॥
సదావ్యాప్త జగత్కృత్స్నా సదానంద స్వరూపిణీ ।
ఏషా స్వాత్మేతి బుద్ధిస్తు రహస్యార్థో మహేశ్వరి ॥

వాగ్భవాకారము అంటే ఏకారము. సంస్కృతంలో ఈ అక్షరానికి మూడు రేఖలు ఉంటాయి. అందుచేత త్రికోణము అని చెప్పబడింది. మూలాధార చక్రమందు త్రికోణమున్నది. దానియందు విద్యుత్ కాంతులతో సమానమైన కాంతి గల కుండలిని ముప్ఫై ఎనిమిది కళలతో కూడి ఉన్నది.

| | | | |
|---|---|---|---|
| 1. | అకారము నుంచి అః వరకు చంద్రకళలు | - | 16 |
| 2. | క నుంచి భ వరకు రెండు అక్షరములకు ఒక కళ చొప్పున సూర్య కళలు | - | 12 |
| 3. | య నుంచి క్ష వరకు అగ్ని కళలు | - | 10 |
| | మొత్తం కళలు | | 38 |

| | | |
|---|---|---|
| మంత్రములో మొదటి కూటమి | - | అగ్ని మండలము |
| రెండవ కూటమి | - | సూర్య మండలము |
| మూడవ కూటమి | - | చంద్ర మండలము |

**చంద్ర కళలు పదహారు అవి :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అమృతా | 6. | రతి | 11. | జ్యోత్స్న |
| 2. | మానదా | 7. | ధృతి | 12. | శ్రీ |
| 3. | పూషా | 8. | శశినీ | 13. | ప్రీతి |
| 4. | తుష్టి | 9. | చంద్రికా | 14. | అంగదా |
| 5. | పుష్టి | 10. | కాంతి | 15. | పూర్ణా |
| | | | | 16. | పూర్ణామృతా |

**సూర్యకళలు పన్నెండు. అవి :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తపినీ | 5. | జ్వాలినీ | 9. | విశ్వా |
| 2. | తాపినీ | 6. | రుచి | 10. | బోధిని |
| 3. | ధూమ్రా | 7 | సుషుమ్నా | 11. | ధారిణీ |
| 4. | మరీచీ | 8. | భోగదా | 12. | క్షమా |

**అగ్ని కళలు పది. అవి :**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ధూమ్రా | 5. | విస్ఫులింగినీ | 9. | హవ్యవాహినీ |
| 2. | ఊష్మా | 6. | సుశ్రీ | 10. | కవ్య వాహినీ |
| 3. | జ్వలినీ | 7. | సురూపా | | |
| 4. | జ్వాలినీ | 8. | కపిలా | | |

ఈవిధమైనది శ్రీవిద్య. ఇదే కుండలినీ రూపమైనది. మూలాధారములో కుండలిని స్వయంభూలింగానికి మూడున్నరచుట్లు చుట్టుకుని అధోముఖంగా నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడి ప్రయత్నముతో కుండలిని జాగృతమై, ఊర్ధ్వ ముఖంగా సుషుమ్నగుండా బయలుదేరి, గ్రంధిత్రయాన్ని భేదించుకుని కోట్ల మెరుపుల కాంతి వంటి కాంతితో, శిరస్సుకు రెండు అంగుళాల ఎత్తున ఉండే సహస్రారము చేరుతుంది. సహస్రారము అధోముఖంగా ఉంటుంది. సరి అయిన సాధనతో అది ఊర్ధ్వ ముఖము అవుతుంది. అని అనుభవజ్ఞులు చెబుతున్నారు. సహస్రారంలో చిత్ అనే చంద్రమండలమున్నది. కుండలిని ఎప్పుడైతే సహస్రారము చేరిందో అప్పుడు అక్కడి నుండి సుధాధారలు వర్షిస్తాయి. అప్పుడు కుండలిని ఆ ప్రవాహ రూపిణిగా మారి, అమృత బిందురూపమైన మాతృకాక్షరములచేత ఆజ్ఞా చక్రమునుండి ఆధార చక్రం దాకా అన్ని దళాలను అక్షర రూపంలో తడుపుతుంది. ఈ రకంగా బ్రహ్మానందమనుభవించి, తిరిగి ఆధార చక్రం చేరి నిద్రిస్తుంది. శక్తితో కూడిన ఈ కుండలినియే సాధకుని ఆత్మ. ఈ రకంగా స్థిరమైన భావన ఉండటమే సర్వరహస్యార్థము. విద్య, కుండలిని, ఆత్మ ఈ మూడు ఒక్కటే, వీటికి తేడా లేదు.

## 7. మహా తత్వార్థము

*నిష్కళే పరమేసూక్ష్మే, నిర్లక్ష్యే భావ వర్జితే*
*వ్యోమా తీతం పరేతత్వే ప్రకాశానంద విగ్రహే*
*విశ్వోత్తీర్ణే విశ్వమయే తత్వే స్వాత్మనియోజన: ॥*

పరతత్వము అవయవాలు లేనటువంటిది. అన్నింటికన్న గొప్పది. సూక్ష్మాతి సూక్ష్మమైనది. కంటికి కనిపించనిది. సృష్టిలో మొదటిదైన ఆకాశానికి కూడా ఆది అయినది. అవ్యక్తము, శాశ్వతము సచ్చిదానంద రూపమై జగత్తు అంతా వ్యాపించినది. వెలుగులకు వెలుగు, కాంతులకు కాంతి అయినది.

*వాగింద్రియైరగమ్యై: తత్వాతీతే మహత్తరేఽణుతరే*
*వ్యోమ్నోప్యు పరిస్థితిమతి విశ్వాభిన్నే చిదానందే ॥*
*బ్రహ్మణి పరేని యోజ్య: స్వాత్మాతద భేదనం ప్రాప్త్యై*
*ఏషమహాతత్వార్థ: శ్రీవిద్యాశివేనోక్త: ॥*

వాక్కులచేత ఇటువంటిది అని చెప్పటానికి వీలుకానటువంటిది. ఇంద్రియాల చేత తెలుసుకొనటానికిగాని, ఆలోచించటానికి గాని వీలుకానటువంటిది, ఆశ్చర్యమైనటువంటిది, ముప్పై ఆరు తత్వాలకు అతీతమైనది, కేవలము శూన్యమైనది, అకారహకార స్వరూపమైనది, అన్నింటికన్న గొప్పదైనది, అన్నింటి కన్న సూక్ష్మమైనది, వ్యక్తా వ్యక్తమైనది, చిదాకాశము కన్న పై భాగన ఉండేది, స్వయంప్రకాశము గలది, సుఖ స్వరూపమైనది, అయిన పరమాత్మతో సాధకుడు పొందే అఖండ రసత్వమే మహాతత్వార్థము.

శివశక్తులు వేరుకాదు. ఇద్దరూ ఒక్కటే ! వీరిద్దరిలో ఎవరిని గురించి చెప్పినా ఇద్దరిని గురించి చెప్పినట్లే.

## 8, 9. నామార్థ శబ్దరూపార్థములు

**తత్త ద్వర్ణార్థేయమ్ తత్త ద్వర్ణ స్వరూపేయమ్**
**ఇతి తు శ్రీవిద్యయాః నామార్థః శబ్దరూపార్థః ॥**

శ్రీవిద్యలో ప్రతి అక్షరానికి అర్థం పరదేవత. ప్రతి అక్షరమూ కూడా పరదేవతా స్వరూపమే ఇదే నామార్థ శబ్ద రూపార్థము.

ఈ విద్యలో ప్రతి అక్షరమూ దేవతా స్వరూపమనే విషయం గతంలో నిరూపించటం జరిగింది.

## 10. నామైకదేశార్థము

**కళ్యాణ్యేకాక్షర్యావేశ్రీ చాపిలలితాచ**
**ఇత్థం నామత్రిశతీ వాచ్యోஉర్థః తత్త దక్షరస్యాపి ॥**

మంత్రములో ఉన్న ప్రతి అక్షరమూ దేవతా స్వరూమే. ఆదేవి నామమే. ఈ రకంగానే కకార రూపా, కల్యాణీ, అంటూ ఒక్కొక్క అక్షరానికీ ఇరవై నామాల చొప్పున లలితాత్రిశతిలో మూడు వందల నామాలు చెప్పటం జరిగింది.

ఏదైనా పేరు చెప్పాలంటే ఆపేరులోని ఒకటి, రెండు అక్షరాలు చెప్పినా ఆ పేరు పూర్తిగా చెప్పినట్లే అని భావన. సత్య అంటే సత్యభామ భీమ అంటే భీమసేనుడు అన్నట్లుగా మంత్రంలోని అక్షరాలే కాకుండా మిగిలిన అక్షరాలకు కూడా అలాగే అర్థం వస్తుంది. ఈ రకంగా చూసినట్లైతే పరదేవతానామాలకు కొన్ని కోట్ల అర్థాలు వస్తాయి.

## 11. శాక్త్యార్థము

శాక్త్యార్థము రెండు రకాలు 1) అవయవార్థము 2) శక్తి సమూహార్థము

**వాక్కామ శక్తి కూటై రవయవశో విగ్రహో మాతుః**
**ప్రతిపాద్యోత్రా కంఠాదా మధ్యాదా చ పాదాగ్రాత్ ॥**

శ్రీవిద్యలో మూడు కూటములున్నాయి. ఇవి పరదేవత శరీరంతో అన్వయం చెయ్యటం జరిగింది.

| | | |
|---|---|---|
| 1. వాగ్భవ కూటమి | - | కంఠము నుంచి కిరీటము దాకా |
| 2. కామరాజకూటమి | - | కటి ప్రదేశము నుంచి కంఠం దాకా |
| 3. శక్తి కూటమి | - | పాదాల నుంచి కటి ప్రదేశం దాకా. |

పరదేవత శరీరంలోని మూడు భాగాలూ మూడు కూటములు అని చెప్పటమే అవయవార్థము.

***వేదోభారత్యా మాధవలక్ష్మ్యా రుద్రపార్వత్యా***
***రేఫాంత వర్ణ షట్క స్యార్థాన్ క్రమశో విజానీయాత్ ॥***

శక్తి సమూహార్థము అంటే మంత్రంలోని ప్రతి కూటమిలోనూ బ్రహ్మాది శక్తులను భావించటము. మొదటి కూటమిలో.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క | - | బ్రహ్మ | ఈ | - | విష్ణు | హ | - | రుద్రుడు |
| ఏ | - | భారతి | ల | - | పృధివి | రేఫ | - | రుద్రాణి |

ఈ రకంగా మూడు కూటములలోనూ బ్రహ్మాది దేవతలను భావించటమే శక్తి సమూహార్థము ఈ భావనను భావార్థము నందు వివరించటం జరిగింది.

## 12. సామరస్యార్థము

***క హ యోర్ల సయోరర్థౌ శివశక్తీ శుద్ధ యోరచోశ్శక్తిః***
***ఉభయో స్సమరసభావో హృల్లేఖాయాః పరబ్రహ్మ ॥***

విద్యలోని మూడు క కారములు, రెండు హకారములు శివ స్వరూపాలు. హ్రీంకారాలు శివశక్తి స్వరూపాలుకాగా మిగిలినవి శక్తి స్వరూపాలు. వీటిని లలితా త్రిశతిలో కూడా వివరించటం జరిగింది.

***కత్రయం హద్వయం చైవ శైవభాగః ప్రకీర్తితః***
***శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ముభయాత్మకః ॥***

ఈ రకంగా ప్రతికూటమిలోనూ శివస్వరూపము, శక్తి స్వరూపము, ఉభయాత్మకము ఉంటాయి.

| | | |
|---|---|---|
| మొదటి కూటమిలో | - | క కారము |
| రెండవ కూటమిలో | - | హ, క, హ కారములు |
| మూడవ కూటమిలో | - | క కారము |

ఈ ఐదు అక్షరాలు శివ స్వరూపాలు కాగా.

మొదటి కూటమిలో - ఏ, ఈ, ల, కారములు

రెండవ కూటమిలో - స, ల, కారములు

మూడవ కూటమిలో - స, ల కారములు

ఈ ఏడు అక్షరాలు శక్తి స్వరూపాలు. మూడు హ్రీంకారములు ఉభయాత్మకాలు. ఈ రకంగా శివశక్తుల సామరస్యాన్ని చూపటమే సామరస్యార్థము.

## 13. సమస్తార్థము

*కనక దీప్తావితిథాతో: ప్రకాశత్వం కకారార్థ:*
*అధ్యయనార్థ కతేజస్యా దేకారస్త దేయకరణార్థ: ॥*

క కారానికి - ప్రకాశత్వము, సూక్ష్మత్వము అర్థము.

ఏ కారము - బుద్ధి, ఈ రెండూ కలిస్తే సూక్ష బుద్ధి అని అర్థము.

లహ్రీ - ఆధిక్యము. బిందువు నిర్మాణము.

మొత్తం మీద మొదటి కూటమికి సూక్ష్మ బుద్ధి వ్యాప్తాధిక్యము యొక్క నిర్మాణము అని అర్థము.

లహ్రీ - అధిక్యము బిందువు నిర్మాణము.

మొత్తం మీద మొదటి కూటమికి సూక్ష్మ బుద్ధి వ్యాప్తాధిక్యము యొక్క నిర్మాణము అని అర్థం.

రెండవ కూటమిలో హ - శౌర్యము, స - ధనము,క - సంపత్తు, హ - పైవాటి ప్రాప్తి, లహ్రీం వాటి ఆధిక్యము.

ఈ - కీర్తి, బిందువు -వీటి నిర్మాణము, మొత్తం మీద శౌర్య, ధన ప్రాప్తి, కీర్తి నిర్మాణము అని రెండవ కూటమి అర్థము.

మూడవ కూటమికి పైన చెప్పిన రెండు అర్థములు బాగుగా ఉండేటట్లు చేయటము.

హ్రీంకారాన్ని గనక హ్ర అని, ఈ అని విడదీసినట్లైతే హ్ర కారానికి - సంకల జగత్తు సంహారకారిణి. ఈ కారము - సృష్టి స్థితి కర్త్రీ అని అర్థము. ఈ రకంగా హ్రీంకారానికి సృష్టి స్థితి లయకారిణి అని అర్థము. హ్రీకారానికి - దహరాకాశవర్తిని అని కూడా అర్థము. మొత్తం మీద పరదేవత సూక్ష్మ బుద్ధి వ్యాపక, భోగ్య నిర్మాణకర్త్రి, ధన, శౌర్య, స్త్రీ ప్రాప్త్యాధికర్త్రి, సృష్టి స్థితి సంహారరూపిణి, నాదస్వరూపిణి, దహరాకాశవర్తిని అని అర్థము.

పంచదశీ మంత్రానికి ఏడురకాల వ్యాకరణశాస్త్రసమ్మతి కూడా ఉన్నది. ఛందోబద్ధమైనది. ఈ రకంగా సకల పురుషార్థాలు చెప్పటంచేత మంత్రము సమస్తార్థము అని చెప్పబడింది.

## 14. సగుణార్థము

*కోవిధి రేకారోహరి రకార ఈశస్త్వార్థ మీడపదమ్ ।*
*ద్వి స్వరమధ్య గతస్య డకారస్య లకార ఆదేశః ॥*

మొదటి అక్షరము బ్రహ్మ, రెండవ అక్షరము విష్ణువు. అకారము రుద్రవాచకము.

*తేన ఋగ్వేదాత్మత్వం సూచిత మాద్యస్యకూటస్య ।*
*క్రమశోఽగ్రిమ కూటయుగే తేన యజుస్సామతా సిద్ధా ॥*

| | | |
|---|---|---|
| మొదటి కూటమి | - | ఋగ్వేదాత్మకము |
| రెండవ కూటమి | - | యజుర్వే దాత్మకము |
| మూడవ కూటమి | - | సామవేదాత్మకము. |

*హ్రీమితి నామ విశేష్యం న పుంసకం బ్రహ్మ లక్షకృన ।*
*విధి హరిగిరి శైరీడ్యం, బ్రహ్మేతి ప్రథమ కూటార్థః ॥*

హ్రీంకారము పరబ్రహ్మ స్వరూపము. కాబట్టి ప్రథమ కూటానికి - త్రిమూర్తులచేత త్రముచేయుబడు పరబ్రహ్మ స్వరూపము అని అర్థము.

అలాగే హసకకు - సంతోషము ప్రకటించు ముఖము అని అర్థము. అంటే ఆనంద రూపమైన సూర్య చంద్రులు. ఈ సూర్య చంద్రులు నేత్రాలుగా గల పరబ్రహ్మ 'కలహం' అని బడుతున్నాడు. సూర్య చంద్రులు నేత్రాలు అని చెప్పటం వల్ల బ్రహ్మ చిద్రూపము అని బడుతున్నాడు. సూర్య చంద్రులు జగత్తును ప్రకాశింపచేసినట్లే బ్రహ్మ సూర్య చంద్రులతో ుగా జగత్తును కూడా ప్రకాశింపచేస్తున్నాడు.

పరబ్రహ్మను త్రిమూర్తులు స్తుతించటానికి కారణము ఆయనకు సూర్యచంద్రులు నేత్రాలుగా డటమే. అందుకే రెండవ కూటానికి పరమాత్మ ఆనంద స్వరూపుడని అర్థము.

బ్రహ్మ అంశతో ఉన్న ప్రాణులతో కూడుకొన్న జగత్తు అంతా పరబ్రహ్మస్వరూపమే. ఇది ాడవ కూటమి అర్థము.

ఈ రకంగా పరబ్రహ్మయొక్క గుణాలను గురించి చెప్పటమే సగుణార్థము.

## 15. మహావాక్యార్థము

*విధి హరి శివ వచనా అపి కకార ఏకార ఈకారః ।*
*సృష్టి స్థితి భంగాత్మక తత్త త్కృత్య జనకత్వ లక్షణకాః ॥*
*ఈశ్వర వాచీకారో వక్తి లకార స్సదాశివం తాభ్యామ్ ।*
*లక్షణయాత్ర తిరోదానానుగ్రహకృత్య కారితాగదితా ॥*

'తత్త్వమసి' అనే మహావాక్యంలో 'తత్' అనే పదానికి పంచకృత్య పరాయణుడైన పరమేశ్వరుడు అని అర్థం. ఇది వాచ్యార్థము, లక్ష్యార్థము. 'త్వం' అనే పదానికి జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయ, తురీయాతీతావస్థలు పొందే అవిద్యోపాసకుడైన జీవుడు అని వాచ్యార్థము. అయితే జీవుడు పరమేశ్వరుడికి భిన్నుడు కాదు. జీవుడూ, ఈశ్వరుడూ ఇద్దరూ ఒక్కటే, ఇది లక్ష్యార్థము. ఈ రకంగా లక్ష్యార్థంలో చూసినట్లైతే జీవుడు, పరమేశ్వరుడు ఇద్దరూ ఒకటే అనేది మహావాక్యార్థము.

ప్రథమ కూటమిలో - క ఏ ఈ - అక్షరాలకు బ్రహ్మ విష్ణు రుద్రులు అని అర్థం.

ఈ - ఈశ్వరవాచకము, తిరోదానము

ల - కారము సదాశివ వాచకము, అనుగ్రహములు

హ్రీం - త్రిమూర్తి స్వరూపుడైన పరమేశ్వరుడు

క - జాగ్రదావస్త

ఏ - స్వప్నావస్త

ఈ - సుషుప్తి

హ - తురీయావస్థ

ల - తేరీయా తీతము

హ్రీం - పై అవస్థలు గల ఆత్మ

ఈ ఇద్దరూ ఒక్కటే. జీవుల అవస్తా పంచకమే ఈశ్వరుని కృత్య పంచకము. అందుచేతనే వారిద్దరూ ఒక్కటే అని చెప్పటం జరిగింది. ఇదే మహావాక్యార్థం.

**యోగినీ హృదయము - పంచదశీ మహామంత్రము :** యోగినీ హృదయములోని రెండవ భాగము 'మంత్ర సంకేతము'లో శ్రీవిద్యను వివరించటం జరిగింది. యోగినీ హృదయానికి నాచేత వ్రాయబడిన తెలుగు వ్యాఖ్యయే శ్రీవిద్యా హృదయము.

**మంత్ర సంకేతకస్తస్యా నానాకారోవ్యవస్థితః ।**
**నానా మంత్రక్రమేణైవ పారంపర్యేణ లభ్యతే ॥**

యోగినీ హృదయంలో శివశక్తులు భైరవీ, భైరవులని పిలవబడతారు. ఇక్కడ భైరవుని రూపంలో ఉన్న ఈశ్వరుడు, ఆ పరమేశ్వరికి యంత్ర, మంత్ర పూజా సంకేతాలను వివరిస్తాడు. అందులోని రెండవ భాగమైన మంత్ర సంకేతంలో పంచదశీ మహామంత్రాన్ని వివరిస్తున్నాడు. ఈ మంత్రము లోపాముద్రము, కామరాజీయము ఇంకా అనేక రకాలుగా ఉన్నదని ముందే వివరించటం జరిగింది. ఈ మంత్రానికి ఉండే అర్థము పారంపర్యంగా అంటే గురుముఖతః నేర్చుకోవాలి. లేకపోతే ఆవరణ శక్తులు అతడికి వికారము పుట్టిస్తాయి. అందుచేత గర్విష్టి అయి అధోగతి పొందుతాడు. ఈ మంత్రము హాదివిద్య, కాదివిద్య అని రెండురకాలుగా ఉన్నది.

***షడ్విధస్తంతు దేవేశి కథయామి తవానఘే ।***

భైరవీ ! కాది విద్య యొక్క గూఢార్థము ఆరు రకాలు. అవి

***భావార్థః సంప్రదాయార్థో నిగర్భార్థశ్చ కౌలికః ॥***
***తథా సర్వ రహస్యార్థో మహాతత్వార్థ ఏవచ ।***
***అక్షరార్థో హి భావార్థః కేవలః పరమేశ్వరి ॥***

1. భావార్థము
2. సంప్రదాయార్థము
3. నిగర్భార్థము
4. కౌళికార్థము
5. సర్వ రహస్యార్థము
6. మహాతత్వార్థము

ఇక్కడ భావార్థాన్ని వివరిస్తున్నాడు. ఒక మాట యొక్క అర్థాన్ని శబ్ద లక్షణము, ఉపమానము, యౌగికము (ఉపయోగముగా చెప్పుట) వ్యాకరణము మొదలైన వాటి సహాయం లేకుండా అక్షరాల సహాయంతోనే తెలుసుకోగలిగే అర్థాన్ని భావార్థము అంటారు. అదే అక్షరార్థము. అక్షరాలు శ్రీవిద్యకు అవయములవంటివి. పంచదశీ మహామంత్రాన్ని మనువు, చంద్రుడు, లోపాముద్ర, విష్ణువు. ఈ రకంగా అనేక మంది అనేక రకాలుగా ఉపాసించినప్పటికీ అన్ని మంత్రాల అర్థం ఒక్కటే. ఈ విద్యలన్నింటిలోకి కాది, హాది విద్యలు శ్రేష్టమని, వాటిలో కూడా కామరాజీయము శ్రేష్టమైనదని ముందే చెప్పబడినది. అందుచేతనే కాది విద్యాపరంగా మంత్రార్థం చెప్పటం జరిగింది.

**కామకలావిలాసము - పంచదశీ మహామంత్రము :** ఈ గ్రంథాన్ని రచించినవారు పుణ్యానంద మునీంద్రులు. దీనికి నేను వ్రాసిన తెలుగు వ్యాఖ్యయే శ్రీవిద్యా సర్వస్వము.

కృతయుగానికి ముందు ఏకాకిగా ఉన్న బిందు స్వరూపుడైన పరమేశ్వరుడు, జగత్తును సృష్టించదలచుకున్నవాడై ముందుగా తనను తాను రెండు భాగాలుగా చేసుకున్నాడు. అందులో ఒకటి ప్రకాశాంశ. రెండవది విమర్శాంశ.

అందులో ప్రకాశాంశ పరమేశ్వరుడు, విమర్శాంశ పరమేశ్వరి.

ప్రకాశబిందువు శుక్ల బిందువు. కాగా విమర్శబిందువు రక్త బిందువు. ఈ బిందువులు సృష్టి స్థితిలయాల రూపము గలవి. యోని చక్రంలో మధ్యగల బిందువు ఆత్మ. దానిలో ప్రకాశ విమర్శాంశ లనబడే శివశక్తుల మేళనమున్నది. అదే సృష్టికి కారణము. అది గుణత్రయము. బీజత్రయము. (వాగ్భవ, కామరాజ, శక్తి బీజాలు) త్రిమూర్తి ద్వంద్వము, యోని చక్రంలోని కోణబిందువుల వల్లనే మండల త్రయము, (చంద్ర సూర్యాగ్నిమండలాలు) దాన్నుంచి పంచభూతాలు, తన్మాత్రలు ఈ రకంగా సృష్టి ఏర్పడింది.

యోని చక్రం అంటే త్రికోణం. దానికి మూడు రేఖలు, మధ్యలో ఒక బిందువు ఉన్నాయి. అదే సంవిద్బిందువు. ఇది అవ్యక్తమైనది. దీని కాంతి కిరణాలవల్లనే యోని చక్రం ఏర్పడింది. బిందువులో లీనమై ఉన్న అక్షరాలు యోనిచక్రంలోని మూడు రేఖలలోను ఒక్కొక్క దానిలోను

పదహారు చొప్పున, హ ళ క్ష అనే మూడు అక్షరాలు మూడు కోణాలలోనూ ఉంటాయి. ఇక్కడ అవ్యక్తముగా ఉన్న శబ్దము విశుద్ధ చక్రం చేరేసరికి స్పష్టమైన రూపం దాలుస్తుంది.

ప్రకాశ, విమర్శాంశలు నామరూపాలుగా ఉన్నాయి. నామము యాభై అక్షరాలతోనూ, రూపము ఇరవై నాలుగు తత్త్వాలతోనూ, కూడి ఉన్నాయి. వీటిలో ప్రకాశాంశ రూపాన్నీ, విమర్శాంశ నామాన్ని తెలుపుతున్నాయి.

రక్త శుక్లబిందువుల కలయిక వల్లనే మిశ్రమ బిందువు ఏర్పడింది. ఈ బిందువులే పంచదశీ మహామంత్రంలో భాగంగా బీజత్రయము, గుణత్రయము, మండల త్రయము, పీఠత్రయము, శక్తిత్రయము, మాతృ మానమేయములుగా ఉన్నాయి. ఈ జగత్తు అంతా గుణత్రయమువల్లనే వ్యాప్తి చెందినది.

మొట్టమొదటగా ఆత్మ అనే వస్తువు మాత్రమే ఉన్నది. అదే పరబ్రహ్మ, ప్రకాశ బిందువు. దాని స్వరూపము సత్యము.దాని ధర్మాలు జ్ఞానము, ఆనందము. సృష్టి చెయ్యాలనే తలంపు వచ్చిన తరువాత ప్రకాశ బిందువు నుంచి ఛాయా బింబమైన తమోబింబము ఒకటి ఆవిర్భవించింది. తమోబింబము అసలు బింబముకన్నా వేరుగా ఉన్నది. ఇది సత్యము నిత్యము కానటువంటిది. ఇదే మాయ.

ఈ రకంగా రెండు బిందువులు ఏర్పడ్డాయి. వాటి సమ్మేళనమువల్ల మిశ్రమ బిందువు ఏర్పడింది. ప్రకాశబిందువు శుక్లబిందువు. సత్వగుణము గలది. తమోబిందువు రక్తబిందువు. తమోగుణము గలది. మిశ్రమ బిందువు రజోగుణ ప్రధానమైనది. ఈ రకంగా సత్వరజస్తమో గుణాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ కలిసి అవ్యక్త చక్రం ఏర్పడింది. దీనిలో కనిపించిన ప్రతిబింబమే సాక్షి. ఈ అవ్యక్తమే గుణత్రయము యొక్క మేళనవస్తువు. సృష్టికి మొదటి స్థానము.

ఆత్మ యొక్క ప్రతిబింబము ఈశ్వరుడు. అతని ప్రతిబింబము హిరణ్యగర్భుడు. అతడి ప్రతిబింబము విరాట్స్వరూపము. ఈ రకంగా,

అవ్యక్తము - బీజము
మహత్తత్త్వము - స్పష్టమైన రూపం గలది
అహంకారము - నీలమేఘం వంటిది. రూపం గలది. ఇక్కడ నుంచి త్రిపుటి ఆవిర్భవించింది.

ఇక్కడ మూడు గుణాలు విడిపోయినాయి. ప్రతి గుణము ఆరు భాగాలయింది. అందులో మూడు భాగాలు స్వంతము, రెండు భాగాలు రెండవది, ఒక భాగము మూడవది. అంటే సత్వగుణంలో మూడు భాగాలు సత్వగుణము, రెండు భాగాలు రజోగుణము, ఒక భాగము తమోగుణము. ఈ రకంగా ఏర్పడ్డ గుణత్రయంవల్లనే బ్రహ్మాండ మం తానిండి ఉన్నది. గుణత్రయ భేదం వల్లనే జగత్తులో వివిధ ఆకారాలు, స్వరాలు, వాసనలు, ప్రవృత్తులు కలిగిన ప్రాలుత్పన్న మైనాయి. ఈ గుణాలకు అధిపతులే త్రిమూర్తులు.

యోనిచక్రంలో మూడు కోణాలున్నాయి. ఆ కోణాలలో మూడు బిందువులున్నాయి. అక్కడ వాగ్భవ కామరాజశక్తి బీజాలు, గుణత్రయము, చంద్ర సూర్యాగ్ని మండలాలు మాతృమాన మేయములు, మాతృకాత్రయము (అ నుంచి అః వరకు, క నుంచి త వరకు థ నుంచి స వరకు) మొదలైన త్రిపుటి అవయవాలుగా గలిగి సంవిద్రూప బిందువైన పరమాత్మ స్వరూపమైన పరమేశ్వరి విరాజిల్లుతున్నది. ఈ రకంగా త్రిపుటి ఉండటంచేతనే ఆమె త్రిపురసుందరి అని పిలవబడుతున్నది. ప్రకాశబిందువైన పరమేశ్వరుడు బింబముకాగా విమర్శరూపమైన పరమేశ్వరి ప్రతిబింబము అని ఇదివరకే చెప్పటం జరిగింది.

పంచభూతాల సూక్ష్మరూపాలే తన్మాత్రలు. వీటిలో ఆకాశము వ్యాప్యము అయితే మిగిలినవి వ్యాపకాలు, ఈ రకంగా వ్యాప్య, వ్యాపక భావంచేత పదిహేను సూక్ష్మాంశలవుతున్నాయి.

ఆకాశమందు - శబ్దము
వాయువునందు - శబ్దము, స్పర్శ
అగ్నియందు - శబ్దము, స్పర్శ, రూపము,
జలము నందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము
భూమి యందు - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము

ఈ రకంగా పంచభూతాలలో ఉన్న సూక్ష్మాంశలే పదిహేను మంత్ర బీజాక్షరాలయినాయి.

గతంలో చెప్పినట్లుగా వీటన్నింటికీ కారణము ఆత్మ. అదే షోడశ నిత్యలలో ఆఖరిదైన మహానిత్య. షోడశీకళ. దానినుంచే పదిహేను బీజాక్షరాలూ ఉద్భవించాయి.

## రుద్రయామళము - పంచదశి

ప్రసిద్ధ యామళగ్రంథమైన రుద్రయామళంలోని త్రికూటా రహస్యములో పంచదశి మహామంత్రాన్ని ఈ విధంగా వివరించటం జరిగింది.

**శ్రీదేవ్యువాచ :**

శ్లో ॥ *దేవదేవ మహాదేవ శరణాగత వత్సల ।*
*మూలమంత్రస్య మధ్యే యా శ్రీవిద్యా కథితా త్వయా ॥*
*త్రికూటేతి మహావిద్యా మహాపంచదశాక్షరీ ।*
*తస్యామనుద్ధార విధిం శ్రోతు మిచ్ఛామి తత్వతః ॥*

**శ్రీభైరవ ఉవాచ :**

శ్లో ॥ *అధునా శృణుదేవేశి త్రికూటా మంత్ర నిర్ణయం ।*
*సుత్యం గుహ్యాతమం దేవి న కస్య కథితం మయా ॥*

హిమాద్రి శిఖర శృంగే కైలాసాఖ్యే తప: స్వత: ।
మమజాతా పరాశక్తి : సృష్టిస్థితి లయాత్మికా ॥
తథాస్తోత్రై: పద్యైర్దివ్యై స్తుష్ట్వా త్రిపుర సుందరీ ।
ప్రాదుర్బభూవ మే దేవీ వరదాన సముద్యతా ॥
తథా మే కథితా విద్యా కూటత్రయ సముజ్వలా ॥
త్వయా పరమయా భక్త్యా గ్రహీతా గోపితామయా ॥
అస్యా: కూట త్రయోద్ధారం సర్వతంత్రేషు గోపితం ॥
బ్రహ్మాది స్తంభ పర్యంతం వ్యాప్తం వా సచరా చరం ॥
జగద్బ్రహ్మాండ కటకం కటాహం కుళకాళికాం ।
ఏషాం బీజాక్షరోద్ధారం శృణుదేవి యధాసుఖం ॥
తవభక్త్యా బ్రవీమ్యద్య న ప్రకాశ్యం కదాచన ।
కకార కూటం ప్రథమం శివార్ణద్యం ద్వితీయ్యకం ॥
శక్త్యర్ణవం తృతీయం స్యాద్భువన త్రయవ్యాపకం ।

తత్రాదౌ కకార కూటోద్ధార :

వేధోభీజ మధోప్యర్ణా మధ్యే జిష్ణు : స్తమ: పరా ।
కూటస్సర్వ్యాపకోస్స్వాది: కామేశ: కామవర్ధన:

అథ ప్రకాశాన్ :

అనేన సృజ్యతే విశ్వం మహా త్రిపుర సుందరి ॥
బ్రహ్మాండాది కటాహాంతం జయదం భువనత్రయే ॥
సర్వం మమ శరీరస్య త్వయారూపం వినిర్ణయం ॥
మాయాధిరూఢ తిమిరం నిఖిరాధి రూఢో ॥
విష్ణుస్త ధైవ చలతామఘువాధి రూఢా: ॥
వల్యాది రూఢచరణోస్త్వయ మాది కూట:
స్వాదీశ విష్ణు: కమలాసన జాస్యమాన: ॥
క ఏ ఈ ల హ్రీం ఇతి ప్రథమ కూటోద్ధార:

అథ ద్వితీయ కూటోద్ధార :

శ్లో.॥ భవిశక్తి శిర: కాంతి: స్తమోమాయా షడాక్షర: ।
కూటో భృవోవ్యాపకోయం ద్వితీయే భువన: ప్రభు: ॥
హ స క హ ల హ్రీం ॥ ఇతి ద్వితీయ కూట:

అనేన పాల్యతే దేవి జగస్థావర జంగమం ।
బ్రహ్మాది స్తంభ పర్యంతం మహా శ్రీషోడశాక్షరీ ॥
మాయారూఢ తమస్తద్వైవ తిమిరారూఢాచ్ఛవిస్తత్ప్రదం ।
కాంత్యాం రూఢ శిరఃస్తతః పరమహోమూర్ధ్నాధిరూఢా శరత్
శంకారూఢచ్ఛవి సబిందు ముకుటః కూటో ద్వితీయ్యోత్స్యయం
స్వర్వామజన జప్యమాన ఇనవద్రమ్యా స్పదం సంపదాం ।
ఇతి ద్వితీయ కూటోద్ధారః ॥ హ స క్లీం ఓం ల హ్రీం ॥

**అథ తృతీయ కూటాద్ధార :**

శక్తి శ్శీర స్తమో మాయా కూటోయం చతురక్షరః ।
భూయాయకో మహాదేవి త్రిపురాయాస్తృతీయకః ॥
స క ల హ్రీం ॥ ఇతి ॥
అనేనలీయతే విశ్వం మహా త్రిపుర సుందరీ ।
బ్రహ్మాదికీట పర్యంత భువన త్రయ వ్యాపినీ ॥
మాయా రూఢం ధ్వాంత బీజం మహేశీ మోహారూఢా వారుణీవర్ణ శక్తి : ।
మూర్ధ్నా రూఢా ప్యాచ్ఛరం బిందు మాన్యాకూటోస్తేం ద్రోపేంద్ర సూర్యేందు జాప్యం ॥

**అథ ప్రకాశాన్ :**

క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।
అనయా సదృశీ విద్యా త్రికూటా భువనేశ్వరీ ।
గోపనీయా ప్రయత్నేన ఇత్యాజ్ఞా పరమేశ్వరి ॥

ఆత్మజ్ఞానం తెలుసుకోవటానికి అనేక విద్యలున్నాయి. వాటిలో వేదాలు ఒకటి. ఆ వేదాలలో
ప్రబడిందే గాయత్రీ మంత్రము. అది రెండు రకాలు 1) ఉపనయనం నాడు చెప్పేది 2) వేదాలలో
స్యంగా ఉన్నది. అదే పంచదశీ మహామంత్రము. అందుచేతనే గాయత్రీ మంత్రానికీ పంచదశీ
రో మంత్రానికీ బేధం లేదు. రెండూ పరాశక్తి స్వరూపాలే. బ్రాహ్మణుల కోసం గాయత్రీ మంత్రం
ఆడగా అన్ని వర్ణాలవారి కోసము పంచదశీ మహామంత్రము ఏర్పడింది.



# 6. పంచదశీ మహామంత్రము - నిగూఢతరార్థములు

పంచదశీ మంత్రానికి అనేక రకాలుగా అర్థం చెప్పబడుతోంది. ఒకే అక్షరానికి అనేక రకాల అర్థాలు చెప్పటంవల్ల ఈ మంత్రార్థం విస్తృతంగా ఉన్నది.

## 1. చతుర్వర్గార్థము

క - సమస్త వేదములు
ఏ - సమస్త శాస్త్రములు, వేదాంగములు
ఈ - ప్రతి భావము
ల - మత ఖండనము
హ్రీం - విద్య, సూక్ష్మబుద్ధి
హ - సువర్ణ రజతాదులు
స - త్రివిధ తాప నివారణము
క - సకల సుఖోపకరణములు
హ - సంగీత సాహిత్య శోభియై, భోగి, త్యాగి, యశస్వియై
ల - సర్వప్రతిబంధములను
హ్రీం - హరించి పైన చెప్పినవన్నియు ప్రాప్తింప చేయునది శ్రీవిద్య
సకల - సమస్త ద్వైతప్రపంచములు
హ్రీం - హరించుటచే మహానందము పొందించునది.

సర్వవేద, వేదాంగ, సర్వశాస్త్ర, తంత్ర, పురాణ, ఇతిహాసాది భావమును కలిగించునది, బుద్ధి చాతుర్యమునిచ్చునది. సర్వతాపాలను నివారించి, ప్రతిబంధకాలను హరించి మహదానందము నిచ్చునది శ్రీవిద్యాపరదేవత. అంటే అంతమందు ముక్తినిస్తుంది.

## 2. స్వాత్మానుభవార్థము

**ప్రథమఖండము :**

ఏ - కామేశ్వరాంకవాసిని అయిన ఓ పరదేవతా, నీవు
క - ప్రత్యగాత్మ విషయమందు నాకున్న
హ్రీం - ఆవరణశక్తిని
ఈల - నివారింపుము.

**ద్వితీయ ఖండము :**

క - పరబ్రహ్మ యొక్క

హల - బ్రహ్మగ్రాహికమైన
హ్రీం - శుద్ధబుద్ధి వృత్తిని
హస - వికసింపచేయుము

**తృతీయ ఖండము :**

సకల హ్రీం - ఆత్మానాత్మరూపమైన సర్వద్వైత ప్రపంచబుద్ధిని, యధార్థాత్మజ్ఞానముచే
ఈల - నివారింపుము

## 3. గాయత్రీ సర్వస్వార్థము

**ప్రథమ ఖండము :**

క - సవితృదేవునందు నిషితమై
ఏ - శివశక్త్యాత్మకమైన పరంజ్యోతి రూపముగా ధ్యానింపబడు
హ్రీం - మహాత్రిపుర సుందరివైన నీవు ఆవృత్తి చేత
ఈల - పరమార్థమైన పరంజ్యోతియందు ప్రవర్తింపచేయుము.

**ద్వితీయ ఖండము :**

హసక - రజస్తమో గుణాతీతమై, నిర్మలమైన
హల - గ్రహింపయోగ్యమైనది
హ్రీం - ఓం

**తృతీయ ఖండము :**

సకల హ్రీం- సకల వాచ్య వాచక రూపమైన సర్వమును హ్రీం పరబ్రహ్మమే అని అర్థము.

## 4. ప్రపత్తి రూప భక్త్యతిశయార్థము

**ప్రథమ ఖండము :**

క - ఓ కామేశ్వరా !
హ్రీం - శ్రీ మహాదేవి జగజ్జనని
ఏ - నీపాదకమలచెంత
ఈల - నన్ను జేరనిమ్ము.

**ద్వితీయ ఖండము :**

క - పరమేశ్వరా
హ్రీం - నా తల్లియైన ఓ పరదేవతా
హస - ప్రసన్నురాలవు కావలసినది
హల - నన్ను నీ దగ్గరకు రప్పించుకోవలసినది.

**తృతీయ ఖండము :**

సకలహ్రీం - ఓ సర్వశక్తిమయీ, నీవు అన్ని శక్తులు గలదానవు.

## 5. ప్రజ్ఞాసిద్ధ్యర్థము

**ప్రథమ ఖండము :**

ఏ - శ్రీవిద్యేశ్వరీ నీవు

క - సర్వ వేదాశాస్త్రమందు

హ్రీం - బుద్ధిని

ఈల - ప్రవర్తింపచేయుము

**ద్వితీయ ఖండము :**

క - సర్వ శాస్త్రముల యొక్క

హలహ్రీం - బుద్ధి చాతుర్యమును

హస - వికసింపచేయుము

**తృతీయ ఖండము :**

సకల - సర్వము యొక్క

హ్రీం - యదార్థ స్వభావమును

హస - ప్రకాశింపచేయుము. నన్ను సర్వజ్ఞునిగ చేయుము.

## 6. ఐహికార్థము

**ప్రథమఖండము :**

ఏ - శివకామేశ్వరీ

క - ఐహిక సుఖమందు

హ్రీం - నాబుద్ధిని

ఈల - ప్రవర్తింపచేయుము

**ద్వితీయ ఖండము :**

క - ఈ సుఖమును

హల - ధనధాన్యాది సంపదలవల్ల

హ్రీం - సమృద్ధిని

హస - ప్రకాశింపచేయుము

ృతీయ ఖండము :

సకల - విద్యా, కాంతి, దీర్ఘాయుష్షు
హ్రీం - ఆరోగ్యమును, సకలమును
ఈల - పొందింపుము.

## 7. సకల నిష్కల రూపార్థము

ధమ ఖండము :

క - బ్రహ్మ
ఏ - సరస్వతి
హ్రీం - ఆ ఇద్దరి రూపమైన విద్యా దేవతను
ఈల - స్తుతించుము

ృతీయ ఖండము :

క - ఓ సాధకా !
హ - మహావిష్ణువు
ల - లక్ష్మి
హ్రీం - వారిద్దరి రూపమైన రాజరాజేశ్వరిని
హస - ప్రసన్నురాలునిగ చేసుకొనుము

ృతీయ ఖండము :

సకల - కాళితో కూడిన శివుని
హ్రీం - వారి స్వరూపమైన మహాత్రిపురసుందరిని
ఈల - శ్రీవిద్యా సహస్ర నామాదులచే పూజించుము
హస - పూజా ధ్యాన యోగాలతో ప్రసన్నురాలునిగ చేసుకొనుము.

ుక్ష్మీ ప్రథమ ఖండము :

ఏ - సర్వపదార్థమందు
హ్రీం - పరబ్రహ్మరూపము

ృతీయ ఖండము :

హస - అనే వర్ణద్వయరూపంలో
క - ప్రాణవాయువు యొక్క
హల - అజాపా మంత్ర రూపమున
హ్రీం - జీవాత్మ, పరమాత్మైక రూపంలో ప్రకాశించుదానిని

**తృతీయ ఖండము :**

సకల - సర్వకళలతోనూ ప్రకాశించు దివ్యమంగళ విగ్రహమైన

హ్రీం - సృష్టి స్థితి సంహార రూపిణి అయిన శ్రీ మహాత్రిపుర సుందరిని

ఈల - తెలుసుకొనుము

## 8. ఆగమహృదయార్ధము

**ప్రథమ ఖండము :**

ఏ - మూలాధారస్థ త్రికోణ చక్రములో ఉండే

ఈ - కుండలినీ శక్తి

క - సహస్ర దళమధ్యమున

లహ్రీం - చంద్ర మండలమునుండి జాలువారు అమృత బిందువులు శరీరంలోని డెబ్బైరెండు వేల నాడీమండలాన్నీ తడుపుతాయి.

**ద్వితీయ ఖండము :**

ల - మూలాధారంలో ఉన్న భూతత్త్వమును

హ - మణిపూరంలోని జలతత్త్వమును

క - స్వాధిష్ఠానంలోని అగ్ని తత్త్వమును

స - అనాహతంలోని వాయుతత్త్వమును

హ - విశుద్ధ చక్రంలోని ఆకాశ తత్త్వమును

హ్రీం - మనస్తత్త్వాత్మకమైన ఆజ్ఞాచక్రం దాటి సహస్రారకమలం చేరిన కుండలినీ శక్తి పరమశివునితో కలిసి పరమానందము పొందుచున్నది.

**తృతీయ ఖండము :**

సకలహ్రీం - సహస్ర దళాలు కలిగినటువంటి, సహస్రారము వృద్ధి క్షయాలు లేనటువంటి చంద్రమండలము. అందులో కోట్లకొలది సూర్య చంద్రుల కాంతితో ప్రకాసించు పరమేశ్వరిని దర్శించి, సాధకుడు అనిర్వచనీయమైన ఆనందము పొందుచున్నాడు.

## 9. ఆధార దేవతా స్వరూపార్ధము

**ప్రథమఖండము :**

హ్రీం - పరదేవతయే

క - శిరస్సున

ఏ - పరమగురువు పరబ్రహ్మ రూపము.

ద్వితీయ ఖండము :

హ - ఆజ్ఞాచక్రంలోని ఈశ్వరుడు

స - విశుద్ధ చక్రంలోని జీవుడు

క - అనాహతంలోని రుద్రుడు

హ - మణిపూరంలోని విష్ణువు

ల - స్వాధిష్ఠానంలోని బ్రహ్మ

హ్రీం - ఆధారచక్రంలోని గణపతి రూపం పొందుచున్నది. అంటే ఏడు చక్రములను అధిష్ఠించి ఉండేది ఆ త్రిపురసుందరి అని అర్ధం.

తృతీయ ఖండము :

సకల - ఇంకా చెప్పబడిన పద్మాలున్నాయి కాబట్టి అన్ని దేవతలూ ఆ పరదేవత యొక్క స్వరూపమే.

## 10. సమర్పణార్ధము

ప్రథమ ఖండము :

ఏ - ఓ పరదేవతా !

హ్రీం - జగన్మాతవైన నిన్ను

ఈల - స్తుతించుచున్నాను

క - నా హృదయ కమలమునకు

ఈల - రమ్మ, నాకు సాన్నిధ్యము నిమ్మ.

ద్వితీయ ఖండము :

క - ఓ పరమేశ్వరా !

హ్రీం - చంద్ర విద్యను

హల - అందుకొనుము

హస - ప్రసన్నుడవగుము.

తృతీయ ఖండము

సకలహ్రీం- సకల ప్రపంచాన్నీ నిర్మించేది ఆ పరదేవత అని అర్ధము.

## 7. పంచదశీ మహామంత్రము - ప్రయోగార్థములు

పంచదశీ మహామంత్రము లౌకిక, పారలౌకికమైన అనేక విషయాలను సాధించటానికి ప్రయోగించబడుతుంది. పంచదశీ మహామంత్రంలోని పదిహేను బీజాలూ సర్వ దేవతల స్వరూపమని, సృష్టి స్థితిలయాలకు ప్రతి రూపమని, సర్వ వర్ణమయమని ముందే చెప్పబడింది. అందుచేతనే అందులోని ప్రతి బీజాక్షరానికీ అనేకమైన అర్థాలు చెప్పబడ్డాయి. దాని వల్ల ఈ మంత్రజపం చేసినట్లైతే అన్నిరకాల కోరికలూ తీరతాయి. ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి. పుత్రపౌత్రాభివృద్ధి కలుగుతుంది. విద్యాభివృద్ధి జరుగుతుంది. రాజవశ్యము, సర్వజనవశ్యము, శత్రునాశనము జరుగుతుంది. సర్వవ్యాధులు తగ్గుతాయి. సర్వ విషాలు హరిస్తాయి. గృహసంబంధమైన బాధలు, దుష్టగ్రహ బాధలు, చాతబడిలాంటి ప్రయోగాలు నశిస్తాయి. పాపక్షయము కలుగుతుంది. తద్వారా పరదేవతానుగ్రహ ప్రసాదసిద్ధి లభిస్తుంది. లక్ష్మీ ప్రాప్తి వల్ల సిరిసంపదలు కలుగుతాయి. అందుచేతనే శ్రీవిద్యనుపాసించినవాడు అష్టైశ్వర్యములు పొంది భోగభాగ్యాలతో తులతూగుతాడు. అంతేకాదు మరణానంతరము సాయుజ్యము అంటే ముక్తి కూడా ప్రాప్తిస్తుంది.

అర్థం తెలియని మంత్ర జపం వ్యర్థం కాబట్టి ఈ మంత్రానికున్న ప్రయోగార్థ విశేషాలు ఇక్కడ చెప్పబడుతున్నాయి.

### I. ఆయురైశ్వర్యములకు ప్రయోగము

**ప్రథమ ఖండము :**

క - చిత్తమందు

ఏ - ఓ రాజరాజేశ్వరి అని

 హ్రీం - ఆ పరదేవతను

ఈల - స్తుతింతును.

**తృతీయ ఖండము :**

సకలహ్రీం- చంద్రకళా విద్యయైన శ్రీవిద్యను

**ద్వితీయ ఖండము :**

కహ - జపించునట్టి

సః - పురుషుడు

లహ్రీం - గృహక్షేత్రాది భూసంపదను

ఈల - పొందుచున్నాడు.

## 2. పతి, పత్నీ, పుత్ర లాభ ప్రయోగము

**ప్రధమ ఖండము :**

ఏ - ఓ పరదేవతా !

క - చిత్తమందు

హ్రీం - శ్రీ మహాత్రిపుర సుందరిని

ఈల - అవధరింపుము

**ద్వితీయ ఖండము :**

హస - ఓ శివకామేశ్వరీ ! ప్రసన్నురాలవుగమ్ము

లహ్రీం - చంద్ర విద్యను (శ్రీవిద్యను)

కహ - జపింతును.

**తృతీయ ఖండము :**

సకల హ్రీం - భర్తను లేక భార్యను ప్రాప్తింపచేయుము.

## 3. విద్యా ప్రాప్తి

**తృతీయ ఖండము :**

సకలహ్రీం - చతుష్షష్టి కళా విద్యలతో కూడిన ప్రజ్ఞను

**ద్వితీయ ఖండము :**

లహ్రీం - ప్రజ్ఞాపాటవాలను

కహా - ఉపదేశింపుము

హస - నా చిత్తమును ప్రకాశింపచేయుము.

**ప్రధమ ఖండము :**

ఏ - పరమశివుని అంకమందున్న

హ్రీం - శ్రీ విజ్ఞానేశ్వరిని

క - ఈ విద్యచే

ఈల - స్తుతింతును.

## 4. రాజవశ్యము

**తృతీయ ఖండము :**

సకలహ్రీం - రాజు యొక్క బుద్ధిని, వృత్తిని

**ృతీయ ఖండము :**

హల - ఆకర్షింపుము

కహ - నన్ను గురించి భాషింపచేయుము

హ్రీం - ఆ బుద్ధిని,

హస - నా యెడల ప్రసన్నముగా చేయుము.

**థమ ఖండము :**

క - బాలభాస్కరునియందు

ఏ - ఎర్రనికాంతుల రూపంలో ఉన్న

హ్రీం - శ్రీవిద్యను

ఈల - స్తుతింతును.

## 5. శత్రునాశనము

**ృతీయ ఖండము :**

సకల హ్రీం- సర్వ సంహారణ కారిణి అయిన మహాకాళి స్వరూపమైన పరమేశ్వరీ

**ృతీయ ఖండము :**

హసక - నా శత్రువు యొక్క

హల - శిరస్సును ఖండించటానికి

హ్రీం - ఉద్యుక్తురాలవుకమ్మ

**థమ ఖండము :**

క - అగ్ని మండలమందున్న

హ్రీం - జ్వాలామాలా పరివృతమైన ప్రత్యంగిరను

ఏ - ఓ అమ్మా ! అని పిలుస్తూ

ఈల - స్తుతి చేయుచున్నాను.

## 6. రోగహార ప్రయోగము

**ృతీయ ఖండము :**

సకల - వాత, పిత్త, కఫములు

హ్రీం - పెరుగుటచే వచ్చే రోగాలను నాశనము చేయుము

**థమ ఖండము :**

క - ఆదిత్య మండలమందుండు

హ్రీం - శ్రీదేవి

ఏ - చరణ యుగళము

ఈల - తేజస్సు పొందినదిగా భావింతును.

శ్రీ పరదేవతే హసప్రసీదప్రసీద మమరోగాన్ నాశయ నాశయ

## 7. విషహర ప్రయోగము

ప్రథమఖండము :

ఈ - పాము

ల - యొక్క కాటును

హ్రీం - హరించునది,

క - సుధా సముద్రమున

ఏ - మణి ద్వీపమునందుండు

తృతీయ ఖండము :

సకల హ్రీం - సర్వ వ్యాధి ప్రశమని అయిన ఓ దేవీ ।

ద్వితీయ ఖండము :

హస - ప్రసీద ప్రసీద మమ సర్వ విషాణి, సర్వ రోగాంశ్చ నాశయనాశయ అని వేడుతూ

లహ్రీం - శ్రీవిద్యను

కహ - జపింతును.

## 8. గృహచ్ఛిద్రము, అభిచార, దుష్టగ్రహ బాధానివృత్తి, సర్వమంగళ లక్ష్మి ప్రాప్తి యోగము

ప్రథమ ఖండము :

క - నా సంబంధమైన

ఏ - గృహము నందు

ఈల - భేద భావమును, దుఃఖములను

హ్రీం - నశింపచేసి

ద్వితీయ ఖండము :

హ - ఉపద్రవాది దుష్టగ్రహముల యొక్క

సకహల - శత్రువులు అభిచార ప్రయోగముల యొక్క, దుష్ట గ్రహోపద్రవములను

హ్రీం - హరించుటచే శుభము నిచ్చి

**తృతీయ ఖండము :**

సకలహ్రీం - అన్ని రకాలుగానూ నా రక్షణ కొరకు యధోచితబుద్ధినిచ్చునది అయిన శ్రీదేవిని ప్రార్ధింతును

## 9. పాపక్షయము ద్వారా పరదేవతా ప్రసాదసిద్ధి

**తృతీయ ఖండము :**

సకల - సర్వమైన

హ్రీం - అభీష్ట ఫలప్రదాయినిని

**ద్వితీయ ఖండము :**

క - సుఖము యొక్క

హల - ప్రతిబంధకాలయిన మహా పాపాలను

హ్రీం - హరించు దానిని

**ప్రధమ ఖండము :**

ఏ - కామేశ్వరాంకమందున్న

హ్రీం - లలితా త్రిపుర సుందరిని

ఈల - మంత్రములతోనూ, స్తోత్రములతోనూ స్తుతింతును. ఓ పరదేవతా

క - నా చిత్తమందు

**ద్వితీయ ఖండము :**

హస - విలసిల్లుము

**ముక్తి :** హకార సంజ్ఞ గల పరమాత్మ సకార సంజ్ఞ గల ప్రకృతితో కలిసి శబల బ్రహ్మమై, నవరంధ్రములతో నిర్మితమైన మానవ దేహంలో ప్రవేశించి ప్రాపంచికసుఖాలనుభవిస్తూ ఐహిక బంధాలలో కూరుకుపోతున్నాడు. ఈ బంధనాల నుండి విముక్తుడు కావటాన్నే ముక్తి అంటారు. అదే సాయుజ్యం. అయితే షట్చక్రాలలో దేవిని ఆరాధించే వారికి వివిధ రకాల ముక్తులు చెప్పబడ్డాయి.

i) **సాలోక్య ముక్తి :** అనాహతంలో దేవిని పూజించేవారు దేవి పట్టణంలోనే నివసించ గలుగుతారు. ఇదే సాలోక్యముక్తి

హ్రీం - శ్రీ మహాత్రిపుర సుందరి

క - సుధా సముద్రమున

ఏ - శ్రీ పురాతః ప్రదేశమందు స్థానము

ఈల - పొందించునుగాక.

ఆ పరమేశ్వరి నాకు సాలోక్యముక్తి ప్రసాదించుగాక.

**2) సామీప్య ముక్తి :** విశుద్ధ చక్రంలో దేవిని అర్చించేవారు, ఆమెకు అతిదగ్గరగా, సేవకులుగా ఉంటారు.

**ద్వితీయ ఖండము**

క - ఓ పరమేశ్వరీ

హ్రీం - ఓ కామేశ్వరీ

హల - అనుగ్రహించుము.

హస - ప్రసన్నవుకమ్ము.

**ప్రధమ ఖండము :**

హ్రీం - ఓ మాతా !

క - శ్రీ పురము లోపలి భాగమున

ఏ - నీ పాదాల చెంత

ఈల - నన్ను చేర్చుకొమ్ము.

**3. సారూప్య ముక్తి :** ఆజ్ఞా చక్రంలో దేవిని పూజించేవారు, వేరే దేహం ధరించి పరమేశ్వరితో సమానమైన రూపంలో ఉంటారు.

క - ఆత్మ

హ్రీం - శ్రీ త్రిపుర సుందరీ రూపమునే

హల - గ్రహించుచున్నది.

హస - ప్రసన్నవగుము, సారూప్యము ప్రసాదించుము.

**4. సాయుజ్యము :** సహస్రారంలో పరమేశ్వరిని అర్చించేవారు జన్మరాహిత్యం పొందుతారు. వారి ఆత్మ పరమేశ్వరిలో లీనమైపోతుంది.

సకల - జగద్రూపమైన బ్రహ్మాండమంతా

హ్రీం - ఆ పరమేశ్వరి ఆవరించి ఉన్నది. అటువంటి దేవి నాకు ముక్తిని ప్రసాదించుగాక.



# 8. హ్రీంకారము - ప్రాముఖ్యత

పంచదశీ మహామంత్రంలో ఉన్న బీజాక్షరాలన్నింటిలోకీ హ్రీంకారము ముఖ్యమైనది. మంత్రములోని ప్రతి కూటమి చివరా హ్రీంకారమున్నది. ఈ మహామంత్రంలో రెండు హకారములు, మూడు ఈ కారములు శివాక్షరాలు. వీటిని శక్తి చెప్పినది. అలాగే మూడు లకారములు, రెండు సకారములు ఏ కారము, ఈ కారములు శక్త్యక్షరములు. వీటిని పరమేశ్వరుడు చెప్పాడు. కాగా హ్రీంకారములు పరమేశ్వరీ, పరమేశ్వరరూపాలు. అందుకని వీటిని ఇద్దరూ కలిసి చెప్పారు. అందుచేతనే హ్రీంకారానికి అంతటి ప్రాముఖ్యత వచ్చింది. మణిద్వీపంలో ఉండే శుకశారికలు కూడా ఆ దేవిని 'హృల్లేఖీ' అని ధ్యానం చేస్తుంటాయి. హ్రీంకారమనేది పంచదశీ మహామంత్రానికి ప్రాణం వంటిది. అది గనక లేకపోయినట్లైతే ఆ మంత్రానికి శక్తి లేదు. దేవి అనుగ్రహం కావాలంటే ఈ మహామంత్రం అంతా జపం చెయ్యనవసరం లేదు. ఒక్క హ్రీంకార జపం చేస్తే చాలు. అందుకే పరమేశ్వరి 'హ్రీంకార జపసుప్రీతా' అని చెప్పబడింది. హ్రీంకారము మాయాబీజము. ఈ ఒక్క బీజాన్ని జపించి తరించిన మహానుభావులనేకులున్నారు. అంతదాకా ఎందుకు ? ఆ పరమేశ్వరి హ్రీంకార రూపంలోనే ఉంటుంది. హ్రీంకారమందే నివసిస్తుంది. అంతమాత్రం చేత హ్రీంకారమే ఆమె అని కాదు. హ్రీంకారాన్ని జపించినట్లైతే ఆమెను ఆరాధించినట్లే. ఆ దేవికి హ్రీం బీజమునందు మక్కువఎక్కువ. ఆ దేవతను ప్రకాశింపచేసే శక్తి ఆ బీజానికి ఉన్నది. హ్రీంకారము కేవలము ఒక అక్షరం కాదు. ఇందులో హ కారము, రేఫ ఈ కారము, బిందువు ఉన్నాయి. ఈ విధంగా ఇది కొన్ని అక్షరముల సముదాయము. అందుకనే దీనిని పదము అంటారు. ఈ బీజాన్ని గనక పునశ్చరణ చేసినట్లైతే సకల పురుషార్థాలు లభిస్తాయి. ఇందులోని హకారము - ఆకాశతత్త్వము, ఈశ్వర బీజము. రేఫ అగ్ని బీజము. హకారము రేఫతో కలిసినప్పుడు శుద్ధచైతన్యము సిద్ధిస్తుంది. ఈ కారము మన్మధ బీజము. ఇది స్థితికారకుడైన విష్ణు సంకేతము. ఈ జగత్తు అంతా ఉపాదాన నిమిత్త కారణమైన పరబ్రహ్మయందే లయం చెందుతుందనే విషయాన్ని అనుస్వారము తెలియచేస్తుంది. కాబట్టి సృష్టి స్థితిలయాలకు కారణమైన చైతన్య శబ్దమే హ్రీంకారము హ్రీం అనే అక్షరము శక్తి ప్రణవము. పరబ్రహ్మకు ప్రతిరూపమైన పరమేశ్వరికి ప్రతీక.

ఆ పరమేశ్వరి హ్రీంకారమందే ఉంటుంది అని లలితా త్రిశతిలో అనేక సార్లు చెప్పబడింది. హ్రీంకారము అనేది అగ్నికుండమైతే ఆ పరమేశ్వరి దానిలోని అగ్ని శిఖ (అగ్ని జ్వాల) హ్రీంకారము చంద్రుడైతే, దానియొక్క వెన్నెల ఆ దేవి. హ్రీంకారము సూర్యుడైతే అతని యొక్క కాంతి ఆమె

హ్రీం కారము మేఘమైతే ఆమె మెరుపు తీగ. హ్రీంకారము క్రీడా సరస్సు అయితే, అందులో తిరుగాడే హంస ఆ పరమేశ్వరి. హ్రీం కారమనే ఉద్యానవనంలో సాధకులకు ఫలితాన్ని అందించే ఆ పరమేశ్వరి నెమలి. హ్రీంకారమనే పంజరంలో ఆమె చిలుక. ఈ విషయాలను చూసినట్లైతే హ్రీంకార జపం చేసినట్లైతే ఆ దేవి యొక్క కరుణ లభిస్తుంది. హ్రీంకారమనే ముంగిలి (విశ్రాంతి స్థానము)లో ఆమె దీపమువంటిది. సాధకుడికి జ్ఞాన జ్యోతిని ప్రసాదించేది పరమేశ్వరి. హ్రీంకారాన్ని ఊరిచివర పర్వతం మీద ఉన్న గుహతో పోల్చారు. ఆగుహ పర్వతాగ్రాన ఉంటుంది. అక్కడికి చేరటానికి అందరికీ సాధ్యం కాదు. అలాగే హ్రీంకార జపం అందరూ చెయ్యలేరు. పూర్వజన్మ సుకృతం ఉన్నవారు మాత్రమే చెయ్యగలరు. ఆ గుహలో ఉండే సింహమే పరమేశ్వరి. అంటే హ్రీంకార జపం చేసే సాధకులను కరుణించేది పరమేశ్వరి. హ్రీంకారమనే పాలసముద్రంలో ఆ దేవి సుధ వంటిది. సముద్ర మధనం గనక చేసినట్లైతే దాని ఫలితంగా అమృతం పుడుతుంది. అలాగే హ్రీంకార మంత్ర జపం చేస్తే వచ్చే ఫలితం దేవీ కటాక్షం. ఇది అమృతంకన్నా ఎక్కువైనది. హ్రీంకారమనేది రహస్యమైన ఒక పెట్టె. దాన్ని గనక తెరవగలిగితే అందులో ఉండే మణి ఆ పరమేశ్వరి. అంటే హ్రీంకార బీజసాధన గనక చేసినట్లైతే ఫలితం పరమేశ్వరి సాక్షాత్కారం. హ్రీంకారమనే వేదానికి ఆమె ఉపనిషత్తు. వేదాల యొక్క సారమే ఉపనిషత్తులు. అలాగే హ్రీంకార మంత్రసారమే పరమేశ్వరి సాక్షాత్కారము.

ఈ రకంగా పంచదశీ మహామంత్రంలో హ్రీంకారానికి అత్యంత ప్రాముఖ్యత ఉన్నది. ఆ ఒక్క బీజాక్షరాన్ని జపించినంత మాత్రం చేతనే పరమేశ్వరి సాక్షాత్కరిస్తుంది. సాధకుడి కోరికలు తీరుస్తుంది. ముక్తిని కూడా ప్రసాదిస్తుంది.



# 9. త్రిశతి - పంచదశి

శ్రీవిద్య నుపాసించి తరించిన వారిలో అగస్త్య మహర్షి ఒకడు. ఇతని భార్య లోపాముద్ర. ఇతను గురువైన హయగ్రీవుని దగ్గర శ్రీవిద్యను గురించి చాలా విషయాలు తెలుసుకున్నాడు. లలితా సహస్రనామాలను కూడా విన్నాడు. అయినా అగస్త్యునికి తృప్తి కలగలేదు. ఇంకా ఏదో తెలుసుకోవలసినది ఉన్నది అనిపిస్తోంది. అదే విషయం హయగ్రీవుడికి చెప్పి, తనకు మిగిలిన విషయాలు కూడా తెలియచేయమని అతని పాదాలు పట్టుకున్నాడు. ఈ రకంగా మూడు సంవత్సరాలు గడిచింది.

ఒక రోజు పరమేశ్వరి హయగ్రీవునికి కలలో కనిపించి "లోకంలో రాజ్యమూ, ధనమూ దేనినైనా దానం చెయ్యవచ్చును. గాని షోడశీ మహామంత్రం మాత్రం చెప్పకూడదు. ఇది అత్యంత రహస్యమైనది. అనితర సాధ్యమైనది. నా అనుజ్ఞతో వాగ్దేవతలు లలితా సహస్రనామాలు చెప్పారు. నేను, పరమేశ్వరుడు కలిసి త్రిశతి అనబడే స్తుతిని చెప్పాము. ఇందులో మూడు వందల నామాలుంటాయి. ఇది అత్యంత శక్తివంతమైనది. అగస్త్యుడు మహాభక్తుడు. కాబట్టి ఆయనకు ఈ త్రిశతిని ఉపదేశించవలసినది" అని చెప్పింది. తరువాత స్వప్నవృత్తాంతమంతా హయగ్రీవుడు అగస్త్యునికి చెప్పి త్రిశతీనామాలని అతడికి ఉపదేశం చేశాడు.

పంచదశీ మహామంత్రంలో పదిహేను బీజాక్షరాలున్నాయని ముందే చెప్పటం జరిగింది. వాటిలోని ఒక్కొక్క బీజాక్షరానికి ఇరవై నామాలు చొప్పున మూడు వందల నామాల స్తవమే లలితా త్రిశతి.

మంత్ర శాస్త్రంలో చెప్పబడిన విద్యలన్నిటిలోనూ శ్రీవిద్య ఉత్తమమైనది. అందులోనూ పంచదశీ మహామంత్రము శ్రీవిద్యకు గాయత్రి వంటిది. అంటే శ్రీవిద్యలో విశేషమైనటువంటి మంత్రం పంచదశి. ఇది కామ్యమంత్రమూ, మోక్ష మంత్రమూ కూడా. సాధకుల కోర్కెలన్నీ తీర్చటానికి సాక్షాత్తూ పరమేశ్వరీ, పరమేశ్వరులే మంత్రంలోని పదిహేను బీజాలు చెప్పారు. అంతేకాదు ఆ మంత్రాక్షరాలకు వివరణ కూడా ఇచ్చారు. ఆ వివరణే లలితా త్రిశతి. లలితా సహస్రనామాలలో శ్రీవిద్య పూర్తిగా వివరించబడింది. కాని త్రిశతిలో పరదేవతను గూర్చి వివరణ ఇవ్వటం జరిగింది. మహామంత్రంలోని ఒక్కొక్క అక్షరానికీ ఉన్న ప్రాముఖ్యతను వివరిస్తూ, ఆ మంత్రాన్ని గనక జపించినట్లైతే సాధకుల కోరికలు ఏ రకంగా తీరతాయో చెప్పటం జరిగింది. పరమేశ్వరి ఎక్కడ ఉంటుంది ? ఏ రకంగా ఉంటుంది ? ఏ స్థితిలో ఉంటుంది ? అనేది వివరిస్తూ భక్తుల యొక్క కోరికలు ఏ రకంగా తీరుస్తుందో వివరించబడింది. అందుకనే సహస్రనామాల కన్నా కూడా త్రిశతి అతి రహస్యమైనది. అతి పవిత్రమైనది. విశేషమైనది. త్రిశతిని గనక ఒకసారి పారాయణ చేసినట్లైతే, సహస్రనామాలు కోటిసార్లు పారాయణ చేసిన ఫలితం వస్తుంది. సహస్రనామాలలో శ్రీవిద్య వివరించబడింది. కాని త్రిశతిలో పంచదశీ మహామంత్రము

వరింపబడింది. అందుచేతనే త్రిశతి అత్యంత రహస్యమైనది. విశేషమైనది. ఇన్ని మాటలెందుకు? ్రవిద్యలో లలితాత్రిశతిని మించిన పారాయణ ఇంకొకటి లేదు.

పంచదశీ మహామంత్రంలోని రెండు హకారములు, మూడు కకారములు శివాక్షరములు. టిని పరమేశ్వరి చెప్పింది. మూడు లకారములు, రెండు సకారములు, ఏ, ఈ కారములు క్త్యక్షరములు. వీటిని పరమేశ్వరుడు చెప్పాడు. కాగా మూడు హ్రీంకారములను ఇద్దరూ కలిసి ప్పారు. ఈ విషయం తెలియకుండా ఎన్ని కోట్ల సంవత్సరాలు జపం చేసినా మంత్రం సిద్ధించదు. ్రచక్రంలో నాలుగు శివచక్రాలు, ఐదు శక్తి చక్రాలు ఉన్నాయి. శక్తి చక్రాలన్నీ కోణాకారంలో ంటాయి. అవి త్రికోణము, అష్టకోణము, దశార యుగ్మము, చతుర్దశారము. అలాగే బిందువు, ష్టదళము, షోడశ దళము, భూపురము అనేవి శివ చక్రాలు. ఇవి అన్నీ ఒకదానితో ఒకటి అవినాభా ంబంధం కలిగి ఉన్నాయి.

| | | |
|---|---|---|
| త్రికోణంలో | - | బిందువు |
| అష్ట కోణంలో | - | అష్ట దళము |
| దశారయుగ్మములో | - | షోడశదళము |
| చతుర్దశారములో | - | భూపురము |

అంతర్భూతమవుతున్నాయి. ఈ రకంగా శివ, శక్తి చక్రాలు అవినాభావ సంబంధం కలిగి న్నాయి. త్రికోణ రూపిణి శక్తి. బిందురూపుడు శివుడు.

ఈ విషయం తెలుసుకున్నవాడే చక్రవిదుడు. ఈ సంబంధం తెలియకుండా శ్రీచక్రాన్ని ాజిస్తే ఫలితం ఉండదు. విశేష జ్ఞానము గలవారే ఈ విద్యను ఉపాసించాలి. అటువంటి మహాత్ముల గ్గరనుంచే ఈ విద్యను పొందాలి. అజ్ఞానులకు దీనిని ఉపదేశించరాదు. అంతఃకరణ నిర్మలంగా న్నవారు, లేనివారు, యజ్ఞాదికర్మలు చేసేవారు, శూద్రులు, మొదలైనవారు శ్రీవిద్యను గనక లుసుకున్నట్లైతే, స్వర్గ సుఖాలు కోరరు. ఎవరికి పంచదశీ విద్య లభిస్తుందో వారికి మరుజన్మ దు. శ్రీవిద్య మోక్ష హేతువు. అందుకనే శ్రీవిద్యావేత్త విద్వాంసుడు అంటారు.

లలితా త్రిశతి పారాయణ చేసినట్లైతే విశేష ఫలితం వస్తుంది. లలితా సహస్రనామాలు యి చదివితే వచ్చే ఫలితం, త్రిశతిలోని ఒక్కనామం చదివితేనే వస్తుంది. త్రిశతిని ప్రతిరోజూ ారాయణ చేసేవారికి ఆత్మ సంతృప్తి కలుగుతుంది. పై కోరికలు సాధించదలచుకున్నప్పటికీ ఈ స్తోత్రపారాయణ చేసినట్లైతే అవి సిద్ధిస్తాయి. తంత్రశాస్త్రాలలో చెప్పబడిన ఫలితాలన్నీ కూడా శతి పారాయణ వల్ల కలుగుతాయి. ఇది ఆయుష్కరము, పుష్టికరము, వశీకరణము, కీర్తికారకము, ంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యకరము, ఒకటేమిటి ? సర్వాభీష్ట ఫలప్రదము. దీన్ని జపించేవారికి తరమైన కోరికలుండవు. త్రిశతి పారాయణ వలన పరమేశ్వరి సంతుష్టురాలవుతుంది. భక్తుల భీష్టాన్ని నెరవేరుస్తుంది.

# శ్రీ లలితాంబా త్రిశతీస్తోత్ర రత్నమ్

(శ్రీ బ్రహ్మాండ పురాణే)

స కుంకుమ విలేపనా మళిక చుంబి కస్తూరికాం ।
స మంద హసితేక్షణాం స శరచాప పాశాంకుశాం ।
అశేష జనమోహినీ మరుణ మాల్య భూషాంబరాం ।
జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥

అగస్త్య ఉవాచ :

హయగ్రీవ దయాసింధో భగవన్ భక్తవత్సల ।
త్వత్త శ్శ్రుత మశేషేణ శ్రోతవ్యం యద్య దస్తి తత్ ॥ 1
రహస్యం నామసాహస్ర మపి తత్సంశ్రుతం మయా ।
ఇత: పరం చ మే నాస్తి శ్రోతవ్య మితి నిశ్చయ: ॥ 2
తథాపి మమ చిత్తస్య పర్యాప్తి ర్నైవ జాయతే ।
కార్త్స్న్యార్థ: ప్రాప్య ఇత్యేవ శోచయిష్యా మ్యహం ప్రభో ॥ 3
కిమిదం కారణం బ్రూహి జ్ఞాతవ్యాంశోఽపి వా పున: ।
అస్తి చేన్మమ తం బ్రూహి బ్రూహిత్యుక్త్వా ప్రణమ్య తమ్ ॥ 4

సూత ఉవాచ :

సమాలలంబే తత్పాద యుగళం కలశోద్భవ: ।
హయాననో భీతభీత: కిమిదం కిమిదం త్వితి ॥ 5
ముంచ ముంచేతి తం చోక్త్వా చింతాక్రాంతో బభూవ స: ।
చిరం విచార్య నిశ్చిన్వ న్వక్తవ్యం నవయేత్యసౌ ॥ 6
తూష్ణీం స్థిత: స్మరన్నాజ్ఞాం లలితాంబా కృతాం పురా ।
తంప్రణమ్యైవ స ముని స్తత్పాదా వత్యజన్ స్థిత: ॥ 7
వర్షత్రయావధి తథా గురుశిష్యౌ తథా స్థితౌ ।
తచ్ఛృణ్వంతశ్చ పశ్యంత స్సర్వలోకా స్సువిస్మితా: ॥ 8
తత్ర శ్రీలలితాదేవీ కామేశ్వర సమన్వితా ।
ప్రాదుర్భూతా రహస్యేవం హయగ్రీవ మవోచత ॥ 9

శ్రీదేవ్యువాచ :

అశ్వాననావయోః ప్రీతి శ్శాస్త్ర విశ్వాసినే త్వయా ।
రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ ॥ 10
స్వమాతృజారవ ద్గోప్యా విద్యై షే(వే)త్యాగమా జగుః ।
తతోఽతి గోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతి : ॥ 11
మయా కామేశ్వరేణాపి కృతా సా గోపితా భృశమ్ ।
మదాజ్ఞయా వచో దేవ్యశ్చక్రు ర్నామసహస్రకమ్ ॥ 12
ఆవాభ్యాం కథితం ముఖ్యం సర్వపూర్తికరం స్తవమ్ ।
సర్వక్రియాణాం వైకల్య పూర్తి ర్యజ్జపతో భవేత్ ॥ 13
సర్వపూర్తికరం తస్మా దిదంనామకృతం మయా ।
తద్బ్రూహి త్వ మగస్త్యాయ పాత్రభూతో న సంశయః ॥ 14
పత్న్యస్య లోపాముద్రాఖ్యా మా ముపాస్తేఽతిభక్తితః ।
అయం చ నితరాం భక్త స్తస్మాదస్య వదస్వ తత్ ॥ 15
అముంచమాన స్త్వత్పాదౌ వర్షత్రయ మసౌ స్థితః ।
ఏతత్ జ్ఞాతు మతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్ ॥ 16
చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి ।
సర్వపూర్తికరం తస్మా దనుజ్ఞాతో మయా వద ॥ 17

సూత ఉవాచ :

ఇత్యుక్త్వాంతర్దధా వంబా కామేశ్వర సమన్వితా ।
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవమ్ ॥ 18

హయగ్రీవ ఉవాచ :

సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః ।
కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ ॥ 19
త్వత్సమో లలితాభక్తో నాస్తి నాస్తి జగత్త్రయే ।
యేనాగస్త్య స్వయం దేవీ తవ వక్తవ్య మన్వశాత్ ॥ 20
సచ్ఛిష్యేణ త్వ యాహం చ దృష్టవానస్మితాం శివాం ।
యతన్తే యద్దర్శనాయ బ్రహ్మ విష్ణ్వీశ పూర్వకాః ॥ 21

అత: పరం తే వక్ష్యామి సర్వపూర్తికరం స్తవం ।
యస్య స్మరణ మాత్రేణ పర్యాప్తి స్తే భవే ద్ధ్రుది ॥ 22
రహస్య నామసాహస్రా దతిగుహ్యాతమం మునే ।
అవశ్యకం తతో హ్యేతల్లలితాం సముపాసతామ్ ॥ 23
తదహం తే ప్రవక్ష్యామి లలితాంబానుశాసనాత్ ।
శ్రీమత్పంచదశాక్షర్యాః కాదివర్ణ క్రమాన్మునే ॥ 24
పృథ గ్వింశతి నామాని కథితాని ఘటోద్భవ ।
ఆహత్య నామ్నాం త్రిశతీ సర్వ సంపూర్తికారిణీ ॥ 25
రహస్యాతిరహస్యైషా గోపనీయా ప్రయత్నతః ।
తాం శృణుష్వ మహాభాగ సావధానేన చేతసా ॥ 26
కేవలం నామబుద్ధి స్తే న కార్యా తేషు కుంభజ ।
మంత్రాత్మకత్వ మేతేషాం నామ్నాం నామాత్మతాపి చ ॥ 27
తస్మా దేకాగ్రమనసా శ్రోతవ్యం భవతా మునే ।

సూత ఉవాచ :

ఇత్యుక్త్వాతు హయగ్రీవః ప్రోచే నామ శత త్రయమ్ ॥ 28

అస్య శ్రీలలితా త్రిశతీస్తోత్ర మహామంత్రస్య భగవాన్ హయ గ్రీవ - ఋషిః; అనుష్టుప్ - ఛందః; శ్రీలలితా మహేశ్వరీ దేవతా; ఐం - బీజం; సౌః - శక్తిః; క్లీం - కీలకం; మమ చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః ॥ ఐమిత్యాదిభి రంగన్యాస కరన్యాసాః కుర్యాః ।

ధ్యానమ్ :

అతిమధుర చాపహస్తా మపరిమితామోద బాణ సౌభాగ్యాం ।
అరుణా మతిశయ కరుణా మభినవ కుళ సుందరీం వందే ।

హయగ్రీవ ఉవాచ :

కకారరూపా కల్యాణీ కల్యాణగుణ శాలినీ ।
కల్యాణశైలనిలయా కమనీయా కళావతీ ॥ 1
కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృత సాగరః ।
కదంబ కాననావాసా కదంబ కుసుమ ప్రియా ॥ 2

కందర్పవిద్యా కందర్ప జనకాపాంగ వీక్షణా ।
కర్పూరవీటి సౌరభ్య కల్లోలిత కకుప్తటా ॥ 3

కలిదోషహరా కంజ లోచనా కమ్రవిగ్రహా ।
కర్మాది సాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥ 4

ఏకారరూపా చైకాక్ష ర్యేకానేకాక్షరాకృతిః ।
ఏత త్త దిత్యనిర్దేశ్యా చైకానంద చిదాకృతిః ॥ 5

ఏవ మిత్యాగమా బోధ్యా చైకభక్తిమదర్చితా ।
ఏకాగ్రచిత్త నిర్ధ్యాతా చైషణా రహితాదృతా ॥ 6

ఏలాసుగంధి చికురా చైనః కూట వినాశినీ ।
ఏకభోగా చైకరసా చైకైశ్వర్య ప్రదాయినీ ॥ 7

ఏకాతపత్ర సామ్రాజ్యప్రదా చైకాంత పూజితా ।
ఏధమానప్రభా చైజ దనేజ జ్జగదీశ్వరీ ॥ 8

ఏకవీరాది సం సేవ్యా చైకప్రాభవ శాలినీ।
ఈకారరూపిణీశిత్రీ ఈప్సితార్థ ప్రదాయినీ ॥ 9

ఈదృగిత్య వినిర్దేశ్యా ఈశ్వరత్వ విధాయినీ ।
ఈశానాది బ్రహ్మమయీ ఈశిత్వా ద్యష్టసిద్ధిదా ॥ 10

ఈక్షిత్రీ క్షణసృష్టాండ కోటిరీశ్వర వల్లభా ।
ఈడితా చేశ్వరార్ధాంగ శరీరేశాధిదేవతా ॥ 11

ఈశ్వర ప్రేరణకరీ చేశతాండవ సాక్షిణీ ।
ఈశ్వరోత్సంగ నిలయా చేతబాధా వినాశినీ ॥ 12

ఈహా విరహితా చేశశక్తి రీషత్స్మితాననా ।
లకారరూపా లలితా లక్ష్మీ వాణీ నిషేవితా ॥ 13

లాకినీ లలనారూపా లస ద్దాడిమ పాటలా ।
లలంతికా లసత్ఫాలా లలాట నయనార్చితా ॥ 14

లక్షణోజ్జ్వల దివ్యాంగీ లక్ష్యకోట్యండ నాయికా ।
లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః ॥ 15

లలామరాజదళికా లంబముక్తా లతాంచితా ।
లంబోదర ప్రసూర్లభ్యా లజ్జాఢ్యా లయవర్జితా ॥ 16

హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపద ప్రియా ।
హ్రీంకారబీజా హ్రీంకార మంత్రా హ్రీంకార లక్షణా ॥ 17
హ్రీంకారజప సుప్రీతా హ్రీం మతిః హ్రీం విభూషణా ।
హ్రీంశీలా హ్రీంపదారాధ్యా హ్రీంగర్భా హ్రీంపదాభిదా ॥ 18
హ్రీంకారవాచ్యా హ్రీంకార పూజ్యా హ్రీంకార పీఠికా ।
హ్రీంకారవేద్యా హ్రీంకార చింత్యా హ్రీంహ్రీం శరీరిణీ ॥ 19
హకారరూపా హలధృత్పూజితా హరిణేక్షణా ।
హరప్రియా హరారాధ్యా హరి బ్రహ్మేంద్ర సేవితా ॥ 20
హయారూఢా సేవితాంఘ్రిర్హయమేధ సమర్చితా ।
హర్యక్షవాహనా హంసవాహనా హతదానవా ॥ 21
హత్యాది పాపశమనీ హరిదశ్వాది సేవితా ।
హస్తి కుంభోత్తుంగ కుచా హస్తికృత్తి ప్రియాంగనా ॥ 22
హరిద్రా కుంకుమా దిగ్ధా హర్యశ్వా ద్యమరార్చితా ।
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా ॥ 23
సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగళా ।
సర్వకర్త్రీ సర్వభర్త్రీ (ధాత్రీ) సర్వహంత్రీ సనాతనీ ॥ 24
సర్వానవద్యా సర్వాంగ సుందరీ సర్వసాక్షిణీ ।
సర్వాత్మికా సర్వసౌఖ్య దాత్రీ సర్వవిమోహినీ ॥ 25
సర్వాధార సర్వగతా సర్వావగుణ వర్జితా ।
సర్వారుణా సర్వమాతా సర్వాభరణ భూషితా ॥ 26
కకారార్థః కాలహంత్రీ కామేశీ కామితార్థదా ।
కామ సంజీవినీ కల్యా కఠినస్తన మండలా ॥ 27
కరభోరూః కళానాథ ముఖీ కచ జితాంబుదా ।
కటాక్షస్యంది కరుణా కపాలి ప్రాణనాయికా ॥ 28
కారుణ్య విగ్రహా కాంతా కాంతిధూత జపావళిః ।
కలాలాపా కంబుకంఠీ కర నిర్జిత పల్లవా ॥ 29
కల్పవల్లీ సమభుజా కస్తూరీ తిలకోజ్జ్వలా ।
హకారార్థా హంసగతి ర్హాటకాభరణోజ్జ్వలా ॥ 30

హారహారి కుచాభోగ హాకినీ హల్యవర్జితా ।
హరిత్పతి సమారాధ్యా హఠాత్కార హతాసురా ॥ 31

హర్షప్రదా హవిర్భోక్త్రీ హార్దసం తమసాపహా ।
హల్లీ హాలాస్య సంతుష్టా హంసమంత్రార్థ రూపిణీ ॥ 32

హానోపాదాన నిర్ముక్తా హర్షిణీ హరిసోదరీ ।
హాహా హూహూ ముఖస్తుత్యా హానివృద్ధి వివర్జితా ॥ 33

హయ్యంగవీన హృదయా హరి కోపారుణాంశుకా ।
లకారార్థా లతాపూజ్యా లయస్థి త్యుద్భవేశ్వరీ ॥ 34

లాస్యదర్శన సంతుష్టా లాభాలాభ వివర్జితా ।
లంఘ్యేతరాజ్ఞా లావణ్య శాలినీ లఘు సిద్ధిదా ॥ 35

లాక్షారస సవర్ణాభా లక్ష్మణాగ్రజ పూజితా ।
లభ్యేతరా లబ్ధశక్తి సులభాలాంగలాయుధా ॥ 36

లగ్నచామరహస్త శ్రీశారదా పరివీజితా ।
లజ్జాపద సమారాధ్యా లంపటా లకుళేశ్వరీ ॥ 37

లబ్ధమానా లబ్ధరసా లబ్ధ సంపత్సమున్నతిః ।
హ్రీంకారిణీ హ్రీంకారాది హ్రీంమధ్యా హ్రీంశిఖామణిః 38

హ్రీంకార కుండాగ్నిశిఖా హ్రీంకార శశిచంద్రికా ।
హ్రీంకార భాస్కరరుచి హ్రీంకారాంబోధ చంచలా ॥ 39

హ్రీంకార కందాంకురితా హ్రీంకారైక పరాయణా ।
హ్రీంకార దీర్ఘికా హంసీ హ్రీంకారోద్యాన కేకినీ ॥ 40

హ్రీంకారారణ్య హరిణీ హ్రీంకారావాల వల్లరీ ।
హ్రీంకార పంజర శుకీ హ్రీంకారాంగణ దీపికా ॥ 41

హ్రీంకార కందరా సింహీ హ్రీంకారాంబుజ భృంగికా ।
హ్రీంకార సుమనో మాధ్వీ హ్రీంకార తరు మంజరీ ॥ 42

సకారాఖ్యా సమరసా సకలోత్తమ సంస్తుతా ।
సర్వ వేదాంత తాత్పర్యభూమి స్సదసదాశ్రయా ॥ 43

సకలా సచ్చిదానందా సాధ్వీ సద్గతి దాయినీ ।
సనకాది మునిధ్యేయా సదాశివ కుటుంబినీ ॥ 44

సకలాధిష్ఠానరూపా సత్త్వరూపా సమాకృతిః ।
సర్వప్రపంచ నిర్మాత్రీ సమానాధిక వర్జితా ॥ 45

సర్వోత్తుంగా సంగహీనా సద్గుణా సకలేష్టదా ।
కకారిణీ కావ్యలోలా కామేశ్వర మనోహరా ॥ 46

కామేశ్వర ప్రాణనాడీ కామేశోత్సంగ వాసినీ ।
కామేశ్వరాలింగితాంగీ కామేశ్వర సుఖప్రదా ॥ 47

కామేశ్వర ప్రణయినీ కామేశ్వర విలాసినీ ।
కామేశ్వర తపస్సిద్ధిః కామేశ్వర మనః ప్రియా ॥ 48

కామేశ్వర ప్రాణనాథా కామేశ్వర విమోహినీ ।
కామేశ్వర బ్రహ్మవిద్యా కామేశ్వర గృహేశ్వరీ ॥ 49

కామేశ్వరా హ్లాదకరీ కామేశ్వర మహేశ్వరీ ।
కామేశ్వరీ కామకోటి నిలయా కాంక్షితార్థదా ॥ 50

లకారిణీ లబ్ధరూపా లబ్ధధీ ర్లబ్ధ వాంఛితా ।
లబ్ధపాప మనోదూరా లబ్ధాహంకార దుర్గమా ॥ 51

లబ్ధశక్తిర్లబ్ధదేహా లబ్ధైశ్వర్య సమున్నతిః ।
లబ్ధబుద్ధి ర్లబ్ధలీలా లబ్ధ యౌవనశాలినీ ॥ 52

లబ్ధాతిశయ సర్వాంగ సౌందర్యా లబ్ధవిభ్రమా ।
లబ్ధరాగా లబ్ధగతి ర్లబ్ధ నానాగమ స్థితిః ॥ 53

లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధహర్షాభిపూజితా ।
హ్రీంకారమూర్తి ర్హ్రీంకారసౌధ శృంగ కపోతికా 54

హ్రీంకార దుగ్ధాబ్ధిసుధా హ్రీంకార కమలేందిరా ।
హ్రీంకార మణిదీపార్చి ర్హ్రీంకార తరు శారికా ॥ 55

హ్రీంకార పేటిక మణిర్హ్రీంకారాదర్శ బింబికా ।
హ్రీంకార కోశాసిలతా హ్రీంకారాస్థాన నర్తకీ ॥ 56

హ్రీంకార శుక్తికా ముక్తా మణిర్హ్రీంకార బోధితా ।
హ్రీంకారమయ సౌవర్ణ స్తంభ విద్రుమ పుత్రికా ॥ 57

హ్రీంకార వేదోపనిష ద్ధ్రీంకారాధ్వర దక్షిణా ।
హ్రీంకార నందనారామ నవ కల్పక వల్లరీ ॥ 58

హ్రీంకార హిమవద్గంగా హ్రీంకారార్ణవకౌస్తుభా ।
హ్రీంకారమంత్ర సర్వస్వ హ్రీంకారపర సౌఖ్యదా ॥ 59

శ్రీ హయగ్రీవ ఉవాచ :

ఇతీదం తే మయాఽఖ్యాతం దివ్యనామ్నాం శతత్రయం ।
రహస్యాతి రహస్యత్వా ద్గోపనీయం మహామునే ॥ 60

శివవర్ణాని నామాని శ్రీదేవీ కథితాని వై ।
శక్త్యక్షరాణి నామాని కామేశ కథితాని హి ॥ 61

ఉభయాక్షర నామాని హ్యుభాభ్యాం కథితాని వై ।
తదన్యైర్గ్రథితం స్తోత్ర మేతస్య సదృశం కిము ॥ 62

నానేన సదృశం స్తోత్రం శ్రీదేవీ ప్రీతిదాయకం ।
లోకత్రయేఽపి కల్యాణం సంభవే న్నాత్ర సంశయః ॥ 63

సూత ఉవాచ :

ఇతి హయముఖగతం స్తోత్రరాజం నిశమ్య ।
ప్రగళిత కలుష్యా(షో)ఽభూచిత్తపర్యాప్తి మేత్య ।
నిజగురు మథనత్వాత్ కుంభజన్మా తదుక్తైః ।
పున రధిక రహస్యం జ్ఞాతు మేవం జగాద ॥ 64

అగస్త్య ఉవాచ :

అశ్వానన మహాభాగ రహస్య మపి మే వద ।
శివవర్ణాని కాన్యత్ర శక్తివర్ణాని కానిహి ॥ 65

ఉభయో రపి వర్ణాని కాని మే వద దేశిక ।
ఇతి పృష్టః కుంభ జేన హయగ్రీవోఽవదత్పునః ॥ 66

శ్రీహయగ్రీవ ఉవాచ :

తవ గోప్యం కి మస్తీహ సాక్షా దంబా కటాక్షతః ।
ఇదం త్వతిరహస్యం తే వక్ష్యామి శృణు కుంభజ ॥ 67

ఏత ద్విజ్ఞాన మాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్ ।
కత్రయం హద్వయం చైవ శైవోభాగః ప్రకీర్తితః ॥ 68

శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీవిద్యా జపశాలినః ॥ 69

న తేషాం సిద్ధిదా విద్యా కల్ప కోటిశతై రపి ।
చతుర్భి శ్శివచక్రై శ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ॥ 70
నవచక్రై స్తు సంసిద్ధం శ్రీచక్రం శివయో ర్వపుః ।
త్రికోణ మష్టకోణం చ దశకోణ ద్వయం తథా ॥ 71
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ వై ।
బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశ పత్రకమ్ ॥ 72
చతురస్రం చ చత్వారి శివచక్రా ణ్యనుక్రమాత్ ।
త్రికోణే బైందవం శ్లిష్ట మష్టారేఽష్ట దళాంబుజమ్ ॥ 73
దశారయో ష్షోడశారం భూపురం భువనాశ్రకే ।
శైవానా మపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్ ॥ 74
అవినాభావ సంబంధం యో జానాతి స చక్రవిత్ ।
త్రికోణరూపిణీ శక్తి ర్బిందురూప శివ స్స్మృతః ॥ 75
అవినాభావ సంబంధ స్తస్మా ద్బిందుత్రికోణయోః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీచక్రం య స్సమర్చయేత్ ॥ 76
న తత్ఫల మవాప్నోతి లలితాంబా న తుష్యతి ।
యే చ జానంతి లోకేఽస్మిన్ శ్రీవిద్యాం చక్రవేదినః ॥ 77
సామాన్య వేదిన స్తే వై విశేషజ్ఞోఽతిదుర్లభః ।
స్వయం విద్యా విశేషజ్ఞో విశేషజ్ఞం సమర్చయేత్ ॥ 78
తస్మై దేయం తతో గ్రాహ్యం శ్రీవిద్యా చక్ర వేదినా ।
అంధం తమః ప్రవిశంతి యే హ్యావిద్యా ముపాసతే ॥ 79
ఇతి శ్రుతి రపాహైతా నవిద్యోపాసకాన్ పునః ।
విద్యాఽనుపాసకా నేవ నిందత్యారుణికీ శ్రుతిః ॥ 80
అశ్రుతా స్సశ్రుతాస శ్చ యజ్వానో యే ప్యయజ్వనః ।
స్వర్యంతో నాపేక్షంత ఇంద్ర మగ్నిం చ యే విదుః ॥ 81
సికతా ఇవ సంయంతి రశ్మిభి స్సముదీరితాః ।
అస్మాల్లోకా దముష్మా చ్చే త్యపాహారుణికీ శ్రుతిః ॥ 82

యః ప్రాప్తః పృశ్నిభావం వా యది వా శంకర స్స్వయం ।
తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥ 83

ఇతి తంత్రేషు బహుధా విద్యాయా మహిమోచ్యతే ।
మోక్షైకహేతు విద్యా తు శ్రీ విద్యైవ న సంశయః ॥ 84

న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వ చ్ఛబ్దః ప్రయుజ్యతే ।
మోక్షైకవిద్యా సా శ్రీవిద్యైవ న సంశయః ॥ 85

తస్మా ద్విద్యావిదే దద్యాత్ ఖ్యాపయే స్తద్గుణా స్సుధీః ।
స్వయం విద్యావిశేషజ్ఞో విద్యామాహాత్మ్య వేద్యపి ॥ 86

విద్యావిదం నార్చయే చ్చే త్కో వా తం పూజయే జ్జనః ।
ప్రసంగా దేత దుక్తం తే ప్రకృతం శృణు కుంభజ ॥ 87

యః కీర్తయే త్సకృ ద్భక్త్యా దివ్యం నామ్నాం శతత్రయం ।
తస్య పుణ్యఫలం వక్ష్యే విస్తరేణ ఘటోద్భవ ॥ 88

రహస్య నామసాహస్ర పాఠే యత్ఫల మీరితం ।
త త్కోటి కోటిగుణిత మేకనామ జపాద్భవేత్ ॥ 89

కామేశ్వరాభ్యాం తదిదం కృతం నామ శతత్రయం ।
నాన్యేన తులయే దేత త్స్తోత్రేణాన్యకృతేన తు ॥ 90

శ్రియః పరంపరా యస్య భావినీ తూత్తరోత్తరం ।
తేనైవ లభ్యతే నామ్నాం త్రిశతీ సర్వకామదా ॥ 91

అస్యా నామ్నాం త్రిశత్యా స్తు మహిమా కేన వర్ణ్యతే ।
యా స్వయం శివయో ర్వక్త్ర పద్మాభ్యాం పరినిస్సృతా ॥ 92

నిత్యా షోడశికా రూపా న్విప్రా నాదౌతు భోజయేత్ ।
అభ్యక్తాన్ గంధ తైలేన స్నాతాఽనుష్ణేన వారిణా ॥ 93

అభ్యార్చ్య వస్త్ర గంధాద్యైః కామేశ్వర్యాది నామభిః ।
అపూపైశ్శర్కరాజ్యైశ్చ ఫలైః పుష్పై స్సుగంధిభిః ॥ 94

విద్యావిదో విశేషేణ భోజయే త్షోడశ ద్విజాన్ ।
ఏవం నిత్యబలిం కుర్యా దాదౌ బ్రాహ్మణ భోజనే ॥ 95

పశ్చాత్త్రిశత్యా నామ్నాంతు బ్రాహ్మణాన్ క్రమశోఽర్చయేత్ ।
తైలాభ్యంగాదికం దద్యా ద్విభవేసతి భక్తితః ॥ 96

శుక్ల ప్రతిపదారభ్య పౌర్ణమాస్యావధి క్రమాత్ ।
దివ సే దివసే విప్రా భోజ్యా వింశతి సంఖ్యయా ॥ 97

దశభిః పంచభి ర్వాపి త్రిభి రేకేన వా దినైః ।
త్రింశ త్షష్టిం శతం విప్రాన్ భోజయే త్రిశతం క్రమాత్ ॥ 98

ఏవం యః కురుతే భక్త్యా జన్మమధ్యే సకృన్నరః ।
తస్త్యైవం సఫలం జన్మముక్తి స్తస్య కరే స్థితా ॥ 99

రహస్య నామసాహస్రై రర్చనేఽప్యేవ మేవ హి ।
ఆదౌ నిత్యబలిం కుర్యా త్పశ్చా ద్బ్రాహ్మణ భోజనమ్ ॥ 100

రహస్య నామసాహస్త్ర మహిమా యో మయోదితః ।
స శీక రాణు రత్రైక నామ్నో మహిమ వారిధేః ॥ 101

వాగ్దేవీ రచితే నామ సాహస్రే యద్యదీరితం ।
త త్త త్ఫల మ వాప్నోతి నామ్నోఽప్యేకస్య కీర్తనాత్ ॥ 102

ఏత దన్యైర్జపై స్స్తోత్రై రర్చనై ర్యత్ఫలం భవేత్ ।
తత్ఫలం కోటి గుణితం భవేన్నామ శతత్రయాత్ ॥ 103

రహస్య నామసాహస్ర కోట్యావృత్త్యా స్తు యత్ఫలం ।
తద్భవే త్కోటి గుణితం నామత్రిశతి కీర్తనాత్ ॥ 104

వాగ్దేవీ రచితే స్తోత్రే తాదృశో మహిమా యది ।
సాక్షాత్కామేశ కామేశీ కృతేఽస్మిన్ గృహ్యతా మితి ॥ 105

సకృ త్సంకీర్తనాదేవ నామ్నా మస్మిన్ శతత్రయే ।
భవే చ్చిత్తస్య పర్యాప్తి ర్న్యూన మన్యానపేక్షిణీ ॥ 106

న జ్ఞాతవ్య మిత స్త్వన్య జ్జగత్సర్వం చ కుంభజ ।
యద్య త్సాధ్యతమం కార్యం తత్తదర్థ మిదం జపేత్ ॥ 107

తత్ర త్సిద్ధి మవాప్నోతి పశ్చా త్కార్యం పరీక్షయేత్ ।
యే యే ప్రసంగా స్తంత్రేషు తై స్తైర్య త్సాధ్యతే ధ్రువమ్ ॥ 108

తత్సర్వం సిద్ధ్యతి క్షిప్రం నామ త్రిశత కీర్తనాత్ ।
ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్ 109

విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వ ప్రదాయకం ।
సర్వ సంపత్ప్రదం సర్వ భోగదం సర్వ సౌఖ్యదమ్ ॥ 110

సర్వాభీష్ట ప్రదం చైవ దేవీ నామ శతత్రయం ।
ఏత జ్జపపరో భూయా న్నాన్య దిచ్ఛే త్కదాచన ॥ 111

ఏతత్కీర్తన సంతుష్టా శ్రీదేవీ లలితాంబికా ।
భక్తస్య యద్య దిష్టంస్యా త్త త్త త్పూరయతే ధ్రువమ్ ॥ 112

తస్మా త్కుంభోద్భవ మునే. కీర్తయ త్వ మిదం సదా ।
అపరం కించి దపి తే బోద్ధవ్యం నావశిష్యతే ॥ 113

ఇతి తే కథితం స్తోత్రం లలితా ప్రీతిదాయకం ।
నావిద్యావేదినో బ్రూయా న్నాభక్తాయ కదాచన ॥ 114

న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్ ।
యో బ్రూయా త్త్రిశతీం నామ్నాంతస్యానర్థో మహాన్ భవేత్ ॥ 115

ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాద్గోప్య మిదం త్వయా ।
లలితా ప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమమ్ ॥ 116

రహస్య నామసాహస్రా దతిగోప్య మిదం మునే ।
ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసోత్తమం ॥ 117

స్తోత్రేణానేన లలితాం స్తుత్వా త్రిపుర సుందరీమ్ ।
ఆనందలహరీ మగ్న మానస స్సమవర్తత ॥ 118

*ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే, ఉత్తరఖండే, హయగ్రీవాగస్త్య సంవాదే,*
*లలితోపాఖ్యానే, స్తోత్రఖండే, లలితాంబా త్రిశతీ స్తోత్రరత్నం సమాప్తమ్.*

# శ్రీలలితా త్రిశతి - వివరణ

*కకార రూపా కల్యాణీ కల్యాణ గుణశాలినీ ।*
*కల్యాణ శైలనిలయా కమనీయా కళావతీ ॥* 1

*కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృత సాగరా ।*
*కదంబ కాననావాసా కదంబ కుసుమప్రియా ॥* 2

*కందర్పవిద్యా కందర్పజనకాపాంగవీక్షణా*
*కర్పూర వీటి సౌరభ్యకల్లోలిత కుకుప్తటా ॥* 3

*కలిదోష హరా కంజలోచనా కమ్రవిగ్రహా*
*కర్మాదిసాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥* 4

**1. కకార రూపా :** లలితాత్రిశతిలోని నామాలు 'క' కారంతో మొదలవుతున్నాయి. ఇక్కడ కకార రూపాఅని చెప్పటం వల్ల శ్రీవిద్యకు ఆధారమైన పంచదశీ మహా మంత్రము కాది విద్యగా చెప్పబడుతోంది.

పంచదశీ మహామంత్రము పన్నెండు రకాలుగా ఉపాసించబడినది అని చెప్పబడుతోంది.

**మనుశ్చంద్రః కుబేరశ్చ లోపా ముద్రాచ మన్మథః ।**
**అగస్తి రగ్ని సూర్యాచ ఇంద్రో విష్ణుశ్శివస్త థా ॥**
**క్రోధభట్టారకోదేవ్యా ఏతే ముఖ్య ఉపాసకాః ।**
**ఏవంద్వాదశధా భిన్నా శ్రీమత్పంచదశాక్షరీ ॥**

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, విష్ణువు, శివుడు, దుర్వాసుడు అనే పన్నెండు మంది ఈ మంత్రాన్ని వివిధ రకాలుగా ఉపాశించారు. కాని

**తేషు ద్వా మనురాజాతు వరిష్ఠా వింధ్యమర్దన ।**
**లోపాముద్రా కామరాజానితి ఖ్యాతి ముపాగతా ॥**
**హాదిస్తు లోపాముద్రాస్యా త్కామరాజస్తు కాదికః ।**
**తయోస్తు కామరాజోఽయం సిద్ధిదో భక్తి శాలినాం ॥**

ఈ పన్నెండు మంత్రాలలోను హాది మతంలో లోపాముద్రము, కాది మతంలో కామరాజము అనగా మన్మధుని మంత్రము ప్రశస్తమైనవి. మళ్ళీ ఈ రెంటిలోనూ పరిశీలిస్తే కాది విద్యయే

శ్రేష్టము. కాది విద్య అంటే హల్లులు కకారముతో మొదలవుతాయి. దీనిపై మరిన్ని వివరాలకు ఉపోద్ఘాతము చూడండి.

పంచదశీ మహా మంత్రము అంటే శ్రేష్ఠమైన కాది విద్యయే అని చెప్పటానికి ఈ త్రిశతి నామాలను కకారముతో ప్రారంభించటం జరిగింది.

కకారానికి ఉదకము అంటే నీరు అని అర్థము. నీటికి ఆహారాన్ని ఉత్పత్తి చేసే శక్తి ఉన్నట్లుగానే, ఈ మంత్రము మానవుడికి సామ్రాజ్యాన్ని కలుగచేస్తుంది. అందుకే దేవి కకార రూప అని చెప్పబడుతోంది.

కకారానికి శిరస్సు అని కూడా అర్థం ఉన్నది. మానవ దేహంలో ముఖ్యమైనది శిరస్సు. కుండలినీ శక్తిని జాగృతంచేసి, సహస్రారానికి చేర్చి, అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందే యోగులు పరబ్రహ్మలో లీనమవుతారని చెప్పబడుతోంది. అంటే జీవాత్మని పరమాత్మలో లీనం చెయ్యటానికి ఉపయోగపడే సహస్రారము, సుషుమ్నానాడి, బ్రహ్మరంధ్రము మొదలయినవన్నీ శిరస్సునందే ఉన్నాయి. అలాగే పంచదశీ మహా మంత్రంలో కవర్ణము ముఖ్యమైనది. దానిని పునశ్చరణ చేసిన వారికి దేవి సాన్నిధ్యం లభిస్తుంది. కాబట్టి ఆమె కకారరూప. కవర్ణానికి సుఖము అని కూడా అర్థమున్నది. ఇక్కడ సుఖము అంటే శాశ్వతమైన సుఖము. మానవుడికి శాశ్వతమైన సుఖాన్నిచ్చేది ఆ పరదేవత యొక్క సాక్షాత్కారమే.

ఆ రకంగా దేవి సాక్షాత్కారాన్ని కలుగచేసేది కకారము. అందుకనే దేవి కకారరూప అని చెప్పబడుతోంది. ఓం కకార రూపాయైనమః

**2. కల్యాణీ :** కల్యాణము కలది కల్యాణి. కల్యాణము అంటే శుభమైనది, నాశనము లేనిది అని అర్థము. కల్యాణము అంటే సుఖము అని తైత్తీరీయాది ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఈ సుఖాలు రెండు రకాలు. 1. లౌకికము 2. పార లౌకికము. అంటే మానవుని యొక్క ఆనందం మొదలు బ్రహ్మానందం వరకు అన్నీ సుఖాలే. వీటిలో కొన్ని క్షణికమైనవి కాగా మరికొన్ని శాశ్వతమైనవి. ఈ ఆనందము చేతనే సకల ప్రాణులు సంచరిస్తున్నాయి. ఉపాధి గత స్వరూపముచేతనే సమిష్టి వ్యష్టి రూపాలు సంభవిస్తున్నాయి. మాయ యందు ప్రతిబింబించిన చైతన్యము జీవుడు. అతడు సమిష్టిరూపము (సముదాయము) కాగా, అంతఃకరణ మందు ప్రతిబింబించిన చైతన్యము జీవుడు అతడు వ్యష్టి రూపము. (ఒంటరివాడు) కల్యాణీ అంటే కేవలము ఆనంద స్వరూపము కలది. ఆనందైక విగ్రహవతి అని అర్థము. 'విజ్ఞానమానందం బ్రహ్మ' అనగా బ్రహ్మము విజ్ఞాన స్వరూపము, ఆనంద స్వరూపము అని చెప్పబడినది. ఓం కల్యాణ్యై నమః

**3. కల్యాణ గుణశాలినీ:** కల్యాణ గుణములచే శోభిల్లుచున్నది. కల్యాణ గుణములు కలిగినటువంటి దేవి.

కల్యాణ గుణములు అంటే :

1. సత్యకామ
2. సత్య సంకల్ప
3. సర్వాధి పత్య
4. సర్వేశ్వరత్వ
5. వామనేత్వ (పుణ్యకర్మఫలము కలిగించు గుణము)
6. సంయద్వామము (సర్వ శుభము పొందు గుణము).

దేవి ఈ రకమైన కల్యాణ గుణములు కలిగినటువంటిది. లేక ఈ గుణములచేత శోభిల్లుచున్నది. కల్యాణ గుణాలు ఆ దేవిని ఆశ్రయించుకుని ఉంటాయి. ఆమె శుద్ధ చైతన్య స్వరూపిణి.

గుణ సంకీర్తనచేత దేవతల కృప కలుగుతుంది. కాని గుణాలు అనేవి ఆరోపించబడినవి. దేవి పరబ్రహ్మ స్వరూపిణి. భక్తుడు, లేదా సాధకుడు పరబ్రహ్మకు తనకు భేదము లేదని ధ్యానము చేయటమే ముఖ్యము. ఈధ్యాన మార్గము గురువు ద్వారానే పొందాల్సి ఉన్నది.

ఓం కల్యాణ గుణశాలిన్యై నమః

**4. కల్యాణ శైల నిలయా :** కల్యాణ శైలము నిలయముగా గలది. కల్యాణ మనగా సుఖము. ఆ సుఖమే శైలముగా కలది. అంటే ఆనంద ఘనము అని అర్థము. అంటే అనిర్వచనీయమైన ఆనందము. అటువంటి ఆనంద ఘనమున ప్రతిష్ఠితమైనది ఆ దేవి కల్యాణమే శైలము వలె ఘనీభూతమైనది కళ్యాణశైలము. ఇది ఆనందమయ కోశము. కల్యాణ శైలము ఎవరి యొక్క నిలయమో, ఆమెను కల్యాణ శైలనిలయా అని అంటారు. కల్యాణ శైల మనబడే మహా మేరువు ఎవరి ఇంట్లో ఉంటుందో, దేవి వారి ఇంట్లో ఉంటుంది. ఈ విధంగానే లలితా సహస్రంలో "సుమేరు మధ్య శృంగస్థా" అని చెప్పబడింది. మహా మేరువులో మధ్యన అంటే బిందువునందు ఆ పరదేవత ఉంటుంది. అదే సర్వానందమయ చక్రము. అక్కడ దేవి ఉంటుంది. కాబట్టి ఆమె కల్యాణశైల నిలయా అనబడుతున్నది. ఓం కల్యాణ శైల నిలయాయై నమః

**5. కమనీయా :** పరమానందమయమైన స్వరూపము కలది. మనోహరమైన రూపముకలది. కాబట్టి ఆమె ప్రేమాస్పద. సుఖము మనోహరమైనది. మాయచేత ఆవరించబడిన జీవులకు సుఖము చేకూర్చునది. పరదేవత యందు ప్రీతిగలిగి, ఆమెను పూజించే వారికి అధికమైన ఫలమును ఇచ్చేది కాబట్టి దేవి 'కమనీయా' అనబడుతోంది. దేవి అనిర్వచనీయమైన ఆనంద స్వరూపము కలది కాబట్టి 'కమనీయా' అనబడుతున్నది.

**6. కళావతి :** కళ అంటే శిరస్సు, కాళ్ళు, చేతులు మొదలైన అవయవాలు, లేదా అరవై నాలుగు కళలు లేదా చంద్రుని యొక్క షోడశ కళలు.

*ధర్మా ద్యాః పూర్ణిమాంతస్తు కళా పంచ దశైవతు ।*
*షోడ శీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥*

ధర్మ మొదలు పూర్ణిమ వరకు గల కళలు పదిహేను. పదహారవ కళ సాక్షాత్తూ ఆ రమేశ్వరియే అయి ఉన్నది. అందుచేతనే ఆ దేవి కళావతి అనబడుచున్నది.

. **కమలాక్షీ:** కమలముల వంటి కన్నులు కలది. కమల అనేది లక్ష్మీదేవి పేరు. అక్షి అనే పదానికి ాక్షణికార్థము జ్ఞానము. కాబట్టి దేవి జ్ఞానస్వరూపిణి అయిన లక్ష్మీదేవి అని చెప్పబడుచున్నది. ేవి తన యొక్క కరుణా దృక్కుల చేతనే భక్తుల యొక్క కోర్కెలు తీరుస్తుంది. వారికి సిరిసంపదలు, న ధాన్యములు ఇచ్చి సంతోషపెడుతుంది.

3. **కల్మషఘ్నీ:** కల్మషమును లేక పాపమును పోగొట్టునది, జ్ఞానాగ్ని సర్వపాపములను హరిస్తుంది. క్కడ దేవి కల్మషఘ్ని, అంటే వేదాంత మహావాక్యముల వలన కలిగిన స్వాక్షాత్కార రూపమైన బ్రహ్మవిద్య.

. **కరుణా మృతసాగరా:** కరుణ చేత, కృపచేత కలిగిన అమృతము వలన ఏర్పడిన సముద్రము. కృపావశమున ఏర్పడిన మోక్ష రూపమగు అమృత సముద్రము వంటిది. దేవి సుధా సింధువు అంటే అమృత సముద్రము లేక పాల సముద్రము మధ్యన ఉంటుంది అని చెప్పబడింది. సుధాసింధోర్మధ్యేసురవిటపవాటీ పరివృతే'అని సౌందర్యలహరిలో చెప్పబడింది. క్షీరసాగర మధ్యలో రత్న ద్వీపము మధ్యలో రత్న సింహాసనంమీద దేవి ఆసీనురాలయిందని చెప్పబడింది.

**క్షీర సాగర మధ్యే రత్న ద్వీపాయ నమః**
**రత్న ద్వీప మధ్యే కల్పవృక్ష వాటికాయై నమః**
**తన్మధ్యే రత్న సింహాసనాయై నమః**
**రత్న సింహాసనో పరిస్థితా శ్రీ లలితా త్రిపురసుందరీ పరాభట్టారికాయై నమః**

దేవి అమృత స్వరూపిణి అమృతము అంటే నీరు, పాలు, నెయ్యి, మోక్షము, అన్నము, పరబ్రహ్మము, శాశ్వతమైనది అని కూడా అర్థమున్నది. తాను అమృత రూపిణి అయి ఉండి మేఘములు సృష్టించి, వాటి నుండి వర్షము రూపంలో నీటిని కురిపించి, ఆ నీటిని లోకంలోని జనులు త్రాగటానికి నీలు కల్పించినది.

అమృతము అంటే పాలు - పాలను సృష్టించి పసిపాపలకు జీవము నిచ్చు తల్లి.

అమృతము అంటే నెయ్యి. ఆ దేవి యొక్క శక్తిచేత పాల నుండి నెయ్యి వస్తుంది. ఆ నెయ్యి మానవుని మేధాశక్తిని పెంపొందింప చేస్తుంది.

'ఘృతేన వర్థతే బుద్ధి, క్షీరేణ ఆయుష్ష వర్థతే'

ఇక్కడ ఘృతము అంటే ఆవు నెయ్యి అని అర్థం. అలాగే క్షీరము కూడా గోక్షీరమే. ఈ రకంగా మానవుని బుద్ధిని పెంచి, అతడు శాశ్వతమైన ఆనందం గురించి ఆలోచించేలా చేస్తుంది.

అమృతము అంటే అన్నము, తినే ఆహారము అని అర్థం. మానవుడికి ఆహారాన్నిచ్చి అతడి ఆయుష్షు పెంచుతుంది. తద్వారా మానవుడు పరబ్రహ్మను గురించి ఆలోచించేలా చేస్తుంది.

అమృతము అంటే పరబ్రహ్మము అని అర్థం. బ్రహ్మను గూర్చి తెలుసుకున్నవాడే పరబ్రహ్మ స్వరూపుడౌతున్నాడు. బ్రహ్మవేత్తయే మోక్షము పొందుతాడు అని శృతిలో చెప్పబడింది. అటువంటి మోక్షము ప్రసాదించునది.

అమృతము అంటే మృతము లేనిది. శాశ్వతమైనది అని అర్థం. దేవి జరామృత్యు భయాలు లేనటువంటిది. బాల్యము, కౌమారము, యౌవనము మొదలైన దశలు లేనటువంటిది. అజరామరమైనది.

అయితే దేవి 'కరుణామృత సాగరా' అని చెప్పబడుతోంది. కరుణ అనేడి అమృతము గలిగిన సముద్రము. కరుణ అంటే జాలి, దయ అని అర్థము. తన బిడ్డలు చేసిన పాపములను క్షమించి వారిని దరి చేర్చేది.

సాగరము అంటే సగరుడను రాజుయొక్క వంశస్థులచే త్రవ్వబడినది. ఈ నామంలో అది అమృత సాగరము అని చెప్పబడింది. నీటిని సముద్రములోనికి చేర్చేటటువంటి గంగానదియే కరుణామృత సాగరము. పుణ్యనదీ స్నానం చేసిన వారికి ఆ దేవి శాశ్వతమైన మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

**10. కదంబ కాననావాస :** కదంబ వృక్షము అంటే కడిమి చెట్టు. కడిమి చెట్ల వనములో ఉండునది కదంబ వృక్షము. అంటే కల్ప వక్షము అని శంకర భాష్యము. కల్పవృక్షములతో ఉన్న వనమున నివసించునది. కల్పవృక్షము కోరిన కోరికలు తీరుస్తుంది. అని చెప్పబడింది. అటువంటి కల్పవృక్షముల వనమునందుండే పరమేశ్వరి భక్తులు కోరకుండానే వారి కోర్కెలను తీరుస్తుంది.

**11. కదంబకుసుమప్రియా :** కదంబ వృక్షముల పూలయందు ప్రీతి కలది.

**12. కందర్ప విద్యా:** కందర్పుడు - కుత్సితమైన దర్పము కలవాడు - మన్మథుడు. లొల్లా లక్ష్మీధరుల అభిప్రాయము ప్రకారము శ్రీవిద్య అంటే పంచదశీ మహామంత్రము. శాక్తేయానికి ఇది గాయత్రి వంటిది. ఈ మంత్రాన్ని భూలోకానికి తెచ్చినవాడు మన్మథుడు. అతడే ఈ మంత్రానికి ద్రష్ట. ఈ మంత్రం మొత్తం సోమ, సూర్య, అనలాత్మకములని మూడు ఖండాలుగా ఉంటుంది. వీటినే మూడకూటములు అని కూడా అంటారు. బీజాలు క ఏ ఈ ల హ్రీం । అనబడే మొదటి ఐదు బీజాలు వాగ్భవకూటమి. ఇది ఋగ్వేదాత్మకము. దీనివల్ల బ్రహ్మవర్చస్సు, మంచి బుద్ధి కలుగుతాయి. హ స క హ ల హ్రీం । అనబడే ఆరు బీజాలు కామరాజకూటమి. ఇది యజుర్వేదాత్మకము. దీనివల్ల అర్థకామాలు సిద్ధిస్తాయి. స క ల హ్రీం । అనబడే నాలుగు బీజాలు శక్తి కూటమి. ఇది సామవేదాత్మకము. దీనిలో మోక్షసాధనమగు మార్గము చెప్పబడింది. అయితే ఇరవై ఎనిమిది అక్షరాలుగల మహాషోడశి బ్రహ్మవిద్య. ఇది పూర్తిగా మోక్షవిద్య.

మంత్రాలను రెండు రకాలుగా విభజించారు.

"స్త్రీ దైవత్యాస్తు విద్యాస్స్యుః మంత్రాః పుందేవతాస్స్మృతా"

పురుష దేవతలనుపాసించే వాటిని మంత్రాలని స్త్రీ దేవతలనుపాసించే వాటిని 'విద్యా' అని అంటారు. కాబట్టి ఇక్కడ కందర్పవిద్య అంటే మన్మధుడు భూలోకానికి తెచ్చిన మంత్రము అని అర్థం. ఆ మంత్రానికి అధిదేవత పరమేశ్వరి.

**3. కందర్పజనకాపాంగ వీక్షణా :** మన్మధోత్పాదకమగు అపాంగ వీక్షణము కలది. అపాంగము అంటే కడకన్ను. కనుకొలకు. కనుకొలకులనుండి చూచుటను అపాంగవీక్షణము అంటారు. ~~ఈ~~ రకంగా చూసినట్లైతే వస్తువు చాలా కొద్దిగా కనిపిస్తుంది. ఆ దేవి యొక్క కడకంటి వీక్షణము సోకినంత మాత్రము చేతనే జడులు, కురూపులు కూడా మన్మధునివలె అందమైన రూపము ధరించుచున్నారు. ఇదే విషయాన్ని సౌందర్యలహరిలో

*వరం వర్షీయాసం నయన విరసం నర్మసుజడం*
*తవా పాఙ్గాలోకే పతిత మనుధావన్తి శతశః*
*గల ద్వేణీ బంధాః కుచకలశ విస్రస్త నిచయాః*
*హఠాత్త్రుట్య త్కాంచో విగళిత దుకూలాయువతః ॥*

తల్లీ ! నీ యొక్క కడగంటి చూపు సోకినంత మాత్రముచేతనే ఎంత ముసలివాడయినా, అంద విహీనుడైనా, జడుడైనప్పటికీ అప్సరసలలాంటి అందమైన స్త్రీలు అతనిని వరించి వెంటపడతారు.

కందర్ప జనకుడు అంటే మన్మధుని తండ్రి శ్రీమన్నారాయణుడు. లోకాలను రక్షించటం విష్ణువు పని. అతని యొక్క కడకంటి చూపులచేతనే జగద్రక్షణ జరుగుతుంది. అయితే ఆ విష్ణువు కూడా దేవి యొక్క ఆజ్ఞానుసారమే చరిస్తుంటాడు. కందర్పజనకా అంటే లక్ష్మీదేవి. లక్ష్మీదేవి ఎవరి అపాంగవీక్షణములకు లోబడి వర్తిస్తుంటుందో ఆ పరమేశ్వరి అని ఇక్కడ అర్థము.

మన్మధుడు ఉత్పన్నముచేసే పూలమాలలు, మొదలైన భోగ విషయములు ఎవరి అపాంగవీక్షణమున కలుగుచున్నవో ఆ దేవి. పరమేశ్వరి యొక్క కుడి కన్ను సూర్యుడు, ఎడమ కన్ను చంద్రుడు. దేవి యొక్క ఎడమకంటి యొక్క అపాంగ వీక్షణమును చంద్రిక (వెన్నెల) అంటారు. కందర్పజనకమైన ఆ చంద్రిక కలది అని అర్థము. కందర్పజనకము అంటే లక్ష్మీనివాసమైన కమలము అని అర్థము. కమలములవలె ఉన్న అపాంగములు కలది. కమలాక్షి. కమలముల వంటి కనుల నుండి వచ్చిన వీక్షణము లోకాలను జీవింపచేస్తుంది.

**14. కర్పూర వీటి సౌరభ్యకల్లోలితకకుప్తటాః** కర్పూరము, పునుగు, జవ్వాజి మొదలగు సుగంధ ద్రవ్యములు కలిపిన నీ తాంబూలపు పరిమళము చేత దిక్కులన్నీ పరిమళము వెదజల్లుచున్నవని

భావము. సుగంధ ద్రవ్యాలతో కూడిన తాంబూలచర్వణము రాజభోగము. అందుచేతనే దేవతలకు తాంబూలము సమర్పించేటప్పుడు "ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం" అని చెప్పటం జరుగుతుంది. ఈ నామంలో పరమేశ్వరి మహారాజ భోగవతి అని చెప్పబడుతున్నది.

**15. కలి దోషహరా :** కలిదోషములను హరించునట్టిది కలి. కృధుని కుమారుడు. ఇతని తల్లిపేరు హింస. ఇతని తల్లితండ్రులు ఇద్దరూ తోబుట్టువులు. లోకంలో చెడు అంతా ఇతని వల్లనే వస్తుంది. అన్ని పాపాలకు కారణం ఇతడే. ద్వాపర యుగంలో శ్రీ కృష్ణావతారం పరిసమాప్తి కాగానే కలి ఉద్భవించాడు. విష్ణుమూర్తి కల్కి అవతారం ఎత్తి కలిపురుషుణ్ణి సంహరిస్తాడు. ప్రస్తుతము నడిచేది కలియుగము. ఈ కలియుగంలో పుట్టే మానవులకు పుట్టుకతోనే పాపాలు వస్తున్నాయి. పరమేశ్వరిని దర్శించటం ద్వారా, ఆమె గాధలు వినటం ద్వారా, ఆమెను కీర్తించటం ద్వారా, ఆమెను స్తోత్రం చెయ్యటం ద్వారా, ధ్యానించటం ద్వారా ఆ పాపాలు నశిస్తాయి. ఈ రకంగా కలివల్ల వచ్చే దోషాలను హరిస్తుంది కాబట్టి ఆమె కలిదోషహరా అనబడింది. కలియుగంలో అన్యోన్యంగా మెలిగేవారు కూడా అకారణంగా వాదనకు దిగుతారు. ఈ రకంగా వచ్చే వాద ప్రతివాదాలవలన అనేక రకాలైన దోషాలకు కారణాలవుతున్నాయి. ముఖ్యంగా ఈ వాదనలు పరబ్రహ్మను గూర్చి ఉంటాయి. వేదాలు ప్రమాణాలా ? పరబ్రహ్మ సాకారుడా ? నిరాకారుడా ? అసలు ఉన్నాడా ? లేదా ? దేహము, పరబ్రహ్మ రెండూ ఒకటేనా ? గుణాలు ఉన్నాయా ? ఈ రకంగా అనేక రకాలయిన వాదనలు, సందేహాలు. అంతేకాక మానవనైజమైన దురాగ్రహము. దానివలన కలిగే కామము, క్రోధము, పరుషవాక్కు, పరనింద, అసహనము మొదలైన దోషాలు. ఆ పరమేశ్వరిని గనక ఆరాధించినట్లైతే జీవాత్మ, పరమాత్మ రెండూ ఒకటే అనే అద్వైత జ్ఞానాన్ని ప్రసాదించి ముక్తిని కలిగిస్తుంది. ఈ రకంగా కలివల్ల కలిగే దోషాలు హరించబడతాయి. పద్మముల వంటి కన్నులు కలది కావున కలిదోషహరా!

**16. కంజలోచనా :** క అంటే ఉదకము, దాని నుండి పుట్టినది. కంజము అంటే అరవిందము, నీలోత్పలము అని అర్థము. కంజములవంటి లోచనములు కలది. కంజము అంటే బ్రహ్మాండము అని అర్థమున్నది. పరమేశ్వరుడు నీటిని సృష్టించి, దానిలో వీర్యమును విసర్జించాడు. అప్పుడు ఆ నీటిలో నుంచి బంగారపు అండము వచ్చినది అని శ్రుతిలో చెప్పబడింది. ఈ విధంగా బ్రహ్మచేత సృష్టించబడిన అండము కాబట్టి బ్రహ్మాండము అనబడినది. అంటే కేవలము ఆ దేవి యొక్క వీక్షణ మాత్రంచేత కోట్లకొలది బ్రహ్మాండాలు సృష్టించబడినాయి. అందుకే ఆమె కంజలోచనా అనబడింది.

**17. కమ్ర విగ్రహా :** మనోజ్ఞమగు విగ్రహము కలది. దేవి సాకారమైనప్పుడు గాంభీర్యము, ధైర్యము, మాధుర్యము మొదలైన గుణములచేత అతి మనోహరమైన రూపము కలిగి ఉంటుంది. కాబట్టి కమ్రవిగ్రహా అనబడుతోంది.

**కర్మాదిసాక్షిణీ :** కర్మాదులకు పరమేశ్వరి సాక్షి. ఉపాసన, యోగము, శ్రవణము, ధ్యానము, ననము మొదలైనవి కర్మలు. మానవులు చేసే ఈ కర్మలకు పరమేశ్వరి సాక్షిగా ఉంటుంది. ర్మలతో ఆమెకు సంబంధము ఏమాత్రం ఉండదు. కేవలం ద్రష్ట మాత్రమే. కర్మలన్నీ జీవుణ్ణి శ్రయించి ఉంటాయి. అతడు చేసే కర్మలకు ఆ పరదేవతయే సాక్షి. లలితా అష్టోత్తర నామావళిలో "జాగ్ర స్వప్న సుషుప్తీనాం సాక్షి భూత్యైనమోనమః" అని చెప్పబడింది. అంటే గ్రస్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిలోను జీవుడు చేసే కర్మలకు ఆ పరమేశ్వరియే సాక్షి.

**కారయిత్రీ:** ఏదైనా ఒక పని చెయ్యి అని ఆజ్ఞాపించగలగటమే కారయితృత్వము అనబడుతుంది. ఈ పని చెయ్యి అని ఆజ్ఞ చేసే గుణాన్నే కారయితృత్వము అంటారు. భవిష్యత్తులో ఉత్పన్నము గల కార్యమునుద్దేశించి చేసే దానిని పని అంటారు. ఈ పనిని మేల్కొలుపు ధర్మాన్ని విధినిష్ఠమైన వన అంటారు. ఈ భావన శబ్దరూపంలో ఉంటుంది. ప్రాణములేని వాటికి ఈ రకమైన భావన ండదు. ప్రాణులకు చైతన్యము ఉంటుంది. దాని ద్వారా ఈ భావన పుడుతుంది. "సర్వే వేదా త్రైకం భవంతి" 'సమస్త వేదాలు ఎక్కడ ఒకటౌతున్నాయో' అని శ్రుతిలో చెప్పబడింది. వేదము త్మకన్న వేరైనది కాదు. ఆత్మ కన్న వేరు కాని వేదమునకు స్వప్రకాశమే అర్థ ప్రకాశము. అంటే త్మ స్వప్రకాశము. అర్థమును ప్రకాశింపచేయటం ద్వారా, వేదంలో ఒక భాగాన కనిపించే ప్రామాణ్యా ములు ప్రేరేపణ చెయ్యటం చేత, అధిష్ఠాన చైతన్యరూపమే కర్మలను చేయిస్తున్నది. అనగా ఆ ధులను చెయ్యమని ప్రేరణ చేసేది ఆ పరమేశ్వరియే. అందుచేతనే ఆమె కారయిత్రి నబడుచున్నది.

**ం. కర్మఫలప్రదా :** కర్మల యొక్క ఫలమును ప్రసాదించునది. మానవుడు పూర్వజన్మలో చేసిన ర్మల యొక్క ఫలితాన్నే ఈ జన్మలో అనుభవిస్తాడు. మానవుని సుఖదుఃఖాలకు కర్మలే కారణమని ద్ధాంతము. దీనినే అనీశ్వరవాదము అంటారు. కాని ఈ వాదము నిజం కాదు. చేసిన కర్మలకు లితాన్ని తప్పకుండా ఇవ్వటమనేది కార్యకారణ సిద్ధాంతము. అంతా కర్మప్రకారమే జరిగితే రమేశ్వరుడి అవసరం ఏముంటుంది ? అతడి ఆవశ్యకత ఏమిటి ? అందుకే ఈ కర్మవాదము ప్పు. ఆత్మయే కర్మకు అధిపతి. గీతలో భగవానుడు నేనే ఈ కర్మలను విధించాను అని ప్పాడు. అంటే ఆ కర్మలకు అధిపతి పరమేశ్వరి. మానవుడు చేసిన కర్మకు ఫలితాన్ని ఇచ్చేది ూడా ఆ పరమేశ్వరియే. అంటే కర్మలను విధించేది, వాటికి ఫలితాన్ని ఇచ్చేది కూడా ఆ దేవియే. ందుచేతనే ఆమె కర్మ ఫలప్రదాయిని అని చెప్పబడినది.

**ఏ కారరూపా చైకాక్షర్యేకా నేకాక్షరాకృతిః**
**ఏతత్తదిత్య నిర్దేశ్యా చైకానంద చిదాకృతి : ॥** 5
**ఏవమిత్యాగమా బోధ్యాచైక భక్తి మదర్చితా**
**ఏకాగ్రచిత్త నిర్ధ్యాతాచైషణా రహితాదృతా** 6

ఏలా సుగంధి చికురాచైన : కూటవినాశినీ
ఏకభోగాచైకరసా చై కైశ్వర్య ప్రదాయినీ ॥ 7
ఏకాతపత్ర సామ్రాజ్యప్రదా చైకాంత పూజితా
ఏధమాన ప్రభా చైజదనేక జగదీశ్వరీ ॥ 8
ఏకవీరాదినం సేవ్యా చైకప్రాభవశాలినీ

**21. ఏకారరూపా :** ఈ నామము దగ్గర నుండి పంచదశీ మహామంత్రంలోని రెండవ బీజమైన ఏకారమును వివరిస్తున్నారు. ఆ పరమేశ్వరి ఏ కారరూపము కలది. అంటే జ్ఞానప్రదాయిని. ఏ కారము అకారము నుండి క్షకారము వరకు గల వర్ణములను సూచిస్తుంది. కాబట్టి పంచదశీ మహామంత్రము సర్వవర్ణముల రూపమని, మోక్షప్రదమని తెలియచేస్తుంది. అందుచేతనే ఆ మంత్రాధిదేవత అయిన పరమేశ్వరి ఏ కారరూప అని చెప్పబడుతోంది.

**22. ఏకాక్షరీ :** ఏకాక్షరీ అంటే ఒకే అక్షరము కలది. పరమేశ్వరి మాయా బీజమైన హ్రీంకార ప్రాధాన్యము కలది. అందుచేతనే ఆమె ఏకాక్షరీ. ఏకమగు అక్షరము కలది. ఏకము అంటే ఈశ్వరోపాధి (మాయ) అనటంచేత ముఖ్యమైనది. స్వస్వరూప జ్ఞానం లేనిదే ముక్తి లభించదు. క్షరము కానిది అక్షరము. అనగా ఆత్మజ్ఞానము కలిగేదాకా నాశనము కానిది అక్షరము. ఇదే కూటస్థమాయ. 'హ్రీం' కారము ఆత్మ జ్ఞానము ఎప్పుడైతే కలుగుతుందో, అప్పుడు ఈ మాయ నశిస్తుంది. ఈ మాయకు ప్రతిబింబము ఈశ్వరుడు. ఆయనకు సర్వజ్ఞతను కలుగచేయునది కాబట్టి పరమేశ్వరి ఏకాక్షరి. చరాచర జగత్తుకూ మూలమైనది, పరబ్రహ్మకు ప్రతిరూపమైనది ప్రణవము. ఈ ప్రణవమును సూచించే పరమేశ్వరి ఏకాక్షర రూప 'ఏక' అంటే అఖండమైన ఏకైక చైతన్య రూపము. దీనికి ఆద్యంతములు, జనన మరణములు లేవు. ఈ రూపముకు నాశనము లేదు. క్షరము లేనిది. అందుచేతనే అక్షరము. కాబట్టి ఏకాక్షరీ అనబడుతున్నది. పరమేశ్వరిని ఉపాసించే బీజము హ్రీం అనబడే మాయా బీజము. అఖండాకారవృత్తిలో ప్రతిఫలించటానికి యోగ్యమైన చైతన్యము ఆ వృత్తి యందు వ్యాపించి ఉన్నది. అక్షరము అను పదముచే సూచించబడు ఈ చైతన్యము ఈమె యందున్నది కాబట్టి ఈమె ఏకాక్షరీ.

**23. ఏకానేకాక్షరాకృతి :** ఏకము, అనేకములైన అక్షరముల ఆకృతి కలది. ఏకం అంటే ఈశ్వరుని ఉపాధి వశమున ప్రకాశించే శుద్ధతత్త్వ ప్రధానమైన అక్షరమే అజ్ఞానము. అనేకం అనగా మలినసత్వ ప్రధానముల వలన కనిపించే జీవనోపాది హేతువులైన అక్షరములు అజ్ఞానములు. మాయ, అవిద్య అంటే అజ్ఞానము ఆ పరతత్త్వము వలననే కలుగుచున్నది. ఈ చరాచర జగత్తు అంతా మాయచేతనే సృష్టించబడుచున్నది. ఈ ప్రకృతి అంతా మాయే. కుండలో నీరు పోసినప్పుడు, ఆ నీటిలో ఆకాశము యొక్క ప్రతిబింబము కనిపిస్తుంది. అలాగే అక్షరాలు అనబడే మాయలో చైతన్యము ప్రకాశిస్తుంది.

కము అంటే ఓంకారము. అనేకములైనవి అకారాదిక్షకారాంతము ఉన్న అక్షరాలు. వీటి స్వరూపమే దేవి. అందుచేతనే పరమేశ్వరి మాతృకా వర్ణరూపిణి అయినది. అక్షరాలను మాతృకలు అంటారు. కార కకారములు కలసి ఏకశబ్దము అవుతాయి. కాగా మిగిలిన అక్షరాలు పంచదశీ మహా ంత్రము. అందుచేత ఈ నామంలో పంచదశీ మహామంత్రాన్ని వివరించటం జరిగింది.

**4. ఏతత్తదిత్యనిర్దేశ్యా:** ఇది అది అని నిర్దేశించుటకు వీలు కానిది. ఈ సమయంలో వస్తువు న దగ్గర ఉన్నప్పటికీ దానియొక్క స్వరూపము ఇది అని నిర్దేశించటానికి వీలు కానిది. ర్దేశింపబడజాలనిది ఆ దేవి. లోకంలో ఉన్న అన్ని వస్తువులను ప్రత్యక్షమని, పరోక్షమని చెప్పగలము. బ్ద ప్రవృత్తికి కారణమైన వాటిని జాతి, గుణము క్రియలను బట్టి నిర్వచించటం జరుగుతుంది.

మానవుల లక్షణాలను, ధర్మాన్ని గురించి చెప్పేది జాతి. ఎరుపు, తెలుపు మొదలైన రంగులను రించి చెప్పేది గుణము. నడవటము, పరుగెత్తటము మొదలైన వాటిని గురించి చెప్పేది క్రియ. న్,కున్, యొక్క, లోన్, లోపల అనే షష్ఠీ విభక్తి గల పదాలు కూడా ప్రవృత్తి హేతువులే.

ఈ నాలుగు రకాల సంబంధాలు లేనిది అంటే పరమేశ్వరి శబ్దము కాని, రూపము కాని, నిది. అందుచేతనే ఆమె నిరాకార, నిర్గుణ అని చెప్పబడుతున్నది. అటువంటి వస్తువు ఎవరిచేత సృష్టింపబడినదని కాని, దేనివలన వచ్చినదని కాని, ఏ పదము వలన వచ్చినదని కాని చెప్పటానికి లు లేదు. ఆ పరదేవత, వాక్కుకు, మనస్సుకు అతీతమైనది. ఏ తత్త్వము చేతను నిర్దేశించుటకు లు కానిది. శుద్ధ చైతన్య స్వరూపమైన పరమేశ్వరిని కారణమని గాని, కార్యమని గాని నిర్దేశించిటానికి లు లేదు.

కపిల మహర్షి ప్రకృతి పురుషుల వలన జగత్తు పరిణామము చెందుతున్నదని పరిణామ వాదాన్ని లేవదీశాడు. దీని ప్రకారము ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచభూతాలు, మనస్సు, పురుషుడు అనే ఇరవై ఐదు తత్త్వములచేతనే జగత్తు పరిణామము చెందుతున్నది. పాలు పెరుగుగా మారినట్లే ప్రకృతి పురుషుని చేరి ఈ జగత్తును సృష్టించుచున్నది. ఈశ్వరుడు అనేవాడు వేరేలేడు. జీవుడే చైతన్య స్వరూపుడు. అతడే కర్మఫలమనుభవిస్తాడు. ఈ విషయాలు తెలియచేసే దాన్ని 'సాంఖ్య దర్శనము' అంటారు.

వ్యాస మహర్షి వ్రాసిన భాగవతములో పరమేశ్వరుడు అనబడే వాడు శ్రీ మహావిష్ణువు. అతడే సృష్టి స్థితి లయాలకు కారణభూతుడు. అతని వల్లనే జీవులకు జనన మరణాలు సంభవిస్తున్నాయి. కాబట్టి జీవుడు నిత్యుడు కాదు. శ్రీ మహావిష్ణువే నిత్యము, సత్యము. అని చెప్పబడింది.

కణాద మహర్షి వైశేషిక దర్శనము వ్రాశాడు. దాని ప్రకారం ఈ జగత్తుకు మూలకారణం 'పరమాణువు' అని చెప్పబడింది. కొన్ని పరమాణువులు కలిసి ఈ జగత్తు ఏర్పడింది. ఇంత పెద్ద సృష్టి కార్యక్రమానికి కర్త ఒకరుండాలి కాబట్టి పరమేశ్వరుణ్ణి అనుమాన ప్రమాణం మీద సాధిస్తారు.

ఈ రకమైన సిద్ధాంతాల ద్వారా పర దేవతను నిర్దేశించటానికి వీలు లేదు. అందుచేతనే ఆమె నిర్దేశ్య.

**25. ఏకానంద చిదాకృతి :** ఏకమగు అందము యొక్క ఆకృతి గలది. మోక్షమును కలుగ చేయుటయే ఆమె అభీష్టమైనది. ఆనందము అంటే సుఖము. ప్రకాశ జ్ఞానమైన చైతన్యమే చిత్ అనబడుతోంది. స్వరూపాన్ని ఆకృతి అంటారు. చైతన్య స్వరూపమే దేవి ఆకృతి. అందుచేతనే ఆమె సచ్చిదానందరూపిణి. పరబ్రహ్మ స్వరూపిణి. పరబ్రహ్మ స్వరూపమే విజ్ఞానము, ఆనందము అని, ఆనందమే బ్రహ్మ స్వరూపమని చెప్పబడింది. తేజోరూపమై ప్రకాశిస్తున్న పరమానంద స్వరూపమైన ఆత్మకు జీవన్ముక్తి కలుగగా, పరమాత్మ జ్ఞానమొందిన పురుషులకు అనుభవరూపమున ప్రత్యక్ష ప్రమాణముగా గోచరిస్తుంది. అంటే ప్రాణాయామంలో కుండినీ శక్తిని నిద్రలేపి సహస్రారానికి చేర్చినట్లైతే, అక్కడ ఆత్మ సాక్షాత్కారమై సాధకుడికి బ్రహ్మానందము కలుగుతుంది. అనుభవజ్ఞులైన యోగులకు మాయచే కప్పబడని కాంతితో సాక్షాత్కరించి ఆనందమునిచ్చునది. శివశక్తి అని మూర్తి భేదము లేని ఆకారము కలిగి సాధకులను ఆనందింపచేయునది.

**26. ఏవమిత్యాగమాబోధ్యా :** ఆ పరమేశ్వరి స్వరూపము ఈ రకంగా ఉంటుందని ఆగమాలలో చెప్పబడలేదు. ఇటువంటి విశేషములు కలది అని ప్రత్యక్ష సిద్ధముగ ఆగమశాస్త్రము లందు చెప్పబడలేదు. ప్రత్యక్ష సిద్ధమైన వేదములచే ఆమె బోధపడదు. వేదాలలోగాని, శాస్త్రాలలో గాని, ఉపనిషత్తులలోగాని, మరెక్కడా గాని ఆ దేవి యొక్క రూపము, లక్షణములు వర్ణింపబడలేదు. అందుకే పరమేశ్వరి నిరాకారా, నిర్గుణా అని చెప్పబడింది.

**27. ఏకభక్తి మదర్చితా :** ఏకభక్తి గల వారిచేత అర్చింపబడునది. జీవాత్మ, పరమాత్మ వేరు కాదు. రెండూ ఒకటే. ఈ రెంటికీ భేదం లేదు అనే భావన, జిజ్ఞాస కలవారిచేత అర్చింపబడునది. అర్చించటము అంటే పూజించుట, ధ్యానించుట, ఆరాధించుట, స్తుతి చేయుట, నమస్కరించుట మొదలైనవి. ఇంద్రియాలు చేసే కర్మలన్నీ మనస్సు యొక్క ఆలోచన నుండి వచ్చేవే. పరమేశ్వరిని మనస్సుతో ధ్యానిస్తే, అదే వాక్కు చేత చెప్పబడి కర్మలద్వారా బహిర్గతమవుతుంది. ఈ జగత్తులో బ్రహ్మస్వరూపాన్ని తెలుసుకున్నవారు కొందరున్నారు. వారిని భక్తితో అర్చించాలనే బుద్ధి కలగగా, ఆ భక్తి సగుణ బ్రహ్మమైనది. తొమ్మిది విధములుగ ఉన్నది. అవి :

1. శ్రవణము
2. కీర్తనము
3. స్మరణము
4. పాదసేవనము
5. అర్చనము
6. వందనము
7. దాస్యము
8. సఖ్యము
9. ఆత్మ నివేదనము

త్రివిధ భక్తులు కూడా చెప్పబడినాయి. అవి.

1. బాహ్యము (పరోక్షజ్ఞానం కోసము)
2. అనన్యము (అపరోక్ష జ్ఞానం కోసము)
3. ఏకాంతము (నిశ్చయ జ్ఞానము కలుగు నిత్యానందము పొందటానికి)

ఈ రకంగా అనన్య భక్తి కలిగిన వారిచే అంతర్యాగము, బహిర్యాగము, మహాయాగము అను మూడు విధాలుగా పూజింపబడునది.

**28. ఏకాగ్ర చిత్త నిర్ధ్యాతా :** ఏకాగ్ర చిత్తము కలవారిచే నిర్ధ్యాతా. ఏకాగ్రము అంటే ఐక్యరూపము ఆలంబన విషయముగా కలిగి ఉన్నదని అర్ధము. ఒకే రకమైన చిత్త వృత్తులు కలవారికి చైతన్యము నిరంతర వ్యాప్తమై అంతఃకరణ యందు ప్రకాశిస్తుంది. అష్టాంగ మార్గముల ద్వారా పరిపక్వము పొందిన వారికి అసంప్రజ్ఞాత సమాధి లభిస్తుంది. అష్టాంగ మార్గములు అంటే.

| | | |
|---|---|---|
| 1. యమ | 4. ప్రాణాయామము | 7. ధ్యానము |
| 2. నియమము | 5. ప్రత్యాహారము | 8. సమాధి |
| 3. ఆసనము | 6. ధారణము | |

అసం ప్రజ్ఞాత సమాధికి 1) ఋతంభర 2) ప్రజ్ఞాలోక 3) ప్రశాంత వాహిక అనేవి భూమికలు (ప్రదేశాలు). నిర్విచారుడై సమాధియందున్న యోగికి కలిగే ప్రజ్ఞను ఋతంభర అంటారు. అది సత్యమును ధరించే ప్రజ్ఞ. ఋతంభరుడు అంటే సత్యమును పాలించువాడు అని అర్ధం. అంతఃకరణ వృత్తిలో సచ్చిదానంద లక్షణము గల బ్రహ్మావ్యాప్తినందటమే ఋతంభర అనే స్థితి. నిత్యము నిరంతరము అయిన అభ్యాసంతో మాయ తొలగిపోయి బ్రహ్మావిషయకమైన అఖండాకారవృత్తి బయలుదేరుతుంది. ఈ పరబ్రహ్మ రూపము సాక్షాత్కారము కాగా కారణవిజ్ఞానము ఉత్పన్నమౌతుంది. ఇదే ప్రజ్ఞాలోక భూమిక. ఈ స్థితిలో అంతఃకరణలో ఆకార స్వరూప, వాసనలు నశిస్తాయి. దీనిని ప్రశాంత వాహిత అంటారు. ఇది యోగదర్శనము. నిరంతర వృత్తి అయిన ధారావాహిక వృత్తియే వాహము, ప్రవాహము. ఇది ప్రశాంతమైనది. ప్రశాంతమైన ప్రవాహము కలిగినది ప్రశాంతవాహి. వృత్తి శూన్యమైన మనస్సు బ్రహ్మాకారముగా ఉన్నట్లైతే; దాన్ని 'అసంప్రజ్ఞాత సమాధి' అంటారు. ఇది యోగులకు చాలా ఇష్టమైనది. ఇతడే ప్రశాంతమైన మనస్సు కలవాడు. పంచభూతాలను జయించి యోగమార్గంలో ఉన్నప్పుడు జరామరణములుండవు. అట్టి యోగిశరీరము యోగాగ్ని మయము, ఈ స్థితిలో ధ్యానముండదు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. వారిద్దరికీ భేదం లేదు. అందుకే ఈ స్థితిలో ధ్యానముండదు. ఒకవేళ ధ్యానం గనక చేస్తే, యోగికి తన స్వరూపమే సాక్షాత్కరిస్తుంది. అంటే ఆ యోగియే పరబ్రహ్మ అవుతున్నాడు.

'నిర్ధ్యాతా' అంటే శ్రవణ మనన, ధ్యానముల ద్వారా సాక్షాత్కరించునది.

**29. ఏషణారహితాద్ధృతా :** ఇష్టములేని వారిచే ఆదరింపబడునది. ఏషణ అంటే కోరిక. కోరికలు మూడు రకాలు.

1. **పుత్రైషణ :** ఈ లోకంలో ఆధిపత్యం సంపాదించటానికి సంతతి కావాలనే కోరిక.
2. **విత్తైషణ :** పితృలోకాలు గెలవటానికి కావలసిన కర్మలు చెయ్యటానికి ధనం కావాలనే కోరిక.
3. **ఇచ్ఛలోకైషణ :** ఉపాసనల ద్వారా దేవలోకాన్ని జయించాలనే కోరిక.

ఈ మూడు రకాల కోరికలు లేనివారు ఏషణారహితులు. ఇటువంటివారు బిక్షాటన చేస్తుంటారు. వీరే పరమహంస పరివ్రాజకులయిన సన్యాసులు, వీరిచే స్వస్వరూపమున అంగీకరించబడినది పరమేశ్వరి, వీరికి నిరంతర ధ్యానమున సాక్షాత్కరించి మోక్షమును ప్రసాదించునది.

**30. ఏలాసుగంధిచికురా :** ఏలకులవలె సుగంధము కలిగిన చికురములు కలది. ఏలకులవలె ఉన్న సువాసన ఏలాసుగంధము. అనగా ఎవరిచేతనూ కల్పించబడని సుగంధము. ఈ సుగంధము స్వతస్సిద్ధమే కాని కృత్రిమము కాదు. చికురములు అంటే వెంట్రుకలు. పరమేశ్వరి యొక్క కుంతలములు ఏలకుల వాసన వెదజల్లుతున్నాయి. సుగంధము కలది సుగంధి. ఆ దేవి స్వభావ సిద్ధమైన దివ్యపరిమళము కలిగిన సర్వాంగముల యొక్క సౌరభ్యము కలది.

**31. ఏనః కూటవినాశినీ :** పాపములను నశింపచేయునది. పాపములు అంటే సంచిత ప్రారబ్దము. ఈ రకమైన పాపములు అనుభవించుటచేతనే క్షయము కావాలంటే చాలా కష్టము. అందుచేత అటువంటి సంచిత పాపములను తత్త్వజ్ఞానము చేత వీటిని నశింపచేయునది. ఈ పాపాలు నశించాలంటే అనేక కోటి కల్పాలు వీటిని అనుభవించాలి.

| | | |
|---|---|---|
| 4,32,000 సం॥లు | - | కలియుగము |
| 8,64,000 సం॥లు | - | ద్వాపరయుగము |
| 12,96,000 సం॥లు | - | త్రేతాయుగము |
| 17,28,000 సం॥లు | - | కృతయుగము |
| ఈ నాలుగు యుగాలు | - | ఒక మహాయుగము |
| 7 మహాయుగాలు | - | ఒక మన్వంతరము |
| 14 మన్వంతరములు | - | ఒక కల్పము (బ్రహ్మకి ఒక పగలు) |

ఈ రకంగా అనేక కోట్ల కల్పాలు అనుభవిస్తే గాని ఈ పాపాలు నశించవు. బ్రహ్మజ్ఞానము కలవారికి ఈ పాపము అనుభవించకుండానే క్షయమవుతుంది. బ్రహ్మజ్ఞానులకు పాపకర్మలంటవు. శరీరమే లేని వారికి ప్రియాప్రియములుండవు. పాపములకు కారణము మాయ. అట్టి మాయను నశింపచేయునది పరమేశ్వరి.

**32. ఏకభోగా :** ఏకభోగము కలది. కామేశ్వరునితో మాత్రమే కలసి బైందవస్థానములో స్వస్వరూపానందము అనుభవించేది. అజ్ఞానము వలన వచ్చే ఫలితాలు కార్యకారణ రూపంలో ఉంటాయి. అభిన్నమైన వీటికి అధిష్ఠాన దేవత పరమేశ్వరి. ప్రపంచానికి గల కారణము, స్థితి, నాశము అనేవాటికి కారణము ఆమె. పరమేశ్వరుడు ఏకాకిగా ఆనందించలేడు కాబట్టి తానే ప్రకృతి (స్త్రీ) పురుషులుగా మారి పతి, పత్ని అయినాడు. దంపతుల మధ్య భేదములు ఇచ్ఛావశమున కలిగినవి. వాస్తవముగా వీరి స్వరూపాలు అభిన్నాలు. అందుకే ఈమె ఏకభోగా అనబడినది.

**3. ఏకరసా :** ఏకరసము అంటే అభిన్నమైన సామరస్యము. రసమును అనుభవించిన ఆత్మ ఆనందరూపమవుతుందని ఉపనిషద్వాక్యము. రసమును పొందియే అతడానందించు చున్నాడు. అని శ్రుతి వాక్యము. రసములలో ముఖ్యమైనది శృంగార రసము. ఇది ఆ పరమేశ్వరి యందున్నది. ఏకైకుడైన తన భర్త అయిన పరమేశ్వరుని యందు నిరతిశయమైన అనురాగము కలది. షడ్రసములలో ముఖ్యమైనది తీపి. మధుర సత్వగుణ ప్రధానమైనది.

**4. ఏకైశ్వర్యప్రదాయినీ :** ఏకమగు ఐశ్వర్యమునిచ్చునది. అంతర్యామిగా సకల జగత్తును శాసించువాడు ఈశ్వరుడు. సకల భూతాలలోను ఉండేది, అందరినీ నియమించేది ఆ పరమాత్మ. ఆయన చేత సృష్టించబడిన ప్రాణుల యొక్క పుట్టుక అజ్ఞానము. ఈ జీవులకు జాగ్రస్వప్న సుషుప్తులనబడే అవస్థలున్నాయి. బ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు జీవాత్మకూ పరమాత్మకూ భేదం లేదని తెలుస్తుంది. 'తత్త్వమసి', 'ఏకమేవా ద్వితీయం' అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. ఏకైకుడైన పరమేశ్వరుడే ఈఅనుభవాన్ని ఇస్తున్నాడు. పరమేశ్వరి నిరతిశయమయిన ఐశ్వర్యాన్ని, శ్రేయమైన ఫలాన్ని ఇస్తుంది. సర్వోత్కృష్టమైన సార్వభౌమాది అధికారాలు కూడా ఇస్తుంది. అందుకే ఆమె ఏకైశ్వర్య ప్రదాయిని అనబడింది.

**5. ఏకాతపత్రసామ్రాజ్యప్రదా :** ఏకచ్ఛత్రాధిపత్యము నిచ్చునట్టిది. దుఃఖములు మూడు కారణాలచే కలుగుతాయి. అవి ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవికములు. వీటి నుండి రక్షించేది. సర్వసంసార దుఃఖాలను ఉపశమింపచేయునది. అష్టకష్టములను తీర్చునది. ఈతి బాధలు తొలగించేది.

**అష్టకష్టాలు :**

| | | |
|---|---|---|
| 1. దాస్యము | 4. స్వయంకృషి | 7. అప్పులు చేయుట |
| 2. దరిద్రము | 5. యాచన | 8. ప్రమాణము చేయుట |
| 3. భార్య లేకపోవుట | 6. యాచకులకు లేదనుట | |

**ఈతిబాధలు :**

| | | |
|---|---|---|
| 1. అతివృష్టి | 3. శలభము | 5. నిజరాజుబాధ |
| 2. అనావృష్టి | 4. మూషికము | 6. పరరాజు బాధ |

ఈ రకమైన దుఃఖాలను ఉపశమింపచేసి ఆత్మజ్ఞానమునిచ్చునది. స్వస్వరూప జ్ఞానం కలిగినట్లైతే మళ్ళీ మోహాంధకారంలో పడడు. అజ్ఞానమే సకలదుఃఖాలకు కారణము. దీని నుండి రక్షించేది అద్వైత జ్ఞానము ఒక్కటే. ఈజ్ఞానమే ఏకాతపత్రము. దీనివలన కలిగే ఫలితమే సామ్రాజ్యము, చక్రవర్తిత్వము. జ్ఞానమనే సామ్రాజ్యానికి చక్రవర్తిత్వము ప్రసాదించునది.

**6. ఏకాంతపూజితా :** ఏకము అంటే అద్వితీయమైన శుద్ధతత్త్వము. దహరాకాశమున (హృదయాకాశమున) పూజింపబడునది. బ్రహ్మను అంతరముగా పూజింపగా ఉపనిషద్బ్రహ్మ తత్త్వము పర్యవసితమగుచున్నది. కాబట్టి ఈ నామము ఉపనిషతత్త్వమును తెలుపుతున్నది.

ఏకాంతప్రదేశంలో ధ్యానము చేయటమనేది యోగుల ధ్యేయము. కామేశ్వరునిచే ఏకాంతమందు స్త్రీ రూపమున పూజింపబడినది. సృష్టి ప్రారంభంలో బాహ్యపూజాక్రమంలో పరమేశ్వరునిచే పూజింపబడి సంతుష్టురాలైనది. ఏకాంతము అంటే ఒంటరిగా సాధకులచే పూజింపబడునది.

**37. ఏధమాన ప్రభా :** వృద్ధి పొందుచున్న కాంతి కలది. ప్రకాశమానమైన ఆ పరదేవత ననుసరించే సర్వము ప్రకాశిస్తున్నది.

**38. ఏజదనేక జగదీశ్వరీ :** ఏజత్ అనగా చలనము కలది, జీవించి ఉన్నది, అనేకానేక జగత్తులకు ఈశ్వరి. ప్రాణులతో నిండిఉన్న చతుర్దశ, భువనాలకు ఈశ్వరి. ప్రాణము గలిగిన అనేక జీవులు రకరకాల ఉపాధులతో ఉన్నారు. ఈ జీవులకు ప్రేరణ ఇచ్చేది ఆ పరమేశ్వరి. సుఖప్రాప్తికి, దుఃఖ పరిహారానికి ఉపాయములు తెలియచేసేది. అయితే చలనము లేని వస్తువులకు ఈ ఉపాయములు తెలియవు. అయినప్పటికీ అని కూడా నీరు త్రాగటం, గాలి వదలటము వంటి పనులు చేస్తాయి. ఈ రకంగా పరమేశ్వరి వాటియందు కూడా అంతర్యామిగా ఉన్నది. ఈ రకంగా జగత్తులోని ప్రాణులన్నింటికీ ప్రేరణ ఇస్తుంది. అందుకనే ఆమె జగదీశ్వరి అని చెప్పబడినది.

**39. ఏకవీరాదిసంసేవ్యా :** ఏకవీరులచే సేవించబడునది. ఏకవీరులు అంటే పురశ్చర్యాదులచే మంత్రదేవతా సాక్షాత్కారము పొందువారు. వీరు ధైర్యము, గాంభీర్యము మొదలైన గుణాలు కలిగి ఉంటారు. అట్టి ఏకవీరులచే సేవింపబడునది. భక్తులను అనుగ్రహించుట కోసమని దేవి సగుణాకృతి పొందుతుంది. అప్పుడు ఆమె చతుష్షష్టి కోటియోగినీ గణసేవిత. అనగా ప్రతి ఆవరణలోను 64 కోట్లమంది చొప్పున తొమ్మిది ఆవరణలలోనూ 756 కోట్ల మంది యోగినులతో సేవించబడుచున్నది. అటువంటి దేవత, మంత్రరూపంలో ఉపాసనీయ.

ఏకవీర అంటే రేణుకాదేవి, శ్యామలాదేవి మొదలయినవారు, వీరు ఉపాసకుల యొక్క కోర్కెలు తీరుస్తుంటారు.

అశ్యశ్రీ రేణుకాంబా మహామంత్రస్య । భార్గవ ఋషిః । పంక్తిఛందః । శ్రీ రేణుకాంబాదేవతా । క్లాంబీజం । క్లీంశక్తిః । క్రోం కీలకం । రేణుకాదేవతా అనుగ్రహ ప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః క్లామిత్యాది న్యాసః ।

**ధ్యానం :**

*ధ్యాయే శూలకపాల పాశమితరే ఖడ్గం క్వణం డిండిమం*
*బిభ్రాణాంకరపంకజైః త్రినయనాం నాగాష్ట భూషాన్వితామ్*
*నానాకోటి యుగాంత సూర్యసదృశీం నాసోజ్వల ద్భూషణాం*
*వక్షోలంబిత హారముద్రిత కరాం శ్రీ రేణుకామాశ్రయే ॥*

మంత్రం: క్లీం । నమోభగవతి రక్తపంచమీ రేణుకాదేవి హనహన పచపచ అఖిల జగన్మేవశం కురుకురు స్వాహా । క్లీం ॥

ఇదే విధంగా శ్యామలాదేవి. ఈమే పరమేశ్వరికి మంత్రిణి. ఉపాసనాక్రమంలో శ్యామలా మంత్రం ఏడు రకాలుగా ఉంటుంది. వీటిలో ఋషి ఛందస్సు కూడా వేరుగా ఉంటాయి. అవి.

| | మంత్రము | ఋషి | ఛందస్సు |
|---|---|---|---|
| 1. | రాజశ్యామలా | మతంగఋషి | పంక్తి |
| 2. | హసవతీశ్యామలా | మతంగఋషి | గాయత్రీ |
| 3. | శుకశ్యామలా | శుక మహర్షి | గాయత్రీ |
| 4. | శారికాశ్యామలా | శౌనకర్షి | జగతీ |
| 5. | వీణాశ్యామలా | నారదమహర్షి | గాయత్రీ |
| 6. | వేణు శ్యామలా | మతంగఋషి | గాయత్రీ |
| 7. | లఘుశ్యామలా | మతంగఋషి | నిచృద్గాయత్రీ |

మాతంగీం మోహనాంగీం మధుమదముదితాం ఘూర్ణ మానాక్షి యుగ్మాం
విద్యద్వక్త్రాం కదంబప్రసవ పరిలసద్వేణికామాత్త వీణాం
బింబోష్ఠీం రక్తవస్త్రాం మృగమదతిలకా మిందురేఖా వతంసాం
కర్ణోద్యచ్ఛంఖ పత్రాం కఠినకుచ భరాం నౌమి తాం శ్యామలాంబాం ॥

ఈ శక్తి దేవతలు తమ పీఠములందుండి సాధకుల కోర్కెలు తీరుస్తుంటారు. ఈ దేవత లందరూ పరమేశ్వరి యొక్క పరిచారికలే. అందుచేతనే 'ఏకవీరాది సంసేవ్యా' అని దేవి పిలవబడుతున్నది.

**40. ఏకప్రాభవశాలినీ :** ఏకమగు ప్రాభవముచే శోభించునట్టిది. ప్రాభవము అంటే ప్రభుత్వము, ప్రాధాన్యము అని అర్థము. ప్రజలను రక్షించటమనేది ప్రభువు యొక్క కర్తవ్యము, సాధారణము. ఇతరులకు ఇది సాధారణ లక్షణము కాదు. అలాగే అనితర ప్రాభవము కలిగినది ఆ పరదేవత.

ప్రాభవము అంటే ఈశ్వరతత్త్వము. జగత్తును సృష్టించినవాడు ఈశ్వరుడు. సృష్టించటమనేది ఒక్క పరమేశ్వరునికే సాధ్యము. అందుకే అతని ప్రాభవము ఏకైకము. సకల భూతములు విరాట్పురుషుని రూపమే. జగత్తును ఆవిష్కరించగలశక్తి కలది శాలిని. ఏకప్రాభవము అంటే ముఖ్య సార్వభౌమత్వము. లోకాలు సృష్టించేది పరమేశ్వరుడు, సర్వేశ్వరుడు, భూతాధిపతి, భూతపాలకుడు. అందరూ ఆయనే. అఖండ సచ్చిదానంద స్వరూపమైన పరదేవతను స్వస్వరూపంగా భావించాలి. అందుకే దేవి ఏకప్రాభవశాలినీ అనబడుచున్నది.

*ఈకారరూపిణీ శ్రీ ఈప్సితార్థ ప్రదాయినీ* 9
*ఈ దృగిత్య వినిర్దేశ్యా ఈశ్వరత్వ విధాయినీ*
*ఈశానాది బ్రహ్మమయీ ఈశిత్వాద్యష్టసిద్ధిదా ॥* 10

*ఈక్షిత్రీక్షణ సృంష్ట్యాండకోటీశ్వరీశ్వర వల్లభా*
*ఈడితాచేశ్వరార్ధాంగ శరీరేశాధి దేవతా* 11
*ఈశ్వరప్రేరణకరీ చేశతాండవసాక్షిణీ*
*ఈశ్వరోత్సంగ నిలయా చేతి బాధావినాశినీ* 12
*ఈహావిరహితా చేశశక్తి రీషత్ స్మితాననా*

**41. ఈకారరూపా :** ఈ కారమే రూపముగా గలది. పంచదశీ మహామంత్రంలోని మూడవ అక్షరము దేని స్వరూపము.

**42. ఈశిత్రీ :** (ఈశ్వరి) కోరికలను కలిగించేది. సకల జగత్తుకూ ప్రేరణ ఇచ్చేది. ఇచ్ఛతి అంటే కోరికను కలిగించేది. ఈష్టే అంటే ఈశ్వరత్వము కలిగించేది. ఈ రెండింటికీ కారణము ఈమెయే కాబట్టి ఈమె సర్వప్రేరిత.

**43. ఈప్సితార్థ ప్రదాయిని :** కోరిన అర్థములనిచ్చునది. అర్థింపబడునవి అర్థములు. ఈప్సితములు అంటే పొందగోరినవి. మనము అభిలషించు అభ్యుదయ నిశ్రేయస్సులు ఈప్సితార్థములు. వీటిని ప్రసాదించునది దేవి. కర్మలను ఆచరించినట్లైతే పుణ్యము వస్తుంది, భవిష్యత్తులో ఇది మంచి ఫలితాన్ని ఇస్తుంది అని ఒకవాదము. ఇది సరికాదు. కర్మచేయుట వలన పుణ్యము లేక అదృష్టము దానంతట అదిరాదు. రాజభటులు తమ శక్తియుక్తులచే అద్భుతాలు సాధిస్తే రాజుకు సంతోషం కలిగి వారికి బహుమతులు ఇస్తాడు. అలాగే జీవులు కర్మలనాచరించటం వలన కర్మాధ్యక్షుడైన పరమేశ్వరుడు కర్మలను పరిశీలించి వాటి పాపపుణ్యాలకు అనుగుణంగా ఫలితాలిస్తాడు. ఈ రకంగా పరమేశ్వరుడే వారిలో కోరికలు కలిగించి, తదనుగుణంగా కర్మలు చేయించి, ఫలాన్ని ఇస్తున్నాడు. ఈప్సిత అంటే జిజ్ఞాసిత. తెలుసుకొనాలనే కోరిక. ఆత్మ జ్ఞానాన్ని ప్రతిపాదించే వేదాంత వాక్యములు విని, మననము చేసి జిజ్ఞాసతో సాధకులు ప్రార్థించగా వారికి మోక్షమునిచ్చేది పరమేశ్వరి.

**44. ఈదృగిత్యవినిర్దేశ్యా :** ఈ విధమైనదని నిర్దేశించటానికి వీలు కానిది. ఏదైనా వస్తువును గురించి చెప్పాలంటే దాని లక్షణాలను, ఆకారాన్ని, పరిమాణాన్ని బట్టి ఆ వస్తువు యొక్క స్వభావము, ధర్మములను వివరించటానికి వీలున్నది. పరబ్రహ్మ నిరుకారుడు, నిర్గుణ స్వరూపుడు. ఇంద్రియాలకు గోచరించడు. ఆ పరబ్రహ్మ యొక్క విమర్శాంశయే శక్తి స్వరూపము. ఆమె ఇంద్రియాలకు గోచరించదు. అందుచేత ఆమె యొక్క స్వరూప స్వభావాలను వివరించటానికి వీలు లేదు. వేదాలకు చివరి భాగమైన ఉపనిషత్తులు ఏ ఇతర ప్రమాణాలపైనా ఆధారపడి ఉండవు. అలాగే పరమేశ్వరి తత్త్వాన్ని వివరించటానికి వేదాలు, ఉపనిషత్తులే ప్రమాణము.

**45. ఈశ్వరత్వ ప్రదాయినీ :** ఈశ్వరత్వమును కలిగి ఉన్నట్టిది. ఈశ్వరత్వము అంటే ఈశ్వరుని భావము. ఈశ్వరునితో అభిన్నమైనది. ఈ ఐక్యతను వ్యక్తము చేసేది పరమేశ్వరి. మాయకు రెండు శక్తులున్నాయి. అవి. 1. ఆవరణము 2) విక్షేపము. వీటివలన కలిగేటటువంటి అజ్ఞానమును పోగొట్టి ఈశ్వరత్వమును కలుగచేయునది. ఈ మాయ వలన ఈశ్వరుడు వేరు, జీవుడు వేరు అనే భ్రాంతి కలుగుతుంది. అటువంటి భ్రమను పోగొట్టి జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయాన్ని తెలియచేస్తుంది. ప్రాణి తన కర్మ ఫలితాన్ని బట్టి సుఖదుఃఖాలు, కష్ట సుఖాలు అనుభవిస్తాడు. విద్యకు, ధనానికీ కూడా అధిపతి ఆ పరమేశ్వరియే. అదే ఈశ్వరత్వము. ప్రాణుల కర్మలననుసరించి ఫలితాన్ని ఇస్తుంది. అందుచేతనే పరమేశ్వరి 'ఈశ్వరత్వ ప్రదాయినీ' అనబడింది.

**46. ఈశానాది బ్రహ్మమయీ :** ఈశానుడు మొదలైన పంచబ్రహ్మల స్వరూపము కలది. పరమేశ్వరి పంచబ్రహ్మ స్వరూపిణి. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మహేశ్వరుడు, సదాశివుడు అనబడేవారు పంచబ్రహ్మలు. వీరి యొక్క స్వరూపం కలది పరమేశ్వరి. ఈ పంచబ్రహ్మల యొక్క మంత్రాలే సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానాదులు. వీరికి నేను అనే బుద్ధి ఉన్నది. ఆ పరమేశ్వరి వీరియందు అంతర్లీనముగా ఉండి, బుద్ధిని ప్రేరేపించుచున్నది. అందుచేతనే ఆమె 'ఈశానాది బ్రహ్మమయీ' అనబడుచున్నది.

**47. ఈశిత్వాద్యష్టసిద్ధిదా :** ఈశిత్వము మొదలైన అష్టసిద్ధులను ఇచ్చునది. సిద్ధి అనగా వాంఛితము ఈడేరుట. అనుగ్రహప్రాప్తి. మానవుడు అతీతమైన శక్తుల యొక్క అనుగ్రహం సంపాదించినట్లైతే ఆశక్తి సిద్ధించింది అంటారు.

జగత్తులో అపూర్వమైన శక్తులు ఎనిమిది ఉన్నాయి. వాటినే అష్టసిద్ధులు అంటారు. అవి

1. అణిమ - శరీరాన్ని చిన్నదిగా చేయటం
2. మహిమ - శరీరాన్ని అతిపెద్దదిగా చేయటం ఇదే విరాడ్రూపము. (విశ్వరూపము)
3. గరిమ - శరీరము బరువు అతి ఎక్కువగా పెంచటము. (తులాభారం సమయంలో శ్రీ కృష్ణుడు చేసినది)
4. లఘిమ - శరీరాన్ని అతితేలికగా చేయటం (తులాభార సమయంలో తులసిదళానికి శ్రీ కృష్ణుడు సరితూగటం)
5. ప్రాప్తి - కావలసిన వస్తువులను దొరికించుకోవటము
6. ప్రాకామ్యము - ఆకాశ సంచారము. (నారదుడు ఎల్లప్పుడు తిరిగేది కామగమనము)
7. ఈశిత్వము - ఈ లోకంలో సర్వానికీ అధికారిగా ఉండటం.
8. వశిత్వము - సమస్త లోకాలను వశపరచుకోవటము.

ఈ రకంగా మానవుల కోరికలు తీరటానికి అనేక రకాల సిద్ధులున్నాయి. వాటిలో ఈశిత్వ సిద్ధి ఒకటి. ఈ శక్తులు, సిద్ధులు అన్నీ మనకు సంక్రమింపచేసేది ఆ పరమేశ్వరి. అందుచేతనే ఆమెకు 'అష్టసిద్ధిదా' అని పేరు.

**48. ఈక్షిత్రీ :** ఉదాసీన స్థితిలో సాక్షిగా ఉన్న పరమేశ్వరి. పరమేశ్వరి ఉదాసీన జ్ఞానస్వరూప అని చెప్పబడుచున్నది.

**49. ఈక్షణ సృష్టాండకోటి :** కేవలము కంటిచూపుతోనే అనేక కోట్ల బ్రహ్మాండములను సృష్టించునది. బ్రహ్మాండములు చాలా ఉన్నాయి. అవి లెక్కకు మించి ఉన్నాయి. ఇక్కడ కోటి అనే శబ్దము సంఖ్యావాచకము కాదు. అనంతము, లెక్కలేనన్ని అనే అర్థంలో వాడబడింది. సంసారమండలము చాలా పురాతనమైనది. అందుచే భవిష్యత్కార్య చరణాలోచనతో ఆ దేవి లెక్కలేనన్ని బ్రహ్మాండాలను సృష్టిస్తోంది. మొట్టమొదటగా ఆత్మ ఒక్కటే ఉన్నది. అప్పుడు ఆ ఆత్మ లోకాలను సృష్టించాలనుకున్నది. ఆ తరువాత ఈ లోకాలను సృష్టించింది. ఆ పరమేశ్వరి ఇతరమైన ఏ ఆపేక్షా లేకుండానే ఈజగత్తును సృష్టిస్తోంది. సాలీడు తన నోటి నుంచి దారాన్ని ఏ విధంగా సృష్టిస్తోందో అలాగే ఆ దేవి ఈ సృష్టిని చేస్తున్నది. బాహ్యకారణాపేక్ష లేకుండా, ఆ పరబ్రహ్మ స్వరూపము తనకన్నా వేరు కాదు అని తెలియచేస్తూ, ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ కూడా తానే అయి సాలెపురుగువలె ఆ దేవి బ్రహ్మాండాలను సృష్టి చేస్తున్నది.

**50. ఈశ్వరవల్లభా :** ఈమె పేరు కామేశ్వరి. ఈమె భర్త కామేశ్వరుడు. అతడే ఈశ్వరుడని పిలువబడుతున్నాడు. ఈశ్వరుడు అంటే త్రిమూర్తులలోనివాడు కాదు. ఈ ఈశ్వరుడే పరబ్రహ్మ. అతడే కామేశ్వరుడు. అందుచేతనే పరబ్రహ్మ బొమ్మయితే పరమేశ్వరి బొరుసు. వారే శివశక్తులు. వారిద్దరికీ భేదము లేదు.

**51. ఈడితా :** స్తుతించబడినది. వేదాంత వాక్యములు అనబడే స్తుతులచే స్తోత్రము చేయబడునది. బ్రహ్మవేత్తల యొక్క మహిమ కర్మలచే వృద్ధి పొందటంగాని, క్షీణించటంగాని జరుగదు. తత్త్వ విచారము వల్లనే జరుగుతుంది. అందుకనే పరమేశ్వరి వేదాంత వాక్యములచే స్తుతించబడుతుంది.

**52. ఈశ్వరార్ధాంగశరీరా :** పరమేశ్వరి, ఈశ్వరుని శరీరములో సగభాగమై ఉన్నది. పరమేశ్వరుడు పూర్ణబిందు స్వరూపుడు. సృష్టి ప్రారంభం కాకముందు పూర్ణబిందువుగా ఉన్న పరమేశ్వరుడు అనుత్తరానందం కోసం ఈ సృష్టి చేయదలచినవాడై తనను తాను రెండు భాగాలుగా విభజించుకున్నాడు. ఆ భాగాలే ప్రకాశాంశ, విమర్శాంశలు. ప్రకాశాంశ పరబ్రహ్మ కాగా విమర్శాంశ మాయ. వీరే శివశక్తులు. ఆకారాన్ని నీడ అనుసరించి ఉన్నట్లే పరమేశ్వరుని మాయ అనుసరించి ఉంటుంది. ఆ మాయే పరమేశ్వరి. పరమేశ్వరుడు బింబము అయితే పరమేశ్వరి ప్రతిబింబము. ఒకే నాణానికి వీరిద్దరూ బొమ్మబొరుసు. ఎవరూ అధికులు కాదు. ఇద్దరూ సమానులే. పరమేశ్వరి, పరమేశ్వరుని ఎడమభాగంలో ఉంటుంది అని చెప్పటం తప్పు. ఆవిడ ఈశ్వరుని దేహంలో సగమయి ఉంటుంది.

టే ప్రతి అణువులోనూ ఇద్దరూ చెరి సగం ఉంటారు. అందుచేతనే ఆ దేవి 'ఈశ్వరార్ధాంగ
రా' అని చెప్పబడుతోంది.

. **ఈశాధిదేవతా :** ఈశుడు అంటే పరమేశ్వరుడు, జీవుడు అని అర్థం. జీవునకు అధి దేవత. యా మయమైన ఈ జగత్తులో పుట్టిన జీవుడికి ఉపాసింపతగిన దేవత. జీవాత్మ యొక్క ్యం పరమాత్మలో లీనమవటము. అందుచేత జీవుడు ఎప్పుడూ పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తాడు, ాధిస్తాడు. కాబట్టి ఆ పరమేశ్వరి ఈశాధిదేవతా అని చెప్పబడుతోంది.

. **ఈశ్వర ప్రేరణకరీ :** పరమేశ్వరుడు బింబమనీ, పరమేశ్వరి ప్రతిబింబమనీ ఇంతకుముందే ప్పటం జరిగింది. ఈ జగత్తులోని ప్రతి వస్తువు అంటే, ప్రాణమున్నవి, ప్రాణము వి,చలనమున్నవి, చలనము లేనివి, స్థూలరూపములు, సూక్ష్మరూపములు అన్నీ పరబ్రహ్మ రూపమే. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నక్షత్రాలు, భూమి, ఆకాశం, పర్వతాలు, లోయలు, వులు, కొండలు, ఎడారులు, సముద్రాలు ఒకటేమిటి ? కంటికి కనిపించేవి, కనిపించనివి అన్నీ పరమాత్మ స్వరూపమే. అటువంటి ఈశ్వర స్వరూపమైన జగత్తుకు ప్రేరణ ఆ పరమేశ్వరి గుణాత్మక. పరబ్రహ్మయొక్క ఇచ్ఛానుసారము ఈ సృష్టి కార్యక్రమాన్ని నిర్వహిస్తూ ఉంటుంది.

. **ఈశతాండవసాక్షిణీ :** ఈశ్వరుని యొక్క తాండవమునకు ఆ దేవి సాక్షి అని చెప్పబడుతోంది. కర భగవత్పాదులవారు సౌందర్యలహరిలోని 41వ శ్లోకంలో చెప్పినట్లుగా ఆధారచక్రంలో శ్వరుడు తాండవంచేస్తుండగా, పరమేశ్వరి శృంగారముతో కూడిన నాట్యము చేస్తూ ఉంటుంది. స్థితిలో ఈశ్వరుని యొక్క తాండవానికి సాక్షి ఆ పరమేశ్వరి. ఆధార స్వాధిష్ఠానాలు అంధకార ంధురాలు. అక్కడ కౌళమతం వారికే అర్చనాధికారమున్నది. సమయ మతమువారు హస్రారంలోనే దేవిని అర్చిస్తారు. కౌళాచారుల ప్రకారము ఎర్రని శరీరచ్ఛాయతో,మత్తెక్కిన కన్నులు ిగి ఈ జగత్తుకు తల్లితండ్రులని చెప్పబడే శివాశివులు ఇద్దరూ భైరవీభైరవుడు అనే పేర్లతో ధారచక్రంలో లాస్య, తాండవం చేస్తూ సృష్టి కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు. అటువంటి ిలో ఈశ్వరుని తాండవానికి ఆ పరమేశ్వరియే సాక్షీభూతురాలు.

. **ఈశ్వరోత్సంగనిలయా :** తన భర్త అయిన కామేశ్వరుని యొక్క అంక భాగము మీద సీనురాలైనది.

. **ఈతిబాధావినాశినీ :** లోకంలో మానవుడు అనేక రకాలయిన కష్టాలు అనుభవిస్తాడు. వాటిలో ఈతిబాధలు కొన్ని. ఇవి ప్రకృతిలో కలిగే ఉపద్రవాల వలన గాని, జంతువుల వలనగాని, తరులవలన గాని కలుగుతాయి. ఇవి ఆరు రకాలు.

| | | |
|---|---|---|
| 1. అతివృష్టి | - | వర్షాలు ఎక్కువగా పడటం |
| 2. అనావృష్టి | - | వర్షాలు లేకపోవటం |
| 3. శలభము | - | మిడుతలవల్ల పంట నాశనము |

4. మూషికము - ఎలుకల వల్ల పంట నాశనము

5. శుకము - పక్షుల వల్ల పంట నాశనము

6. రాజులు - వీరు రెండు రకాలు

(ఎ) నిజరాజు - ఎక్కువ పన్నులు వసూలు చేస్తాడు

(బి) పరరాజు - దండయాత్రలు చేసి ధనాన్ని కొల్లగొడతాడు.

ఈ బాధల వల్ల ఆరు కాలాలు శ్రమించిన రైతు చేతికి పుట్టెడు ధాన్యం కూడా రాదు. ఆ పరదేవతను ధ్యానించినట్లైతే ఈ బాధలు నశిస్తాయి.

**58. ఈహావిరహితా :** కోరికలు రెండు రకాలు : 1) దొరికిన దానిని తృప్తిగా అనుభవించటము. 2) మనకు దొరకనిదాని కోసం ప్రయత్నించి సాధించటము. సాధారణంగా రెండవ దానికే మానవులు ప్రయత్నిస్తారు. దొరికిన దాన్ని అనుభవించటం కన్న దొరకనిదాన్ని సాధించటంలోనే ఆనందం ఎక్కువ ఉంటుంది. ఈ రకమైన కోరికను 'ఈహ' అంటారు. ఆ పరమేశ్వరికి అటువంటి కోర్కెలు ఉండవు. అందుచేతనే ఆమె ఈహావిరహితా అని చెప్పబడుతోంది.

**59. ఈశశక్తి :** ఈశ్వరుని యొక్క శక్తి. అంటే సర్వజ్ఞత్వాది స్వరూప సామర్ధ్యము ఈమెకున్నది.

**60. ఈషత్ స్మితాననా :** ఆ దేవి ముఖమండలము ఎప్పుడూ చిరునవ్వుతో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆమె ప్రసన్నవదన. పరమానందమే కాని దుఃఖమనే మాటకు ఆమె దగ్గర తావు లేదు.

***లకారరూపా లలితా లక్ష్మీ వాణీనిషేవితా*** *13*
***లాకినీ లలనారూపా లసద్దాడిమ పాటలా***
***లలంతికాలసత్ఫాలా లలాట నయనార్చితా*** *14*
***లక్షణోజ్వల దివ్యాంగీ లక్ష్య కోట్యండనాయికా***
***లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః*** *15*
***లలామరాజదలికా లంబముక్తా లతాంచితా***
***లంబోదర ప్రసూర్లభ్యా లజ్జాఢ్యా లయవర్జితా*** *16*

**61. లకార రూపా:** శ్రీవిద్యకు ప్రధానమైనది పంచదశీ మహామంత్రము. దీనిలోని నాల్గవ అక్షరము లకారము. ఈ అక్షరముచేత గుర్తించబడేది. అందుచేతనే ఆమె లకార రూప అనబడింది.

**62. లలితా :** లలితము అంటే సుందరము. ముల్లోకాలలోనూ సాటిలేని సౌందర్యము కలది. ఆమె సౌందర్యము అద్వితీయము. దేనితోనూ పోల్చటానికి వీలు లేదు.

**63. లక్ష్మీవాణీ నిషేవితా :** సిరిసంపదలకు అధిదేవత అయిన లక్ష్మీదేవి, సంగీతము, సాహిత్యము, జ్ఞానములకు అధిదేవత అయిన సరస్వతీ దేవి ఎల్లప్పుడూ ఆమెను సేవిస్తూ ఆమె ఆజ్ఞల కోసం ఎదురుచూస్తూ ఉంటారు.

**64. లాకినీ :** అనృతము, జడత్వము, దుఃఖ రూపము అయిన జగత్తుకు కారణమయికూడా, ఆ జగత్తు కన్న భిన్నమైన రూపము కలది. నాభిస్థానంలో పది దళాలతో ఉన్న చక్రాన్ని మణిపూరము అంటారు. ఇక్కడ 'వయోవస్థా వివర్జితా' అనబడు దేవత ఉంటుంది. ఈమెకు బాల్యము, యవ్వనము, కౌమారము మొదలైన శారీరక అవస్థలు లేవు. ఎల్లప్పుడు పదహారు సంవత్సరముల ప్రాయంలోనే ఉంటుంది. నిత్యయవ్వనవతి. ఈమె ఆర్తులు, అర్థార్తులు, జిజ్ఞాసులు మొదలైన అన్ని రకాల భక్తులకు సుఖమునిస్తుంది. ఈ దేవత బీజము, న్యాసము, శక్తి, మంత్రము అన్నీ లకార సంకేతాలు. అందుచేత ఈమె 'లాకినీ' అని పిలువబడుతుంది.

**65. లలనా రూపా :** రూపము అంటే ఆకారము, సౌందర్యము. కళ్ళకు కనిపించే సహజస్థితి. ఏదైనా ఒక వస్తువును గుర్తుకు తెచ్చుకోవాలంటే దాని యొక్క ఆకారము, సహజస్థితి. గుర్తుంచుకోవాలి. అదే దాని రూపము. లలన అంటే స్త్రీ. మొత్తం మీద లలన రూపా అంటే స్త్రీ రూపము. అనగా ఆ పరమేశ్వరి స్త్రీ రూపంలో ఉంటుంది.

**66. లసద్దాడిమపాటలా :** దాడిమ అంటే వికసించిన దానిమ్మపువ్వు. అప్పుడే వికసించిన దానిమ్మ పూవు ఎరుపు, తెలుపు కలిసిన రంగులో ఉంటుంది. అదే పాటల వర్ణము అంటారు. లలితా సహస్రంలోని 561వ నామంలో దేవి 'దాడిమీ కుసుమ ప్రభా' అని చెప్పబడింది. దాడిమము అంటే మోదుగ చెట్టు, దానిమ్మ చెట్టు అని అర్థము. దానిమ్మచెట్లలో రెండు రకాలుంటాయి. ఒకటి కాయలు కాచేది. రెండవది కేవలం పూలు మాత్రమే పూచేది. దీన్ని 'పువ్వు దానిమ్మ' అంటారు. ఆ పూలు పాటల వర్ణంలో ఉంటాయి. అలాగే 766 వ నామంలో 'జపా పుష్పనిభాకృతిః' అనీ, 964లో 'బంధూక కుసుమ ప్రఖ్యా' అని చెప్పటం జరిగింది. వీటి అర్థం ఆ దేవి పాటల వర్ణంలో ఉంటుంది అని.

**67. లలంతికాలసత్ఫాలా :** లలంతికా భరణముచే ప్రకాశించుచున్న ఫాలము కలది. లలంతిక అంటే లలాటము మధ్య ధరించే ఆభరణము. దీనికి చుట్టూ ముత్యాలుంటాయి. మధ్యలో నవరత్నాలుంటాయి. ఇది పాపిటబొట్టు కావచ్చు.

**68. లలాటనయనార్చితా :** ఇక్కడ లలాటము అంటే కనుబొమల మధ్య భాగము అని అర్థము. లలాటమున నయనము అంటే కన్ను ఉండేవారు. జ్ఞానులు, మోక్షాన్ని కోరేవారు. జీవాత్మను పరమాత్మతో లయం చెయ్యాలనుకుని సాధన చేసేవారు. అట్టి జ్ఞానులచేత, ముముక్షువులచేత అర్చింపబడునది.

**69. లక్షణోజ్వల దివ్యాంగీ :** శుభలక్షణములచే ప్రకాశించుచున్న దివ్యమైన అంగములు కలది. స్వరూప లక్షణము, తటస్థ లక్షణము అనువానితో ప్రకాశించు రూపము కలది. సాముద్రిక శాస్త్రమున చెప్పిన శుభలక్షణములతో ప్రకాశించునది.

**70. లక్ష కోట్యండనాయికా :** లక్షలు, కోట్లు అంటే అనంతమైన, లెక్కలేనన్ని బ్రహ్మాండములకు ఈమె నాయిక. ఈ జగత్తులో లెక్కలేనన్ని బ్రహ్మాండాలున్నాయి. ఇన్ని బ్రహ్మాండాలు ఎక్కడ ఉన్నాయి అంటే భూత, భవిష్య వర్తమాన కాలాలననుసరించి ఈ మాట చెప్పటం జరిగింది. విరాడ్రూపమే ఈ బ్రహ్మాండము యొక్క సమిష్టి రూపము. వీటన్నింటికీ ఆ పరమేశ్వరియే నాయిక.

**71. లక్ష్యార్థా :** ఒక వాక్యానికి వాచ్యార్థం కుదరనట్లైతే, దాన్ని గురించి సరిగ్గా తెలుసుకోనుటకు లక్షణను తీసుకోవాలి. ఇది మూడు రకాలు.

1) జహలక్షణ 2) అజహ లక్షణ 3) దహదజహల్లక్షణ. అలాగే 1) అతద్వ్యా వృత్తి లక్షణము. 2) తటస్థ లక్షణము 3) స్వరూప లక్షణము. దీనినే లక్షణ త్రయము అంటారు. ఇట్టి అర్థమే ఆమె స్వరూపము. యోగశాస్త్రంలో 1) బహిర్భూమిక, 2) అంతర్భూమిక 3) అధోభూమిక 4) ఊర్ధ్వభూమిక అనేవి ప్రదేశ విశేష రూపంతో ఉన్నాయి. ఈ భూమికలలో మనోవాంఛలకు విషయ విశేషములుగా గాని, నిర్గుణముగాగాని మనోవిలయ రూపంలో సాక్షాత్కరించే చైతన్యాన్ని లక్ష్యమంటారు. మనోవలయమనేది హఠయోగము, రాజయోగముల ద్వారా లభిస్తుంది. గురువు నుంచి యాచింపబడే దాన్ని అర్థమంటారు. ఇది చిత్స్వరూపమైన పరమానందము. ఆమెకు ఈ రూపమున్నది. కాబట్టి ఆమె భక్తులకు కూడా ఈ రూపమే వస్తుంది.

**72. లక్షణాగమ్యా :** ఒక్కొక్కసారి వాచ్యార్థము చెప్పటానికి వీలు కాదు. అటువంటప్పుడు ఇంకా అర్థం చెప్పవలసి ఉంటుంది. ఉదాహరణకు నది మీద ఇల్లు. లేక నది మీద గొల్లపల్లె. అన్నాము అనుకోండి. వాచ్యార్థము చూసినట్లైతే నది మీద ఇల్లుగాని, గొల్లపల్లెగాని ఉండవు. అవి నదీ తీరంలోనే ఉంటాయి. ఇది లక్షణ ద్వారా వచ్చిన అర్థము. లక్షణాగమ్య అంటే లక్షణము చేత ఆగమ్య. లక్షణ అంటే శక్యార్థమందు వాచక పదమునకు సంబంధించిన అన్యపదార్థమును జ్ఞాపకము చేయునట్టి శబ్దవృత్తి. వాచ్యార్థమే శక్యార్థము. ఇటువంటి అర్థాలతో పరబ్రహ్మ పరిమితం కాదు. ఇక్కడ లక్షణా, అగమ్యా అని చెప్పాలి. అంటే లక్ష్యార్థంతో కూడా పరమేశ్వరి యొక్క స్వరూప జ్ఞానాన్ని గ్రహించలేము.

**73. లబ్ధకామా :** లబ్దములగు కామములు కలది. కామించబడునవి కామములు. మానవుడు కోరుకునేది సుఖము, ఆనందము. ఇవి ఐహికము, ఆముష్మికము అని రెండు రకాలు. సుఖము, ఆనందము అనేవి రెండూ ఆమె దగ్గర ఎప్పుడూ ఉంటాయి.

**74. లతాతనుః :** లత వంటి శరీరము కలది. కల్పలత మొదలైన తీగలు దైవత్వాన్ని పొంది ఉన్నాయి. అవి మనం కోరిన కోరికలన్నీ తీరుస్తాయి. ఇది లోక ప్రసిద్ధము. ఆ దేవి ఇటువంటి తీగలలాగా సుకుమారమైన శరీరము కలది కావున 'లతాతనుః' అని అన్నారు.

**75. లలామరాజదలికా :** కస్తూరీ తిలకముతో శోభిల్లుతున్న లలాటము కలది. లలోలము అంటే కస్తూరీ తిలకము లేదా కస్తూరి పత్రము. రాజత్ - అత్యంత శోభాయమానంగా, ఆళికము - లలాటము కలది.

. **లంబముక్తా లతాంచితా :** వ్రేలాడుచున్న ముత్యాల హారములచే ఒప్పుచున్నది. నవర్ణతముల
రిగిన ముత్యాలహారములు సర్వావయవములందు వ్రేలాడుచున్నవి. కిరీటము దగ్గర నుండి
ం ప్రదేశము వరకు చెవి, ముక్కు, భుజములు మొదలైన ప్రతి అవయవం దగ్గరా ముత్యాలచేర్లు
ాడుతున్నాయి. గజాసుర సంహారం చేసినతరువాత ఆ ఏనుగు తలలో ఉన్న చిత్రవిచిత్ర
ంతులు గల ముత్యాలను ఈశ్వరుడు ఆ దేవికి బహూకరించాడు. వాటిని దండగా గుచ్చి
మె మెడను ధరించింది. అని సౌందర్యలహరిలో చెప్పబడింది.

. **లంబోదర ప్రసూః :** లంబోదరుని తల్లి. భండాసురునితో యుద్ధం జరుగుతున్నప్పుడు, అతని
దరుడైన విశుక్రుడు దేవి సైన్యం మధ్యన జయ విఘ్న యంత్రాన్ని స్థాపించాడు. ఆ యంత్ర
భావంతో దేవి సేన అంతా నిద్రావస్థలోకి జారిపోయింది. అప్పుడు ఆ దేవి సంకల్పమాత్రం చేత
హాగణపతిని సృష్టించింది. ఆ గణపతి రాక్షస యంత్రాన్ని నాశనం చేశాడు. లలితా సహస్రంలో
ఁ విషయం చెబుతూ 'కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా' అని చెప్పటం జరిగింది.

. **లభ్యా :** పొందదగినది. సంసారదశలోఅజ్ఞానము ఉంటుంది. అందుచేత పరమేశ్వరి మనకు
కాశవంతంగా సాక్షాత్కరించదు. శ్రవణము, మననము, ధ్యానము మొదలైన వాటి ద్వారానే
నము కలిగి ఈమె రూపం గోచరిస్తుంది. మనకు లబ్ధమైన దానినే మళ్ళీ మనం పొందినట్లు
విస్తున్నాము. ఎలాగంటే వ్రేలుకు ఉంగరం పెట్టుకుని, దానికోసం ఇల్లంతా వెతికి చివరకు
మ్మయ్య, ఇక్కడే ఉంది. అనుకుంటున్నట్లుగా ఆ దేవి దర్శనము మనం పొందగలుగుతున్నాము.

. **లజ్జాఢ్యా :** లజ్జచే శోభించుచున్నది. అంతఃకరణ ధర్మాలన్నింటికి లజ్జ అనేది ఉపలక్షణము.
జ్జ కలిగి ఉండుటచే ఆకారవతి అని అర్థము. తిరోదానాదుల (మేలిముసుగు) ద్వారా అంతర్ధానమై
రములనిచ్చునది.

ం. **లయవర్జితా :** లయము లేనిది. ఆత్మకు నాశనము లేదు. ఆమె సృష్టి స్థితి లయకారిణి. ఆది
ధ్యాంత రహిత. ఆమె శాశ్వత.

హ్రీంకార రూపా హ్రీంకార నిలయా హ్రీం పదప్రియా
హ్రీంకార బీజా హ్రీంకార మంత్రా హ్రీంకార లక్షణా 17

హ్రీంకార జపసుప్రీతా హ్రీంమతిః హ్రీం విభూషణా
హ్రీంశీలా హ్రీం పదారాధ్యా హ్రీంగర్భా హ్రీంపదాభిదా 18

హ్రీంకార వాచ్యా హ్రీంకార పూజ్యా హ్రీంకారపీఠికా
హ్రీంకార వేద్యా హ్రీంకార చింత్యా హ్రీం హ్రీం శరీరిణీ 19

. **హ్రీంకారరూపా :** పంచదశీ మహామంత్రము వాగ్భవకూటమి, కామరాజకూటమి,
కూటమి మూడు కూటములుగా ఉన్నది. దీనిలో ప్రతికూటమి చివర హ్రీంకారమున్నది.

ఇంతవరకు మొదటి కూటమిలో ఉన్న నాలుగు బీజాక్షరాలు వివరించటం జరిగింది. ఆ బీజాక్షరాల చివర ఐదవ బీజముగా హ్రీంకారమున్నది. హ్రీంకారము మాయా బీజము. పూర్తి మంత్రాన్ని కాకుండా కవేలం ఈ ఒక్క బీజాన్ని మాత్రమే జపించి తరించిన మహానుభావులు అనేకమంది ఉన్నారు. అందుకనే ఆ పరమేశ్వరి హ్రీంకార రూపంలో ఉంటుంది అని చెప్పబడింది.

**82. హ్రీంకార నిలయా :** హ్రీంకారము నందే ఆమె నివశిస్తుంది. హ్రీంకారమే ఆమె నివాసము. అంతమాత్రం చేత హ్రీంకారమే ఆమె కాదు. కాని ఆమె కటాక్షము పొందాలంటే ఆ యింటి ఛాయలకు పోగలిగినా చాలు. ఆ పరమేశ్వరి నెలఉండే హ్రీంకారాన్ని జపించినా చాలును.

**83. హ్రీంపదప్రియా :** హ్రీం బీజము నందు ప్రీతి గలది. హ్రీం పదము అంటే హ్రీంకారము. ఈ బీజాక్షరముచేతనే ఆమె తెలియబడుచున్నది. లేక పొందబడుచున్నది. దేనివలన విషయము తెలుసు కొనగలుగుచున్నామో అది పదము. హ్రీంకారము మూల మంత్రంలోని భాగము లేదా అవయవము. అందుచేత ఆ దేవతను ప్రకాశింపచేసే శక్తి ఆ బీజానికి ఉన్నది. హకారము, రేఫ, ఈకారము అనుస్వారముల యొక్క కలయికతో హ్రీంకారమేర్పడింది. కాబట్టి అక్షరముల సముదాయమే పదము. అందుచేతనే హ్రీంకారము ఒకే అక్షరముగా కనిపించినప్పటికీ ఇది నాలుగు అక్షరముల సముదాయము. అందుకే దీనిని పదము అని ప్రయోగించటం జరిగింది. ఈ బీజాన్ని పురశ్చరణ చేసినట్లైతే సకల పురుషార్ధాలూ లభిస్తాయి.

**84. హ్రీంకార బీజా :** మూలమంత్రంలో హ్రీంకారము ఒక బీజము. దేవతలకు జ్ఞాపకము చేసే అక్షరాన్ని బీజము అంటారు. ఈ మాయా బీజము వటవృక్షములాంటిది. వృక్షానికి కారణం విత్తనము దానినుంచే మొలక వచ్చి పెద్దగా వ్యాపిస్తుంది. అలాగే దేవత సాక్షాత్కారం కావాలంటే బీజాక్షరాలు పురశ్చరణ చెయ్యాలి. దానివలన శక్తి ఉద్భవించి నామరూపాత్మకమైన దేవత సాక్షాత్కరిస్తుంది.

**85. హ్రీంకారమంత్రా :** హ్రీంకారమే మంత్రముగా గలది. హ్రీంకారమననముచే రక్షించునది. హ్రీంకారమే సమగ్రమైన మంత్రము. అది లేకపోతే మూలమంత్రంలోని మిగిలిన బీజాలకు శక్తి లేదు.

**86. హ్రీంకారలక్షణా :** హ్రీంకారము లక్షణముగా గలది. హకారము ఆకాశతత్వాత్మకము. ఈశ్వర బీజము. రేఫ అగ్ని బీజము. ఈశ్వరుడు ఆకాశము వలెనే నిరాకారుడు, నిర్గుణుడు. కార్యోత్పాదనకు తనలో ఉన్నశక్తి గల ఈశ్వరుని కూడా రేఫ సూచిస్తుంది. అందుచేత హకారము రేఫతో కలిస్తే శుద్ధచైతన్యము సిద్ధిస్తుంది. ఈకారము మన్మధ బీజము. ఇది స్థితికారకుడైన విష్ణు సంకేతము. ఈ జగత్తు అంతా ఉపాదాన నిమిత్త కారణమైన పరబ్రహ్మ యందేలయం చెందుతుంది అనే విషయం అనుస్వారము వల్ల తెలుస్తుంది. కాబట్టి హ్రీం అని పలికినప్పుడు సృష్టి స్థితిలయాలకు కారణమైన చైతన్య శబ్దమే తెలియబడుచున్నది. ఉపాధిలేని రూపము ఆమె లక్షణము. అనగా కపటము లేని రూపము. సంసారాసక్తి లేని రూపము ఆమె లక్షణము.

**37. హ్రీంకార జపసుప్రీతా :** హ్రీంకారమును జపించుట వలన ప్రీతి నొందునది.

**38. హ్రీంమతీ :** హ్రీంకారము కలది. వాచకము (వాచ్యార్థము తెలియచెయ్యటము, ఉచ్చారణ)లో గాని, లక్షకము (సూచన)లోగాని, రూపంలోగాని, ఎక్కడా భేదం లేకపోవటంచేత ఆమె 'హ్రీంమతి' అనబడుచున్నది.

**39. హ్రీంవిభూషణా :** హ్రీంకారమే భూషణముగా గలది. హ్రీంకారము కేవలము జడరూపవాచకము. హకారము తెలుపు రంగు, రేఫ ఎరుపురంగు, ఈకారము నలుపును తెలియచేస్తాయి. ఈ మూడు వర్ణాలు, సత్వరజస్తమో గుణాలమాదిరిగా ప్రకృతిని సూచిస్తాయి. వీటి వాచ్యార్థము అసత్యము, జడత్వము, దుఃఖము, పరదేవతను ధ్యానించటమంటే వీటిని వదలివేయుటం. అప్పుడు అ దేవి తేజస్సును ప్రకాశింపచేస్తూ, చైతన్యరూపంలోఉండి, పాదముల నుండి శిరస్సుదాకా అలంకరింపబడి స్త్రీలాగా ఉంటుంది. ఆ సమయంలో ఆనందమయమైన ఆమె వదనము గోచరిస్తుంది. అష్టైశ్వర్యాలూ సిద్ధిస్తాయి. అంటే హ్రీంకారజపం గనక చేసినట్లైతే జడత్వము పోయి అష్టైశ్వర్యాలూ సిద్ధిస్తాయి.

**90. హ్రీంశీలా :** హ్రీంకారము యొక్క స్వభావము కలది. హ్రీంకారము వలన బ్రహ్మ విష్ణు రుద్రులు చెప్పబడుతున్నారు. వారి స్వభావము సచ్చిదానంద తత్త్వము. ఇటువంటి శీలము కలది. సత్వరజస్తమో గుణములు కలది.

**91. ఫ్రాంపదారాధ్యా :** హ్రీం అను ఏకాక్షరీ మంత్రముచే ఆరాధించుటకు యోగ్యమైనది. హ్రీంకారము చేతనే సంసిద్ధుడైనవాడు భుక్తినీ, ముక్తినీ పొందుతున్నాడు.

**92. హ్రీంగర్భా :** సృష్టిస్థితిలయాలకు కారకులైన త్రిమూర్తులు సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలై వారి శక్తులైన సరస్వతి, లక్ష్మి, పార్వతులతో కూడి దేవి యందున్నారు. ఇక్కడ హ్రీంశబ్దముచే త్రిమూర్తులు చెప్పబడుతున్నారు. వారు ఆ పరమేశ్వరి గర్భమునందున్నారు.

**93. హ్రీం పదాభిధా :** హ్రీం అనే పదము పేరుగా గలది.

**94. హ్రీంకారవాచ్యా :** హ్రీంకారముచే పరదేవత చెప్పబడుచున్నది. హ్రీంకారము మాయా బీజము. పరదేవత మాయా స్వరూపిణి. అందుచేతనే ఆమె హ్రీంకారముచే చెప్పబడుచున్నది.

**95. హ్రీంకార పూజ్యా :** పరదేవతను మూలమంత్రంతో పూజించాలి. అందుచేతనే పూజాంగముగా మూలమంత్రము చెప్పబడినది. ఇక్కడ దేవత పేరే మూలమంత్రము. అంతరారాధనాపరులు, అంతర్ముఖులు "హ్రీంనమః" అని చెబుతారు. కాబట్టి సంప్రదాయాన్ని అనుసరించి శ్రీ చక్రపూజ చెయ్యాలి. హ్రీం బీజము పరదేవతకు అత్యంతప్రియమైన బీజము.

**96. హ్రీంకార పీఠికా :** హ్రీంకారమునకు ఆ పరమేశ్వరియే ఆధారము. ఇక్కడ మంత్రానికీ, దేవతకూ భేదము లేదు. అందుచేత మంత్రానికి దేవతే ఆధారము. ఆ దేవత మంత్రమే హ్రీంకారము.

**97. హ్రీంకారవేద్యా :** హ్రీంకారముచే వేద్య అనగా తెలియదగినది. పరబ్రహ్మ నిర్గుణ స్వరూపుడు. అజ్ఞానానికి విషయము ఆశ్రయముగా ఉంటుంది. అందుచేతనే సంసారదశలో పురుషార్ధములు సాధించలేకపోతున్నారు. శుద్ధ స్వరూపమైన పరమానందము పొందదలచుకున్నట్లైతే మంచి గురువు దగ్గరకు చేరటము, శ్రవణము, మననము, అప్రమాణమైన వాటిని విడిచివేయుట మొదలైనవి కలుగుతాయి. శ్రవణాదులవలన అంతఃకరణలో వృత్తి ఒకటి ఉత్పన్నమవుతుంది. ఇది పూర్తిగా వ్యాప్తమై సంవిత్ జ్ఞానము నిస్తుంది. పరమాత్మను పొందగలిగితే ఈ మాయ నశిస్తుంది. గురుముఖతః వచ్చిన హ్రీంకారము ద్వారా పరదేవతా ప్రాప్తి జరుగుతుంది.

**98. హ్రీంకార చింత్యా :** హ్రీంకారమందు ఆమె చింతించతగినది. ప్రణవముతో ప్రారంభమయ్యే మంత్రాలే వైదిక మంత్రాలనీ, అవే మోక్ష ప్రాప్తిని కలుగచేస్తాయని చెప్పబడుతోంది. ప్రణవము అంటే ఓంకారము. పంచదశీ మహామంత్రంలో ఓంకారము లేదు. కాని శ్రీంహ్రీం క్లీం ఐం సౌః అనేవి పంచప్రణవాలు. వీటిలో ఉన్న హ్రీంకారము ఓంకారానికి భిన్నమైనదైనా పరబ్రహ్మకు ప్రతీకగా ఉన్నది. పరబ్రహ్మోపాసనకు ప్రణవము హేతువు. మంత్ర విశేషములందు భక్తి కలగటమే యోగ వైదిక మార్గ రహస్యము. పరమేశ్వరి సగుణ, నిర్గుణ బ్రహ్మ. కాబట్టి హ్రీంకారముచే చింతన చేయుటకు ఆమె యోగ్య. ఆ దేవిని హ్రీంకారముతోనే ధ్యానించాలి.

**99. హ్రీం :** సర్వమును హరించి ముక్తినిచ్చునది. సకల విద్యలు, సకలైశ్వర్యములను ప్రసాదించగలిగినది. అందువలన భక్తులకు ఆనందాన్నిచ్చేది. ఈమె యొక్క వాస్తవరూపము పరమానందరూపమైన ముక్తిని ప్రసాదించటం.

**100. హ్రీంశరీరిణీ :** హ్రీంకారము శరీరముగా కలది. అంటే మూలమంత్రాత్మిక అని అర్ధము. హ్రీం అనునదే శరీరముగా, మూర్తిగా గల దేవత.

ఇంతటితో ప్రధమ కూటమి పూర్తయినది. క ఏ ఈ ల హ్రీం అనే ఐదు బీజాక్షరాలు కల ఈ కూటమిలో ఒక్కొక్క బీజానికి ఇరవైచొప్పున వందనామాలు పూర్తయినాయి.

ఇక రెండవ కూటమి ప్రారంభమవుతున్నది. ఇందులో హసకహలహ్రీం అనే ఆరు బీజాక్షరాలుంటాయి. అంటే ఇక్కడ నుండి నూట ఇరవై నామాలవరకు ద్వితీయకూటమి నడుస్తుంది.

**హకారరూపా హలధృక్ పూజితా హరిణేక్షణా**
**హరప్రియా హరారాధ్యా హరిబ్రహ్మేంద్రసేవితా** *20*

**హయారూఢాసేవితాంఘ్రి ర్హయమేధసమర్చితా**
**హర్యక్షవాహనా హంసవాహనా హతదానవా** *21*

**హత్యాది పాపశమనీ హరిదశ్వాది సేవితా**
**హస్తికుంభోత్తుంగకుచా హస్తికృత్తి ప్రియాంగనా** *22*

హరిద్రాకుంకుమాదిగ్ధా హర్యశ్వాద్యమరార్చితా
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా 23

**101. హకారరూపా :** ద్వితీయ కూటమిలోని మొదటి అక్షరమైన హకారము మూలమంత్రంలో ఆరవ అక్షరము. పరమేశ్వరి హకారము రూపము కలది.

**102. హలధృక్ పూజితా :** హలధృక్ అంటే హలమును ధరించువాడు. (బలరాముడు). అతనిచే పూజింపబడినది. పూర్వకాలంలో ఎంతోమంది మహానుభావులు పంచదశీ మహామంత్రాన్ని జపించి తరించారని చెప్పబడుతోంది. వారిలో ముఖ్యులు.

| | | |
|---|---|---|
| 1. విష్ణువు | 6. కుబేరుడు | 11. ఇంద్రుడు |
| 2. శివుడు | 7. లోపాముద్ర | 12. బలరాముడు |
| 3. బ్రహ్మ | 8. అగస్త్యుడు | 13. దత్తాత్రేయుడు |
| 4. మనువు | 9. కుమారస్వామి | 14. దుర్వాసుడు |
| 5. చంద్రుడు | 10. మన్మథుడు | |

వీరిలో ఒకడైన బలరామునిచే పూజింపబడినది.

**103. హరిణేక్షణా :** లేడికన్నులవంటి కన్నులు కలది. అతి సంతోషముతో నిండిన కన్నులు కలది. భక్తులందరినీ సమానభావముతో చూచునది.

**104. హరప్రియా :** హరుని యొక్క ప్రియురాలు. ఈశ్వరుని భార్య.

**105. హరారాధ్యా :** ఈశ్వరునిచే ఆరాధింపబడునది. ఈశ్వరుడు ఈమె భర్త. అయినప్పటికీ ఆయనచే ఆరాధింపబడుచున్నది. అంటే కేవలము సచ్చిదానంద స్వరూపము అని అర్థము.

**106. హరిబ్రహ్మేంద్రసేవితా :** దేవతలందరిలోకీ తలమానికమైనవారు త్రిమూర్తులు. త్రిగుణ స్వరూపులు. సృష్టి స్థితి లయకారకులు. వారిచేత సేవింపబడునది. పంచబ్రహ్మలు ఆ పరమేశ్వరిని సేవించాలనే కోరికతో సూక్ష్మరూపం ధరించి ఆమె మంచానికి కోళ్ళుగా ఉన్నారు.

**107. హయారూఢాసేవితాంఘ్రి :** గుర్రమెక్కినవారి చేత పూజింపబడు పాదములు కలది. సామాన్యులకన్న కొంచెం హెచ్చుస్థాయిలో ఉన్నవారే గుర్రం ఎక్కుతారు. సమాజంలో ఉన్నతస్థానంలో ఉంటారు. అట్టివారిచే పూజింపబడునది. అశ్వారూఢ అను దేవత గుర్రమెక్కి వాయువేగ మనోవేగాలతో పరమేశ్వరి చుట్టూ తిరుగుతూ ఆమెను సేవిస్తూ ఉంటుంది.

**108. హయమేధసమర్చితా :** చతుర్విధ పురుషార్థాలు సాధించటానికి చేసే యాగాలలో అశ్వమేధయాగము ఒకటి. అటువంటి అశ్వమేధ యాగముచే అర్చింపబడునది.

**109. హర్యక్షవాహనా :** హర్యక్షము అంటే కపిలవర్ణము కలకన్నులు కలది. సింహము. పరాక్రమానికి గుర్తు సింహము. అటువంటి సింహము వాహనముగా గలది. అనగా అమితమైన పరాక్రమము కలది. ఈమె మహాలక్ష్మి స్వరూపము అని కూడా చెప్పవచ్చును.

**110. హంసవాహనా :** హంస వాహనముగా గలది. హంస అంటే సూర్యుడు, ప్రాణము అని అర్ధము. హంస ఆమెకు ఆధారభూతమగు చిహ్నము. హంసవాహనా అనగా బ్రాహ్మీరూపము కలది అని అర్ధము.

**111. హతదానవా :** దానవులను హతము చేసినది. మహిషాసురుడు, భండాసురుడు మొదలైన అనేక మంది రాక్షసులను సంహరించినది.

**112. హత్యాదిపాపశమనీ :** పాపములను శమింపచేయునది. పాపాలు మూడు రకాలు.

1. మానసికము - మనసుతో చేయునది
2. వాచికము - మాటలతో చేయునది
3. కాయకము - శరీరముతో చేయునది.

అంటే కర్మ ద్వారా చేయునది. ఇవి అనేక రకాలు; దొంగతనాలు, దోపిడీలు, హింస, హత్య మొదలైనవి. హత్య మళ్ళీ అనేక రకాలుగా ఉంటుంది. సాటి మానవుణ్ణి చంపితే హత్య. కడుపులో ఉన్న బిడ్డని చంపితే భ్రూణహత్య, అలాగే స్త్రీ హత్య, మునిహత్య, ఋషి హత్య మొదలైనవి. పాపాలన్నింటిలోకి ఎక్కువ పాపమునిచ్చేది హత్య. అందులోనూ బ్రహ్మహత్య. ఇటువంటి వాటివలన వచ్చే పాపలను కూడా శమింపచేసేది. **మహాపాతకౌఘ పాపానాం వినాశిన్యైనమో నమః** (లలితాష్టోత్తరం)

**113. హరిదశ్వాదిసేవితా :** హరిద్వర్ణముగల అశ్వము కలవాడు ఇంద్రుడు. అతనిచే సేవింపబడునది. ఇంద్రుని యొక్క అశ్వము మరకతమువంటి రంగు గలిగి ఉంటుంది. ఇంద్రాది దేవతలతో సేవింపబడుతుంది. అని ఈ నామానికి అర్ధము.

**114. హస్తికుంభోత్తుంగకుచా :** ఏనుగు కుంభ స్థలము వలె ఎత్తైన స్థనయుగము కలది

**115. హస్తికృత్తిప్రియాంగనా :** ఏనుగు చర్మము నందు ప్రీతి గలవాడు శివుడు. అతనికి ప్రియురాలు.

**116. హరిద్రాకుంకుమాదిగ్ధా :** పసుపు, కుంకుమలచే అలంకరించబడినది. ఇవి సౌభాగ్యానికి గుర్తులు. అంటే నిత్యసౌభాగ్యవతి.

**117. హర్యశ్వాద్యమరార్చితా :** హర్యశ్వుడు అంటే ఇంద్రుడు. ఇంద్రాది దేవతలచే సేవింపబడునది.

**118. హరికేశసఖీ :** హరి అంటే విష్ణువు-నీలమేఘశ్యాముడు. ఆ రంగులో కేశములు కల ఈశ్వరుని యొక్క సఖి అని అర్ధము. పరమేశ్వరి కేశములు నల్లగా ఉన్నాయి అనీ, ఆమె సర్వాంగ సుందరి అనీ అర్ధము.

**119. హాదివిద్యా :** శ్రీవిద్య హాదివిద్య, కాదివిద్య అని రెండు రకాలుగా ఉపాసింపబడు తోంది. హాదివిద్య కార్యసాధనకు, కాది విద్య మోక్ష సాధనకు ఉపకరిస్తాయని చెప్పబడింది. లోపాముద్ర, అగస్త్యుడు, సూర్యుడు, శివుడు, విష్ణువు మొదలైన వారందరూ హాదివిద్యనుపాసించారని చెప్పబడింది.

**120. హాలామదాలసా :** వారుణీ మదముచే అలస. క్షీరసాగరమథన సమయంలో ఉద్భవించిన వారుణిని హాలము అంటారు. దీనియొక్క మదము లేక ఉల్లాసముచే ఎర్రబడిన నేత్రములు, నిక్కబొడుచుకున్న రోమములు కలది.

*సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగళా*
*సర్వకర్త్రీ సర్వభర్త్రీ సర్వహంత్రీ సనాతనీ* *24*
*సర్వానవద్యా సర్వాంగసుందరీ సర్వసాక్షిణీ*
*సర్వాత్మికా సర్వసౌఖ్యదాత్రీ సర్వవిమోహినీ* *25*
*సర్వాధారా సర్వగతా సర్వావగుణవర్జితా*
*సర్వారుణా సర్వమాతా సర్వభూషణ భూషితా* *26*

**121. సకారరూపా :** మూలమంత్రంలోని ద్వితీయ కూటమిలో రెండవ అక్షరము సకారము. ఈ అక్షరము ద్వారా జ్ఞాపకము చేయబడునది.

**122. సర్వజ్ఞా:** సర్వము ఎరిగినది. ఎప్పుడూ ఒకే రకంగా ఉండే నిత్యజ్ఞాన రూపమే ఆమె సామాన్య రూపము. అవిడకు భూతభవిష్య వర్తమానాలన్నీ తెలుసు.

**123. సర్వేశీ :** అన్ని పనులకు ఈమె అంతర్యామిగా ఉండి వాటిని ప్రేరణ చేస్తుంది. సమస్త దేవదనుజప్రేరకాయై నమోనమః

**124. సర్వమంగళా :** సర్వవిధములయినటువంటి విశిష్టచైతన్య రూపంలో పరమానంద స్వరూపంతో ఉండేది. అందరికీ ఆనందము చేకూర్చేది. ధ్యానము, కీర్తనము, పూజ, నమస్కారము మొదలగు వాటివలన కలుగు సేవలతో జడులకు కూడా సుఖమునిచ్చేది. సర్వులకూ ఆత్మ రూపంలో సాక్షాత్కరించేది. ఈశ్వరునకు సుఖమునిచ్చేది. సర్వుడు అంటే ఈశ్వరుడని అర్థము! మంగళ అంటే సుఖకారకురాలైన స్త్రీ అని అర్ధము. అందుచేత లోకంలో సుఖాలిచ్చే స్త్రీల స్వరూపమే ఆమె. ఈ ఆనందము వల్లనే ప్రకృతి నిలబడి ఉన్నది. ఆమెను స్మరించినంత మాత్రముచేతనే పురుషులకు సుఖము కలుగుతుంది. ఆమె ఎల్లవేళలా కల్యాణమైన శుభరూపంలో ఉండి అందరకూ శుభాన్ని కలగచేసేది.

**125. సర్వకర్త్రీ:** అన్నింటికీ కర్త ఈమె. మాయా రూపమైన శక్తితో అన్ని పనులు చేయునది

**126. సర్వభర్త్రీ:** సర్వమును భరించునట్టిది.

**127. సర్వహంత్రీ:** సమస్తమును హరించునది. ఈ మూడు నామాలలోనూ సృష్టి స్థితిలయాలకు ఈమే కారణమని చెప్పబడుచున్నది.

**128. సనాతనా :** ఈమెకు జనన మరణాలు లేవు. ఈమె నిత్య శాశ్వత. అంటే ఎల్లప్పుడూ ఉండేది. కాబట్టి ఆమె ఎన్నో యుగాలనుంచీ ఉంటోంది. అందుకనే సనాతనా అనబడింది.

**129. సర్వానవద్యా :** సర్వగుణములచే అనవద్య. సర్వములైన జ్ఞాన ఐశ్వర్యాది గుణములు కలిగి ఉండుటచే ఆమె యందు దోషములు లేవు. ప్రకృతిలోని మాయను అవద్య అంటారు. దీనికి భిన్నమైన రూపమామెది. అదేసత్యజ్ఞానానంద రూపము. అందరి కోరికలు నెరవేర్చి అందరితోనూ స్తుతింపబడేది.

**130. సర్వాంగ సుందరీ :** సాముద్రిక శాస్త్రములో చెప్పినట్లుగా శుభ లక్షణములు కల అవయవములకలది. అందమైన అవయవములు కలది. అన్ని అవయవములలోనూ బ్రహ్మ స్వరూపమే కనుపించునది.

**131. సర్వ సాక్షిణీ :** అన్ని జడపదార్థములకు స్ఫూర్తినిచ్చేది. అన్ని విషయములను ఆమె గమనిస్తూ ఉంటుంది. అందుకనే లలితాష్టోత్తరంలో "జాగ్ర స్వప్న సుషుప్తీనాం సాక్షి భూతే' అని చెప్పబడింది. సర్వకాల సర్వావస్థల యందు ఆమె అన్ని విషయాలకూ సాక్షి.

**132. సర్వాత్మికా :** అందరిలోనూ ఆత్మ రూపంలో ఉండే దేవి. పరమేశ్వరి ఆత్మ రూపంలో అన్ని పదార్థాలలోనూ ఉంటుంది. చలనమున్న వాటిలో, చలనములేని వాటిలో, ప్రాణము ఉన్న వాటిలో ప్రాణము లేని వాటిలో కూడా ఉండేది ఒక్కటే ఆత్మ. మండుతున్న సూర్యుడిలో ఏ ఆత్మశక్తి ఉన్నదో, అదే మనలోనూ ఉన్నది. ఒక జంతువులో ఏ ఆత్మశక్తి అయితే ఉన్నదో అదే మనలోనూ ఉన్నది. ఈ విధంగా ఆవిడ అందరిలోనూ ఉన్నది. అందుకే 'సర్వాంతర్యామినీ' అన్నారు. 'సమస్త హృదయాం భోజ నిలయాయై నమోనమః

**133. సర్వ సౌఖ్యధాత్రీ :** అందరికీ సుఖాన్ని ప్రసాదించేది. సర్వులకూ ప్రియాన్ని కలిగించేది. ఆనందాన్ని కలిగించేది. ఆనందం రెండు రకాలు. ఈ లోకానికి సంబంధించినది. పరలోకానికి సంబంధించినది. పరమేశ్వరిని నమ్మిన వారికి రెండు రకాల ఆనందాలూ కలుగుతాయి. ఇహ పరసాధనకు ఆమేనే అర్చించాలి. కాబట్టి ఆమెను ఆరాధించిన వారి కోరికలు నెరవేరి ఇహ లోకంలో సుఖాలనుభవిస్తారు. అలాగే పరలోక ప్రాప్తికూడా పొందుతారు. ఈ రకంగా అందికీ సుఖాన్ని కలుగ చేస్తుంది. కాబట్టి ఆమె సర్వ సౌఖ్యధాత్రీ అనబడుతోంది.

**134. సర్వ విమోహినీ :** అందరినీ మోహింప చేయునది. మానవులలో ఉండే జ్ఞానము అజ్ఞానము చేత ఆవరించబడి ఉన్నది. అందుకనే జ్ఞానశక్తి ప్రకాశించదు. అజ్ఞానం వల్ల మోహం పుడుతుంది. ఏదైనా పొందాలనే అపేక్ష. ఇదే మోహం. దీనికి కారణం మాయ. పరమేశ్వరి మాయా స్వరూపిణి. అందుచేతనే జనులందర్నీ మోహింప చేస్తుంది. మాయలో పడేస్తుంది.

**135. సర్వాధారా :** అందరికీ, అన్నింటికీ ఆ పరమేశ్వరియే ఆధారము. సమస్త బ్రహ్మాండానికీ ఆమె ఆధారము బ్రహ్మాండములోని గోళములన్నీ గతి తప్పకుండా తిరుగుతూ ఉండటానికి, ఒక దానికి మరొకటి తగిలి విస్ఫోటాలు జరుగకుండా ఉండటానికి ఆవిడే కారణము.

**36. సర్వగతా :** సర్వమును పొందునది. అన్ని చోట్లా ఉండునది. ప్రతి వస్తువునందు ఉండునది.

**37. సర్వావ గుణ వర్జితా :** లక్షణము, అవ లక్షణము అన్నట్లుగానే గుణము, అవగుణము. అని ప్పబడింది. ఇది వ్యతిరేక పదం. చెడ్డ గుణము అని అర్థం, ఏ గుణాల వల్లనైతే అవమానం లుగుతుందో అవి అవగుణాలు. అటువంటి అవగుణాలను వర్జించినది. దేవి సర్వాంతర్యామి. యినప్పటికీ కర్మలతో ఆమెకు సంబంధము లేదు. కుండతో నీళ్ళు పెట్టినప్పుడు ఆ నీళ్ళలో కాశం కనిపిస్తుంది. అంత మాత్రం చేత కుండలో ఆకాశం ఉండదు. అలాగే కర్మల గుణ ోషములు దేవిని అంటవు.

**38. సర్వారుణా :** అన్ని అవయవములు ఎరుపురంగులోనే ఉంటాయి. ఎరుపు రంగు అంటే మెకు ప్రీతి. ఆమె శరీరం ఉదయిస్తున్న సూర్యకాంతి వలె ఎర్రగా ఉంటుంది. ఎర్రని వస్త్రము రిస్తుంది. ఎరుపు రంగు మాణిక్యములు, కెంపులు ధరిస్తుంది. మందారాది పుష్పాలు, ఎరుపువి ష్టపడుతుంది. దంతాలు దానిమ్మ గింజల్లాగా ఎర్రగా ఉంటాయి. ఈమె కామకలా స్వరూపిణి. ఈ రకంగా దేవి సర్వము ఎరుపు రంగులోనే ఉంటుంది.

**39. సర్వమాతా :** సమస్తమైన కార్య జాలాన్నీ పరీక్షించినట్లైతే, వీటికీ ఆమెకూ భేదం లేదని లుస్తుంది. చరాచర జగత్తుకుండా బ్రహ్మకన్న వేరుకాదు. దారముచే తయారు చేయబడిన స్త్రము దారముకన్న వేరుకాదు. అట్లాగే బ్రహ్మనుండి ఉద్భవించిన జగత్తు బ్రహ్మకన్న వేరుకాదు. ందుకే ఆమె సర్వానికీ, సర్వులకీ మాత అని చెప్పబడింది.

**40. సర్వభూషణ భూషితా :** సకల ఆభరణములచేత అలంకరింపబడినది. చూడామాణి నుండి ాలి మట్టెల వరకు అన్ని రకాల ఆభరణాలతోనూ అలంకరింపబడినది. మంత్రములే ఆభరణ ూచకములు. పరమేశ్వరి మంత్రమయి కాబట్టి సప్తకోటి మంత్రాలే ఆమెకు ఆభరణాలు. జగత్తులో నేక జాతుల వారున్నారు. వారందరూ అనేక రకాల ఆభరణాలు వాడతారు. అవి వెండి, ంగారము, దంతము, రాగి ఈ రకంగా ఉంటాయి. పరమేశ్వరి సర్వాంతర్యామి. కాబట్టి వాళ్ళు రించే ఆభరణాలన్నీ ఆమెకే చెందుతాయి. అందుకనే ఆమె సర్వాభరణ భూషిత.

*కకారార్థా కాలహంత్రీ కామేశీ కామితార్థదా*
*కామ సంజీవనీ కల్యా కఠిన స్తన మండలా* 27

*కరభోరు: కళానాథముఖీ కచజితాంబుదా*
*కటాక్ష స్యంది కరుణా కపాలి ప్రాణనాయికా* 28

*కారుణ్యావిగ్రహాకాంతా కాంతిధూత జపావళి :*
*కలాలాపా కంబుకంఠీ కరనిర్జిత పల్లవా* 29

*కల్పవల్లీ సమభుజా కస్తూరీ తిలకాంచితా*

**141. కకారార్థా :** ద్వితీయ కూటమిలోని మూడవ అక్షరము క కారము కం అనగా బ్రహ్మ అని అర్థము. ఈ జగత్తులో పరబ్రహ్మకు మించిన పదార్థము వేరే లేదు.

**142. కాల హంత్రీ :** కాలమును హరించునట్టిది. ప్రాణాపానములను అదుపులో ఉంచాలి. ఇది అజపా రూపము. రోజుకు 21, 600 సార్లకు మించి అంటే నిమిషానికి 125 సార్ల కన్న ఎక్కువైనట్లైతే అది ఆయుక్షీణము. ఆయుర్థాయము వృద్ధికావాలంటే ప్రాణాపాన సంయమనం చేయవలసి ఉంటుంది. పంచభూతములను వదలి పంచాత్మక యోగస్థితి పొందిన వాడికి రోగము, ముసలి తనము, చావులేవు. ఆ స్థితి పొందినవాడి శరీరము యోగాగ్ని మయము. యోగ సాధన చేస్తూ భగవద్ధ్యానము చేసే వాడికి సుఖ దుఃఖములు లేవు. పరమేశ్వరి పాదపద్మముల నుండి వచ్చే కిరణములు 360. ఇవి కాల పురుషుడికి సంకేతము. ఒక సంవత్సరానికి ప్రతీక. ఈ రకంగా దేవి వలన ఉద్భవించిన కాలము మరల ఆమె యందే లయమొందుటచే నశిస్తున్నది.

**143. కామేశీ :** కామములను ప్రేరేపించేది. భోగ్య పదార్థాలను యధా దృష్టముగా కోరుకోమని ప్రేరేపించేది.

**144. కామితార్థదా :** కోరిన కోరికలు నెరవేర్చేది. సంసార లంపటంలో పడిన మానవుడు అది మాయ అనీ, అశాశ్వతమనీ గ్రహించలేక అదే నిజమనుకుని ఇంకా ఇంకా లోతుకు కూరుకు పోతున్నాడు. పాంచ భౌతికమైన ఈ దేహంతో తాను అనుభవిస్తున్న సుఖాలే శాశ్వతమైనవి అనుకుంటున్నాడు. పరమేశ్వరిని ఆరాధించే వారు శాశ్వతమైన ఆనందం కావాలను కుంటే వారికి ముక్తినిస్తుంది. ఈ రకంగా భక్తులు కోరిన కోరికలు తీరుస్తుంది.

**145. కామ సంజీవనీ :** శివుని యొక్క మూడవ కంటి తేజస్సుతో మన్మథుడు దగ్ధమై పోయినాడు. కొంత కాలము తరువాత, అందరూ సంతోషంగా ఉన్న సమయంలో మన్మథుని తల్లి అయిన లక్ష్మీదేవి, భార్య రతీదేవి, బ్రహ్మాది దేవతలు పరమేశ్వరిని చేరి మన్మథుడు దేవకార్యము కోసమే మరణించాడు కాబట్టి అతణ్ణి పునర్జీవితుణ్ణి చేయవలసినదని వేడుకున్నారు. అప్పుడు ఆదేవి కనికరించి మన్మథుడు అనంగుడుగా ఉంటాడని వరమిచ్చింది. ఒక్క రతీదేవికి తప్ప ఇతరులెవరికీ కనపడడు. ఇది కాముని పాలిటి సంజీవని అయింది 'హర నేత్రాగ్ని' అనేది కామ దహన విద్య ' కామ సంజీవనౌషధి' సంజీవనీ సాధనము.

**146. కల్యా:** ధ్యానించుటకు యోగ్యమైనది. కావున కల్యా అనబడుచున్నది. సర్వోత్తమమగు దేవత అగుట చేత ధ్యాన యోగ్యా. కామధేనువు వలె కోరికలు తీర్చునది.

**147. కఠినస్తన మండలా :** స్తనముల చివరి భాగము కఠినములు. కదలిక లేక స్థిరమైనవి.

**148. కరభోరుః :** కరభముల వంటి ఊరువులు కలది.

**49. కలానాథముఖీ :** చంద్రుని వంటి ముఖము కలది. కలానాధుడు. అరవై నాలుగు కళలను ప్రేరేపించు వాడు చంద్రుడు. సౌందర్య లహరిలో ఆమె 'పరిణిత శరచ్చంద్ర వదనా' అని చెప్పబడింది. అంటే శరత్కాల పున్నమి నాటి చంద్రుని బోలిన ముఖము కలది.

**50. కచజితాంబుదా :** కచము అంటే కేశ భారమైన కొప్పు. ఈ కొప్పు వలన మేఘములు కూడా చిన్నబోతున్నాయి. అందుకనే ఆమె వ్యోమకేశి. దేవి విరాడ్రూప వర్ణనలో ఆకాశము శిరస్థానమని చెప్పబడినది. ఆమె కేశముల నల్ల దనము వల్ల మేఘములు వెలవెల పోతున్నాయి. కచములంటే కేశములు, జితము- స్థిరముగా ఉన్నటువంటి, అంబుదము - మేఘము. ఆమె కొప్పు నల్ల దనం ముందు మేఘాలు కూడా చిన్న బోతున్నాయి.

**51. కటాక్షస్యంది కరుణా :** కటాక్షము నుండి స్రవించుచున్న కరుణ కలది. దీనుల పైన దేవతలకు గల పరిపాల్యతా బుద్ధిని కరుణ అంటారు. ఇది వారి అంతరంగంలో ఉంటుంది. బయటకు కనిపించదు. అయినప్పటికీ భక్తితో ఆమెను కొలుస్తుంటారు. ఆమెను సేవించినట్లైతే తమ కోరికలు తప్పక తీరతాయని వారి భావన. ఈ రకంగా సేవించినట్లైతే ఆమె యొక్క కరుణ, కటాక్షాలు తమకు కూడా కలుగుతాయని వారి భావన. ఈ కరుణ అనేది బయటకు కనిపించదు కాని పనులు జరిగేటప్పుడు కనిపిస్తుంది. ఈ రకంగా కటాక్షముల నుండి ప్రవహించు కరుణ పరిపాల్యతా బుద్ధి రూపము గలది. అందుచేతనే ఆ పరమేశ్వరుని ఈ విధంగా చెప్పటం జరిగింది.

**52. కపాలి ప్రాణనాయికా :** కపాలము చేతిలో ధరించినవాడు కపాలి. అతడే ఆనంద భైరవుడు అతని పంచప్రాణములకు ఈమె నాయిక. అంటే ప్రేరకురాలు; మానవుడు ప్రాణాపానవ్యాన ఉదా సమానములనబడే పంచప్రాణములచే తనే జీవించటం లేదు. వీటికి ఆశ్రయమైన దాని వలన జీవిస్తున్నాడు, ఆనంద భైరవుని హృదయమందుగల పరమేశ్వరీ రూపము ఆమెయే అతని ప్రియురాలు.

**53. కారుణ్య విగ్రహా :** కారుణ్యమూర్తి. పరమేశ్వరిది కరుణా రూపము. కారుణ్యము అనేది అంతఃకరణలోనే ఉంటుంది. బయటకు కనిపించదు. కాబట్టి మందహాసము, మాటలు, చూపుల ద్వారా వ్యక్తమౌతుంది. మన కోరికల ద్వారా బయటకు కనిపిస్తుంది. పరమేశ్వరి నిరాకార, నిర్గుణ. అయినప్పటికీ భక్తుల కోరికలు తీర్చటానికి సగుణ బ్రహ్మ అయింది. ఈ రకంగా ఆ దేవికి రూపం కల్పించబడింది. కాబట్టి భక్తుల యొక్క కోర్కెలు తీర్చటానికి ఆమె కరుణ రసముతో నిండి ఉంటుంది.

**54. కాంతా :** అత్యంత మనోహరము. మదన గోపాల విగ్రహము, అని అర్థము. ఒకసారి పరదేవత పురుష రూపంలో శ్రీకృష్ణుడుగా అవతరించి తన వేణుగానంతో జగత్తును పరవశింప చేసినది. సప్తశతిలో చివరి భాగంలో రానున్న కాలంలో దేవి నందగోపుని ఇంట కృష్ణునిగా అవతరిస్తాను అని చెప్పింది.

**155. కాంతి ధూత జపావళిః :** జపావళి. అనగా జపా కుసుమముల (మంకెన్న పూల) వరుస. ఇవి ఎర్రగా ఉంటాయి. పరమేశ్వరి అరుణచ్ఛాయలో ఉంటుంది. ఆమె శరీరము యొక్క అరుణ కాంతుల ముందు గుట్టలు, వరుసలుగా ఉన్న జపాకుసుమములు కాంతి హీనమౌతున్నాయి.

**156. కలాలాపా :** అరువది నాలుగు కళలను ఆలపించునది. వేదశాస్త్రమైన వాణి ఎవరికి ఉన్నదో ఆమె పరదేవత. అన్ని కళలలోనూ ఆరితేరటమనేది మానవ మాత్రులకు సాధ్యం కాదు. ఒక్క పరమేశ్వరికే సాధ్యమౌతుంది.

**157. కంబుకంఠీ :** కంబు అంటే శంఖము. శంఖము వంటి కంఠము కలది. శంఖమున గల మూడు రేఖలను కంబు అంటారు.

**158. కరనిర్జిత పల్లవా :** ఆమె అరచేతులు లేత చిగుళ్ళ కన్న ఎర్రగానూ, మృదువుగానూ ఉన్నాయి.

**159. కల్పవల్లీ సమభుజా :** దేవేంద్రుని యొక్కనందనోద్యానవనంలో కల్పవృక్షము మొదలైన దివ్యవృక్షములు వాటి అలంకరణకు తీగలు ఉన్నాయి. కల్పవల్లులతో సమానమగు భుజములు కలది. స్త్రీల యొక్క భుజములు వల్లీ సమములు. కల్ప వృక్షమునకు లాగానే ఈ తీగలకు కూడా కోర్కెలు తీర్చేశక్తి ఉన్నది. అందుచేతనే ఆమె భుజములు కల్పవల్లులతో పోల్చబడినాయి.

**160. కస్తూరీ తిలకాంచితా :** పరమేశ్వరి లలాటమున బిందువుగా కస్తూరి తిలకమున్నది. అది ఆమె అలంకారము. పరమేశ్వరి ఆవిర్భావకాలమున శాంభవ తేజస్సుతో ముఖపద్మము ఏర్పడింది. చంద్రబింబములోని కళంకమువలె పరమేశ్వరి ముఖ పద్మమున కస్తూరికా తిలకము వెయుచున్నది. లలితా సహస్రంలో 16వ నామము 'ముఖ చంద్ర కళంకాభా మృగనాభి విశేషకా' అని చెప్పబడింది. అష్టోత్తరంలో కస్తూరితిలకోల్లాస నిటలాయైనమో నమః అని చెప్పబడింది.

*హకారార్థా హంసగతి ర్హాటకాభరణోజ్జ్వలా* 30
*హారహారి కుచా భోగా హాకినీ హల్య వర్జితా*
*హరిత్పతి సమారాధ్యా హఠాత్కార హతా సురా* 31
*హర్ష ప్రదా హవిర్భోక్త్రీ హార్దసం తమసాపహా*
*హల్లీహాలాస్య సంతుష్టా హంస మంత్రార్థ రూపిణీ* 32
*హానోపాదాననిర్ముక్తా హర్షిణీ హరి సోదరీ*
*హాహాహూహూ ముఖస్తుత్యా హాని వృద్ధి వివర్జితా* 33
*హయ్యంగ వీన హృదయా హరి గోపారుణాంశుకా*

**161. హకారార్థా :** ద్వితీయ కూటమిలో నాల్గవ అక్షరము హకారము. ఇది ఆకాశ బీజము. అందుచేత ఆమె ఆకాశ విగ్రహా అని అర్థము. అంటే ఆకాశము పరబ్రహ్మ. ఆ దేవి కూడా పరబ్రహ్మ స్వరూపము.

**462. హంసగతిః :** హంస అంటే సూర్యుడు, ప్రాణము అని అర్థము. హంసగతి అంటే హంస యొక్క నడక, గమనము. ప్రాణము యొక్క గమనము. అజపా మంత్రము అంటే ఉఛ్వాస నిశ్వాస్వలు అని ఇదివరకే చెప్పబడింది. ఇవి రోజుకు 21,600 జరుగుతాయి. హకార సంజ్ఞ కలవాడు పరమేశ్వరుడు. సకార సంజ్ఞ శక్తి. మానవుడు శ్వాస పీల్చేటప్పుడు సకారముతో లోపలకు హకారముతో బయటకు వెళుతుంది అని చెప్పబడింది. ఈ రకంగా మానవుడి యొక్క ఉఛ్వాస నిశ్వాసల గమనమే హంస గమనము. ఇదే హంసగతి. హకారము సూర్యుడు, సకారము చంద్రుడు. వీరి గమనము వలన కాలము ఏర్పడుతోంది. పరమేశ్వరి పాదపద్మముల నుంచి వచ్చే కిరణాలు 360. ఇదే సంవత్సరము. కాలపురుషునికి ప్రతీక. కాబట్టి హంసగతి అంటే కాలగమనమని అర్థము. హకార సంజ్ఞగల పరమాత్మ సకారరూపమైన ప్రకృతితో కలిసి శబల బ్రహ్మమై తొమ్మిది ద్వారాలుగల మానవ దేహంలోకి బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించి ఇంద్రియాలు, ప్రాణములు, మనస్సుతో కూడినవాడై, పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే మార్గం తెలియక ప్రాపంచిక బంధాలతో కొట్టుమిట్టాడుతున్నాడు. కొంతకాలం తరువాత ఈ శరీరాన్ని వదిలిపోయేటప్పుడు మానవుడి యొక్క కర్మలననుసరించి శరీరంలోని ఏదో ఒక మార్గం గుండా బయటకు పోయి మళ్ళీ ఇంకొక జన్మ ఎత్తుతున్నాడు. ఈ జీవుడు గనుక వచ్చిన త్రోవనే అంటే బ్రహ్మరంధ్రం గుండా గనుక బయటకుపోయినట్లైతే పరమాత్మలో లీనమవుతాడు. హంస అంటే జీవాత్మ, అదే పరమాత్మ. దీని యొక్క గమనమే హంస గమనము. సంసార బంధనాలు వదిలించుకుని, నిత్యము పరమేశ్వర ధ్యానంతో కాలంగడుపుతూ, ఊరూరా తిరుగుతూ తత్త్వబోధచేసే పరివ్రాజకులే హంస అని అర్థము. బ్రహ్మదేవుని వాహనము హంస. అది మందగమన, ఇది సామాన్యార్థము.

**463. హాటకా భరణోజ్వలా :** బంగారు ఆభరణములవలె ప్రకాశించునది. హాటకము అంటే ప్రకాశించునది, బంగారము అని అర్థము. పరమేశ్వరి బంగారు నగలతో అలకరించబడి దేదీప్య మానంగా ప్రకాశిస్తున్నది. హాటకము అంటే బ్రహ్మాండము. ఈ బ్రహ్మాండానికే ఆభరణంగా ప్రకాశిస్తున్న దేవత.

**464. హారహారి కుచాభోగా :** హారములు కలిగిన కుచ ప్రదేశము కలది. పరమేశ్వరి మెడలో అనేక రకాలయిన హారాలు వ్రేలాడుతున్నాయి. గజాసురుని సంహరించినప్పుడు అతని కుంభస్థలము నుంచి తీసిన ముత్యాలను కానుకగా ఆ దేవికి సమర్పించాడు పరమేశ్వరుడు. వాటిని ఆమె దండగా గ్రుచ్చి మెడలో ధరించింది. అవి చిత్ర విచిత్రమైన కాంతులతో ప్రకాశిస్తున్నాయి అని సౌందర్యలహరిలో చెప్పబడింది. మానవుడికి అలంకారాలు ఆభరణాలుకాదు. అతని యొక్క గుణగణాలు• పరమేశ్వరునికి ఈశ్వరత్వము, ఆప్తకామత్వము, నిత్యతృప్తత్వము మొదలైన గుణాలున్నాయి. అవే ఆయనకు హారాలు. అయితే ఇక్కడ హారహారి అని చెప్పబడింది. అంటే ఉన్న హారాలలో విశిష్టం అని చెప్పబడింది. అంటే ఉన్న హారాలలో విశిష్టంగా కనిపించేది. మానవుడు

అవిద్య అనబడే అజ్ఞానంతో కొట్టుకుంటున్నాడు. అతని అజ్ఞానాన్ని తొలగించి జ్ఞాన జ్యోతిని అతనిలో వెలిగించే హారమే విశిష్టమైనది. అన్నిటిలోనూ ఈ హారమే శ్రేష్టమైనది. దాన్ని మెడలో ధరించినది.

**165. హాకినీ :** పాపములను ఛేదించునది. జీవుల యొక్క పాపాలను ప్రక్షాళన చెయ్యటం వలన వారికి జనన మరణా లుండవు.

**166. హల్య వర్జితా :** పాపరహిత. హలము అంటే నాగలి. హల్యము కృషి వలన కలుగునట్టిది. నాగలి సాగుచెయ్యటానికి ఉపయోగించేది. అంటే కోరికల సాధనము. అటువంటి కృషిని వర్జించినది, కోరికలు లేనిది, శుద్ధ చైతన్యమూర్తి పరమేశ్వరి. హల్యము అంటే కపటంతో స్నేహితులను మోసగించుట. అటువంటి కపటం లేనిది.

**167. హరిత్పతి సమారాధ్యా :** ఇంద్రాది దేవతలచే పూజింపబడునది. హరిత్తులు అంటే దిక్కులు. వాటికి అధిపతులు ఇంద్రాదులు. వారే దిక్పాలకులు, వారిచేత భక్తి శ్రద్ధలతో ఆరాధించబడునది. వారి యొక్క కోర్కెలు తీర్చునది.

**168. హఠాత్కార హతాసురా :** రాక్షసులను అతి త్వరగా ఓడించినది. దేవ కార్యములు పూర్తి చేసేందుకే పరమేశ్వరి భూలోకంలో అవతరించింది. దేవకార్యము అంటే రాక్షస సంహారము. ప్రముఖులైన రాక్షసులు ఇద్దరు. 1. భండాసురుడు 2. మహిషాసురుడు. వారు ఏ రకంగానూ ఆమెకు సాటికారు. ఆమె సృష్టించిన బ్రహ్మాది దేవతలను ఆరాధించి వరాలు పొందినవారు రాక్షసులు. బ్రహ్మాదులు పరమేశ్వరిచే సృష్టించబడి, ఆమె ఆజ్ఞలకు బద్ధులై ఉన్నవారు. అటువంటి బ్రహ్మాది దేవతల నర్చించినవారు ఆ పరమేశ్వరితో సమానము ఎలా అవుతారు ? అందుచేత సింహము మేక పిల్లను చంపినట్లుగా పరమేశ్వరి రాక్షస సంహారం చేసింది.

**169. హర్ష ప్రదా :** ఆనందమును కలిగించునది. ఆనందము అనేక కారణాలవల్ల కలుగుతుంది. ధనము, యవ్వనము, భోగభాగ్యములు, ఇష్టులను చేరుట, కోర్కెలు తీరుట మొదలైన ఇహలోక వాంఛలు. ముక్తి పొందటం ద్వారా శాశ్వతమైన ఆనందం. ఈ రకంగా భక్తుల అభీష్టాన్ని, వారి కర్మ ఫలాన్నిబట్టి వారికి ఆనందాన్నిచ్చేది.

**170. హవిర్భోక్త్రీ :** హవిస్సులను భుజించునది. యజ్ఞంచేసేటప్పుడు స్వాహా మంత్రంతో దేవతల పేరు చెప్పి అగ్నిలో ఆజ్యము పోయటం జరుగుతుంది. దేవతలకిచ్చిన ఈ హవిస్సును స్వాహాదేవి వారికందిస్తుంది. హవిస్సులు భవిష్యత్తులో ఫలితాన్నిస్తాయి. హవిస్సుల వలన అపూర్వమైన అదృష్టం యజమానులకు కలుగుతుంది. ఈ రకంగా యజ్ఞ యాగాదులవలన దేవతలను తృప్తిపరచి తద్వారా మోక్షాన్ని సాధించటం జరుగుతుంది. దేవతలంతా ఆమె స్వరూపమే. సృష్టి అంతా ఆమె స్వరూపమే. కాబట్టి యజ్ఞంలో పోసిన హవిస్సు ఆమే భుజిస్తుంది.

71. **హార్దసంతమసాపహా :** హృదయమందలి చీకటిని సంహరించునది. హృదయముతో కూడినది హార్దము. హృదయంలో ఉన్న విషయాన్ని తెలుసుకో గలిగినవాడు అన్ని విషయాలనూ తెలుసుకుంటాడు. హృదయము అజ్ఞానముచే ఆవరించబడి ఉంటుంది. అజ్ఞానానికి విషయము, ఆశ్రయము ఆత్మ. మహావాక్యంలో పరబ్రహ్మను గురించి చెప్పబడుతుంది. కాబట్టి మహావాక్యం వినటంవలన బ్రహ్మలేదు అనే భ్రాంతి తొలగిపోతుంది. తద్వారా సాధకుని హృదయాకాశంలో చీకట్లు చెల్లా చెదరయి జ్ఞానజ్యోతులు వెలుగుతాయి.

72. **హల్లీస లాస్య సంతుష్టా :** హల్లీస మను నాట్యముచే సంతుష్టి చెందునది. రంగు రంగుల కర్రలు చేతులతో పట్టుకుని రాగయుక్తంగా పాడుతూ, కర్రలతో తాళం వేస్తున్నట్లుగా చప్పుడు చేస్తూ, స్త్రీలు గుంపులు గుంపులుగా లయ బద్ధంగా నాట్యం చెయ్యటం. ఇదే కోలాటం. ఈ విధమైన కోలాట నృత్యము వలన తృప్తిపొందునది.

73. **హంస మంత్రార్థ రూపిణీ :** హంస మంత్రము యొక్క అర్థరూపమైనది. హంసలచే ఉపాసింపబడు మంత్రము. సంసార బంధనాలను త్యజించి పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ ముక్తి కోసం ప్రయత్నించే ముముక్షువులు హంసలు. ముక్తి అంటే విడుదల అని అర్థం. అజ్ఞానం వల్ల ఏర్పడ్డ సాంసారిక వాసనలన్నీ తాళ్ళు. ఈ తాళ్ళే జీవులను బందీలుగా చేస్తాయి. అజ్ఞానాన్ని పటా పంచలు చేసి, ఈ తాళ్ళు తెంచుకుని విడుదల కావటమే ముక్తి. ఎవడు పరతత్త్వాన్ని తెలుసుకుంటాడో వాడు సాక్షాత్తూ పరమ పురుషుడు. అతడే పరమహంస. అటువంటి హంసలచే జపించబడు మంత్రము ఓం కారము. అటువంటి ఓంకార మంత్రార్థము ఆ పరమేశ్వరి.

74. **హానో పాదాన నిర్ముక్తా :** హానము అంటే ఇష్టం లేని దానిని పరిత్యజించటము. ఉపాదానము అంటే ఇష్టమైన దాన్ని తీసుకోవటము. ఇటువంటివి లేనిది. శుద్ధ తత్త్వానికి ప్రాణం కాని, శరీరం కాని లేవు. శరీరం లేని దానికి ఇష్టాయిష్టాలుండవు. కాబట్టి పరబ్రహ్మ స్వరూపమైన పరమేశ్వరికి ఈ గుణాలుండవు.

75. **హర్షిణీ :** సంతోషము కలుగచేయునది. భక్తులకోరికలు తీర్చటం ద్వారా వారిని సంతోష పెడుతుంది.

76. **హరి సోదరీ :** కృష్ణుని సోదరి. కృష్ణునితో సమానమైన ఉదరము గలది. ఇక్కడ ఈశ్వరుడికి రూపభేదము కల్పించబడింది.

77. **హాహా హూహూ ముఖస్తుత్యా :** హా హా, హూహూ అనేవారు గంధర్వులు. అటువంటి గంధర్వ శ్రేష్ఠులచే స్తుతింపబడునది. స్తుతించటము అంటే గుణ విశేషాలను చెప్పటం. అన్ని గుణాలకు ఆ దేవతయే ఆశ్రయము కాబట్టి ఆమెను స్తుతిస్తారు.

**178. హాని వృద్ధి వివర్జితా :** వృద్ధికాని, నాశనము కాని ఆమెయందు లేవు. జన్మ మృత్యుజరాదులు ఆమెకు లేవు. ఆమె ఆది మధ్యాంత రహిత. శాశ్వత. సర్వకాల సర్వావస్థలలోనూ ఉంటుంది.

**179. హయ్యంగవీన హృదయా :** హయ్యంగ వీనము అంటే నవనీతము. ఆ పరమేశ్వరి నవనీతము వంటి హృదయము కలది. యోగుల యొక్క హృదయములను కృపారసముతో పరిణమింప చేయునది.

**180. హరిగోపారుణాంశుకా :** ఆర్ద్ర పురుగువలె ఎర్రనైన అంబరము కలది, హరి గోపము అంటే ఇంద్రగోపము. ఎనిమిది కాళ్ళు, ఎర్రని రంగు, మెత్తని శరీరముకల కీటకము, ఆర్ద్రా, మఖా నక్షత్రాలలో సూర్యుడు తిరిగేటప్పుడు వర్షాలు పడతాయి. అప్పుడు ఈ రకమైన పురుగులు వస్తాయి. వాటిలాగా ఎర్రని వస్త్రాలు, ఎర్రని కిరణాలుకల పరమేశ్వరి.

***లకారాఖ్యా (లకారార్ధా) లతా పూజ్యా లయ స్థిత్యుద్భవేశ్వరీ*** ***34***
***లాస్య దర్శన సంతుష్టా లాభా లాభ వివర్జితా***
***లంఘ్యేతరాజ్ఞా లావణ్యాశాలినీ లఘు సిద్ధిదా*** ***35***
***లాక్షారస సవర్ణాభా లక్ష్మణాగ్రజ పూజితా***
***లభ్యేతరా లబ్ధ భక్తి సులభా లాంగలాయుధా*** ***36***
***లగ్నచామరహస్త శ్రీశారదా పరివీజితా***
***లజ్జా పద సమారాధ్యా లంపటా లకుళేశ్వరీ*** ***37***
***లబ్ధమానా లబ్ధరసా లబ్ధ సంపత్సమున్నతిః***

**181. లకారాఖ్యా (లకారర్ధా) :** ద్వితీయ ఖండంలోగల తరువాతి అక్షరము 'ల' కారము. కాబట్టి లకారము గల మూల మంత్రము కళది. లకారము ఇంద్ర బీజము. ఇది మాయ.

**182. లతా పూజ్యా:** లతా అనే మాటకు పరమ పతివ్రతలగు స్త్రీలు అని అర్థము. పరమ పతివ్రతలైన స్త్రీలు తమ మాంగల్యము స్థిరంగా ఉండటం కోసమని పరమేశ్వరిని అర్చిస్తారు. కేదారగౌరి అనే పేరుతో ఆ దేవిని అడవిలో దొరికే వస్తువులతో పూజిస్తారు. అలాగే శాంబరీ దేవి, వనదుర్గా పేర్లతో కూడా ఈమెఈ రకమైన పూజలందుకుంటుంది.

**183. లయస్థిత్యుద్భవేశ్వరీ :** లయము, స్థితి, ఉద్భవములకు ఈశ్వరి. అంటే సృష్టి స్థితిలయాలకు అధిపతి. ఉద్భవించునది ఉద్భవము. అంటే కార్య రూపంలో కనిపించేది స్థితి. అంటే ఉన్నదనే జ్ఞానము, అనుభవము కలుగుట. నాశనము పొందటము, లేకుండా పోవటాన్ని లయము అంటారు. ఈమూడు పనులూ పరబ్రహ్మ చేతనే చేయబడుచున్నవి. వీటిలో లయము మొదటగా చెప్పటం చేత ప్రపంచము అనాది అని చెప్పబడుతోంది. కాబట్టి అనాది అయిన ఈ జగత్తులో సృష్టి స్థితి లయాలకు ఈశ్వరి ఆమెయే అని చెప్పబడుచున్నది.

**84. లాస్య దర్శన సంతుష్టా :** నృత్యమును దర్శించుటచే సంతసించునది. కోరికలు తీరిన తరువాత, ఖాళీ సమయంలో రాజులు చిన్నప్పుడు తాము చేసిన పనులను లీలలుగాను, తమశౌర్య పరాక్రమాలను ఇతరులతో నటింప చేసి, వాటిని చూసి ఆనందిస్తారు. లాస్యము అంటే సంగీతము, తాళములతో కలిసి దేవతల చేతగాని, దేవతా స్త్రీలనబడే వేశ్యలచేతగాని చేయబడు నృత్యము. లోకంలో నృత్యాన్ని చూసి ఆనందించని వారుండరు. ఆ పరమేశ్వరి కూడా, ఈ నృత్యాన్ని చూసి సంతసిస్తుంది. లలితా సహస్రంలోకూడా 'లాస్య ప్రియా' అని చెప్పబడింది. (738)

**85. లాభా లాభ వివర్జితా :** లేని దానిని పొందటం లాభము. ప్రయత్నం చేసినా దాన్ని పొందలేక పోవటం అలాభము. ఆవిడకు లాభా లాభములు లేవు. ఆవిడ దగ్గర లేనిది ఏదీలేదు. కాబట్టి ఏమైనా ఆవిడ పొందటం అనే ప్రశ్నే ఉదయించదు.

**86. లంఘ్యేత రాజ్ఞా :** ఇతరుల ఆజ్ఞలు ఆమెకు లంఘ్యములు. ఆమె చేయవలసినది ఏదీ లేదు కాబట్టి ఇతర దేవతలు చేసేవి చూస్తుంటుంది. ఈమె సర్వానికీ, సర్వ దేవతలకు అధిపతి. సర్వ నియంతృత్వమున్నది. కాబట్టి ఇతరులచే ఆజ్ఞాపింపబడదు.

**87. లావణ్య శాలినీ :** లావణ్యముచే ఒప్పుచున్నది. పరమానంద స్వరూపమైన సౌందర్యవతి ఆదేవి సర్వాంగ సుందరి అని ఖడ్గములలో చెప్పటం జరిగింది.

**88. లఘుసిద్ధిదా :** తేలికగసిద్ధించునట్టిది. ఎక్కువగా ఉపాసన చెయ్యకుండానే వాంఛి తార్థాలను ఈడేర్చుతుంది. ఈ లక్షణము తంత్ర శాస్త్రాలలో చెప్పబడింది. అందుకనే ఆమెను 'సర్వ తంత్ర రూపా' అని, 'సర్వ తంత్రాత్మికా' అని చెప్పటం జరిగింది. ఇక్కడ లఘుసిద్ధి అంటే అష్టసిద్ధులలో ఒకటైన లఘిమాసిద్ధి, ఆమెను ఆర్చించినంత మాత్రంచేత అష్టసిద్ధులను ఇచ్చునది.

**89. లాక్షారస సవర్ణాభా :** లాక్షా రసము వంటి వర్ణము కలది. లాక్షారసము అంటే లక్కద్రవము. అది కొద్ది తెలుపు కలిసిన ఎరుపుదనంతో ఉంటుంది. అదే పాటల వర్ణము.

**90. లక్ష్మణాగ్రజ పూజితా :** శ్రీరామ చంద్రునిచే పూజింపబడినది. రామేశ్వరంలో సేతువు నిర్మాణ సమయంలో సైకత లింగాన్ని రాముడు ప్రతిష్టించాడు. అంటే రాముడు శివశక్తులనారాధించాడు.

**91. లభ్యేతరా :** లభ్యముల కంటె ఇతరమైనది. కర్మలద్వారా, ఉపాసన ద్వారా పొందవలసిన విషయములను లభ్యము అంటారు. వీటికి విలక్షణమైనది లభ్యేతరము. మనం చేసిన కర్మలకు ఫలితం ఆమె ఇవ్వాలి. ధర్మార్థకామములు ఆ దేవి వలననే లభిస్తాయి. వీటన్నింటికన్నా వేరుగా ఉన్న శుద్ధ చైతన్యము ఆమె.

**92. లబ్ధ భక్తి సులభా :** భక్తితో అర్చించిన వారికి సులభురాలు. భక్తి రెండు రూపాలు. 1) సామాన్యము. 2) విశేషము. అలాగే ఆర్తులు, అర్థార్తులు, జిజ్ఞాసువులు అనబడే వార్రు ఫలితాన్ని ఆశించి కర్మలు చేస్తారు. కాని వారి ప్రారబ్ధము ననుసరించి వారి కోరికలు నెరవేరతాయి. వారికి ఫలితము ఇవ్వటానికి దేవి సిద్ధముగా ఉంటుంది. అందుకే ఆవిడ భక్త సులభ.

**193. లాంగలాయుధా :** నాగలి ఆయుధముగా గలది. ఆదిశేషుని రూపంలోనాగలిని ఆయుధంగా ధరించినది.

**194. లగ్నచామరహస్త శ్రీశారదా పరివీజితా :** చామరములు చేత ధరించిన లక్ష్మీ సరస్వతులచే సేవింపబడుచున్నది. సౌందర్య లహరిలో 'గతాస్తే మంచత్వం' అనే శ్లోకంలో పంచబ్రహ్మలు మంచం కోళ్ళుకాగా లక్ష్మీ సరస్వతులు వింజామరలు వీస్తున్నారని చెప్పబడింది.

**195. లజ్జా పద సమారాధ్యా :** మనస్సునందు ఆరాధింప తగినది. లజ్జ, శ్రద్ధ, ధృతి, బుద్ధి, భయము, కామము, సంకల్పము అనేవన్నీ మనస్సు అని శ్రుతిలో చెప్పబడింది. లజ్జకు ఆశ్రయమైన మనస్సులో ఈమె ఆరాధింపబడుచున్నది. ఆరాధన రెండు రకాలు. 1) బాహ్య పూజ 2) అంతః పూజ. ఇదే అంతరారాధన. మోక్షగాములు పరమేశ్వరిని మనస్సునందే అర్చిస్తారు.

**196. లంపటా :** లంపట కలిగి ఉన్నది. లం పృధ్వీతత్త్వాత్మకము. షట్చక్రాలలో మూలాధారము. పటము ఆచ్ఛాదనకు వస్త్రము. అవిద్య అజ్ఞానము. ఇదే మాయ. ఈ మాయ పరమేశ్వరి అధీనంలోనే ఉన్నది. లంపటము అంటే శ్రమ. ఆలస్యము. కర్మో పాసనలు చాలా ఉన్నప్పటికీ వాటిని ఆచరించటానికి ప్రతి బంధకాలు కూడా చాలా ఉన్నాయి. సేవలందించినంత త్వరగా వాటి ఫలితంరాదు. ఈ రకంగా ఫలితము ఇవ్వటంలో అలసత్వం కలది.

**197. లకులేశ్వరీ :** లకులము అనే స్థానానికి ఈశ్వరి. కుః అంటే భూమి. అది దీనిలో లయ మొందుతుంది. కాబట్టి కులము అంటే మాయోపాధికమైన చైతన్యము. ప్రళయమునకు అధిష్టాన మైనది. లయమయ్యేటటువంటి కులము లకులము. అటువంటి కులమునకు ఈశ్వరి లకులేశ్వరి. లకులము స్వాధిష్టాన మణిపూరాలు; వాటికి ఈశ్వరి. అనగా ఆమె విష్ణు రుద్రాత్మిక. స్వాధిష్ఠానము తరువాత రుద్ర గ్రంధి, అనాహతము తరువాత విష్ణుగ్రంధి చెప్పబడ్డాయి. సమయా చారులు మణిపూరం నుంచే భగవతిని ఆరాధించాలి. కౌళులు ఆధారస్వాధిష్ఠానలో ఆమెను ఆరాధిస్తారు.

**198. లబ్ధమానా :** లబ్ధమగు పూజకలది. స్వరప్రాణుల చేతనూ లబ్ధమగు మాన అంటే ఆద్యస్తాహంకారము. అన్ని జీవులకు ఈ అహంకారము లబ్ధమై ఉన్నది. ఈ అహంకారమునకు ఆమె అధిష్ఠానము. మాన అంటే పూజ చేయుట. విద్య, ఐశ్వర్యము మొదలైన వాటి వలన ప్రాణులకు లభించే పూజ సుఖాన్నిస్తుంది.

**199. లబ్ధరసా :** లబ్ధమైన ఆనందము కలది. తైత్తిరీయంలోఆత్మయే రసము అని చెప్పబడింది. రసములాగానే అత్యంత ప్రీతికరమైనది ఆనందము. ఈ ఆనందము ఆమెకు స్వతహాగా లభించినది. రసము అంటే శృంగార రసము. దీన్ని వ్యక్తీకరించే ఆభరణాలు, పుష్పాలంకారాల వలె ఉన్నది. రసము అంటే షడ్రుచులు. దేవతారాధనలో వగరు, పులుపు, ఉప్పు, కారము, చేదు నిషేధింపబడ్డాయి. ఒక్క మధుర రసమే లబ్ధమైనది. రసము గలవి, స్నిగ్ధములు, స్థిరములు, హృద్యములు అయిన ఆహారములే సాత్వికులకు ప్రియమైనవి.

**200. లబ్ధ సంపత్సమున్నతి :** లబ్ధమైన సంపదచే సమున్నతి కలిగినది. స్వతసిద్ధమైన సంపదలు సత్యము, కామము మొదలైనవి. ఇవి సచ్చిదానంద రూపంలో ఉన్నాయి. పరమేశ్వరుడు సత్యకాముడు, సత్యసంకల్పుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి. గమనమునకు అధికారి, సాక్షి. ఈయన నిత్యుడు అని చెప్పబడింది. ఈ సంపదలన్నీ ఆమెలో ఉన్నాయి. అందుకే పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము.

*హ్రీంకారిణీ హ్రీంకారాద్యా హ్రీం మధ్యా హ్రీం శిఖామణీ* **38**
*హ్రీంకారకుండాగ్ని శిఖా హ్రీంకార శశిచంద్రికా*
*హ్రీంకార భాస్కరరుచి హ్రీంకారాంభోధచంచలా* **39**
*హ్రీంకార కందాంకురితా హ్రీంకారైక పరాయణా*
*హ్రీంకార దీర్ఘికాహంసీ హ్రీంకారోద్యానకేకినీ* **40**
*హ్రీంకారరణ్య హరిణీ హ్రీంకారా వాల వల్లరీ*
*హ్రీంకార పంజరశుకీ హ్రీంకారాంగణ దీపికా* **41**
*హ్రీంకార కందరాసింహీ హ్రీంకారాంభోజభృంగికా*
*హ్రీంకార సుమనో మాధ్వీ హ్రీంకార తరుమంజరీ* **42**

**201. హ్రీంకారిణీ :** ద్వితీయ కూటమినందు చివరగ హ్రీంకారము కలది.

**202. హ్రీంకారాద్యా :** హ్రీంకారమునుంచే వేదాలు వచ్చాయి. వాటికి పూర్వమే ఆమె ఉన్నది. అందుకనే హ్రీంకారానికే ఆద్యురాలు అని చెప్పబడుతోంది.

**203. హ్రీంమధ్యా:** వ్యవహారకాలమున హ్రీంకలది. హ్రీంకారము మాయాబీజము. ఇందులో ఉండే గుణాలు ఉపాసకుల శక్తిని బట్టి కనిపిస్తాయి. అందువల్లనే మంత్రాన్ని పురశ్చరణ చేసి సాధకులు వారికి కావలసిన కోరికలు తీర్చుకుంటున్నారు. ఇందాకటి నామంలో చెప్పినట్లుగా హ్రీంకారము ఆద్యమే కాదు. వర్తమానంలో కూడా ప్రకాశిస్తున్నది.

**204. హ్రీంశిఖామణీ :** హ్రీంకారమును శిఖామణిగా గలది. స్త్రీలకు సర్వాంగములందు వివిధ రకాలయిన ఆభరణాలుంటాయి. వాటిలో శిరస్సున ధరించేది చూడామణి. అదే శిఖామణి. అది ఆభరణములన్నింటిలోకి ప్రశస్తమైనది. అలాగే హ్రీంకారము బీజాక్షరములన్నింటిలోకి ఉత్తమమైనది. హ్రీంకారమంత్ర జపం చేసే వారికి అన్ని కోర్కెలు తీరతాయి, భోగభాగ్యాలు ఒనగూడుతాయి.

**205. హ్రీంకారకుండాగ్ని శిఖా :** హ్రీంకారమనే కుండమున ఆ పరమేశ్వరి అగ్ని శిఖ, అసలు హ్రీంకారమే ఒక అగ్నికుండము. హోమానికి ఆధారమైనది అగ్ని శిఖ. శిఖి జ్వాలా రూపుడైన ఈశ్వరుడు శిఖి అయిన శక్తితో కలిసి ఉన్నాడు. అగ్ని జ్వాలహోమానికి ఆధారము. ఆ హోమము వలన అపూర్వమైన అదృష్టము కలుగుతుంది. దీనివలన స్వర్గం లభిస్తుంది. హోమంలో మంచి

ంతితో ప్రకాశిస్తున్న అగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లుతున్నప్పుడు వాటికి ఆధారమైన అగ్ని కుండము ర్ధకమవుతున్నది.

౦౬. **హ్రీంకార శశిచంద్రికా:** హ్రీంకారమను చంద్రుని యొక్క వెన్నెల. హ్రీంకారమే చంద్రుడు. చంద్రుని స్వరూపంతో ఆమెకు భేదం లేదు. ఇది బైందవ స్థానమగు నిత్యకళ. శ్రీచక్రము, ఘు. ఇదే సుధాసింధువు. చంద్రుని యొక్క కిరణాలనుంచి జాలువారే వెన్నెల లోకాలకు సంజీవని ంటిది. ఆ దేవిని ఉపాశించే విద్యలలో చంద్రవిద్య ఒకటి.

౦౭. **హ్రీంకార భాస్కరరుచిః:** ఆ పరమేశ్వరి హ్రీంకారమనే సూర్యుని యొక్క కాంతి. సూర్యుని యొక్క కాంతి చేత లోకాలన్నీ సుభిక్షంగా ఉంటున్నాయి. అతని కాంతి కిరణాలవల్లనే లోకంలోని ణులన్నీ మనుగడ సాగిస్తున్నాయి. అయితే వర్షాకాలంలో మేఘాలు కప్పివేయటం వల్ల సూర్యుడు క్కొక్కసారి కనిపించడు. అలాంటప్పుడు సూర్యోపాసకులు, శిష్టాచారులు భోజనం కూడా య్యరు. అంటే సూర్యనారాయణుని దర్శనం అయితేనే లోకాలు జీవించగలుగుతాయని, కంలోని మిగిలిన ప్రాణులు ఇబ్బందులు పడుతుంటే తాము సుఖంగా ఉండరాదని వారు ంచి నీళ్ళు కూడా త్రాగరు. ఇది జ్ఞానము. జ్ఞానియైనవాడు జగత్తులోని ప్రాణులందరినీ తనతో మానంగానే చూడగలుగుతాడు. జ్ఞానమార్గానికి అధికారము పొందనివారికి మోక్షమార్గానికి ర్హత లేదు. పరమేశ్వరి సాక్షాత్కారం జరగదు. ఈ రూపమే హ్రీంకారము. మేఘాలు సూర్యుణ్ణి వరించినప్పుడు పెనుగాలుల తాకిడివల్ల ఆ మేఘాలు విడిపోతాయి. అలాగే మానవుడికి అజ్ఞానం వరించినప్పుడు పూర్వజన్మ పుణ్యము, గురుకృప మొదలైనవాటి కారణంగా ప్రతిబంధకాలు లగిపోతాయి. హ్రీంకారమంత్ర జపంతో జ్ఞానమార్గం కనిపిస్తుంది. అందుకే దేవీ ఉపాసనలో నువిద్య ఒకటి.

౦౮. **హ్రీంకారాబోధచంచలా:** హ్రీంకారమనే మేఘమందు ఈమె మెరుపుతీగ. అమృతాన్నిచ్చేవి ంభోదములు. అంటే మేఘాలు. కోరిన కోరికలు వర్షించేది హ్రీంకారమనే మేఘము. ఆ మేఘాల క్తిలో పరమేశ్వరి విద్యుల్లత. ఆమె స్థిర సౌదామినీ అని చెప్పబడుతోంది. ఇది మణిపూరమునందు త్యక్షమౌతుంది. సమయమతస్థులు పరమేశ్వరి ఉపాసన మణిపూరము నుండే ప్రారంభించాలి. క్కడ దేవిని ఉపాసించినట్లైతే సాధకుడు కవి, గాయకుడు, పండితుడు, ఐశ్వర్యవంతుడు అవుతాడు.

౦౯. **హ్రీంకారకందాంకురితా:** హ్రీంకారమనుకందము (దుంప)నందు ఈమె అంకురము. ులక). హ్రీంకారమేకందము. దానిలో ధృఢమైన బీజము.ఆ పరమేశ్వరి. అంకురము విత్తనంలో న్న శక్తిని గ్రహించి కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లు మొదలైన వాటితో విస్తరించి కాశింపచేస్తుంది. అలాగే హ్రీంకార మంత్రజపం చేస్తే దాని ఫలితాన్ని దేవి అందిస్తుంది.

౦. **హ్రీంకారైక పరాయణా:** హ్రీంకారమే ఏకమైన పరాయణముగ గలది. హ్రీంకారమే ఏకమును, రమును అగు ఆయనముగ కలది. ఏకము అంటే అనితర సాధ్యము. హ్రీంకారము చతుర్విధ

పురుషార్ధాలను సాధించటానికి మార్గము కాబట్టి పరసాధనము. ఆయనము అంటే జ్ఞాపకము, ప్రమాణము అని అర్ధము. ఈ బీజానికి వాచ్యార్ధము మాయ. ఇది ఆశ్రయం లేకుండా సిద్ధించదు. కాబట్టి మాయకు ఆశ్రయ రూపంలోనూ, విషయ రూపంలోనూ మాయ లేనిది హ్రీం బీజముచే జ్ఞాపకమొనరించబడుచున్నది.

**211. హ్రీంకారదీర్ఘికాహంసీ :** దీర్ఘికము అంటే దిగుడుబావి. హ్రీంకారమనే దిగుడు బావిలో ఈమె హంస. రాజోద్యానవనంలో క్రీడాసరస్సు హ్రీంకారము. అక్కడ సంచరించేవారికి హాయినిస్తుంది. అలాగే సంసారమనే వనంలో సంచరించే ప్రజలకు హ్రీంకారమనే సరస్సు హాయినిస్తుంది. ఆహ్లాదాన్ని కలుగచేస్తుంది. అందులోని హంసని చూచినప్పుడు పడ్డ శ్రమ అంతా మరిచిపోయి అమితమైన ఆనందం కలుగుతుంది. ఉపాసన అనేదే సరస్సు. అందులోని హంసే ఆ దేవత.

**212. హ్రీంకారోద్యానకేకినీ :** హ్రీంకారమనే ఉద్యానవనంలో కేకిని అంటే నెమలి. ఉద్యానవనమనేది పండ్లనూ, పూలనూ అనుభవింపజేస్తుంది. అలాగే హ్రీంకారమనే ఉద్యానవనము సాధకులకు ఫలితము ఇచ్చేది. పరమేశ్వరి ఈ ఉద్యాన వనమున నెమలివంటిది. లోకంలో అనేక రకాల పక్షులున్నాయి కాని నెమలికి ఉన్న ప్రత్యేకత వేటికీ లేదు. నెమలి రూపం, అది చేసే ధ్వని, దాని నాట్యం. ఒకటేమిటి అన్నీ సంతోషకరమే. అసలు ఉద్యాన వనానికే అలంకారము నెమలి. అలాగే హ్రీంకారమనే ఉద్యాన వనానికి అలంకార ప్రాయమైనది, ఆనందాన్నిచ్చేది అయిన నెమలి ఆ పరమేశ్వరి. ఆమె స్వేచ్ఛా రూపిణి, సర్వవ్యాపి. ఆత్మ రూపంలో ఉంటుంది. కాబట్టి శరీరము, ఇంద్రియాలు, ప్రాణాలు వాటన్నింటికీ ఆధారమై పరమప్రేమా స్పదముగా, పరమానంద స్వరూపముగా ఆ దేవి ప్రకాశిస్తున్నది.

**213. హ్రీంకారారణ్యహరిణీ :** హ్రీంకారమనబడు అరణ్యంలో ఆమె లేడి వంటిది. హ్రీంకారము అంటే మాయ. దానివల్ల ఉత్పన్నమయ్యేది ఈ జగత్తు. కాబట్టి మాయ వల్ల ఏర్పడ్డ ఈ జగత్తులో మనం బంధించబడ్డాము. అరణ్యము హ్రీంకారము వంటిది. అందులో ప్రవేశించిన వారి దృష్టికి లేడి కనిపించినప్పటికీ అంత తేలికగా దొరకదు. అలాగే నిరంతరము సాధనలో మునిగి ఉన్న సాధకులకు అనుభూతిని కలిగించి అజ్ఞానమును తొలగించి, భయమును పోగొట్టి ఆనందానిచ్చే దేవత ఆ పరమేశ్వరి.

**214. హ్రీంకారావాలవల్లరీ :** హ్రీంకారమను ఆవాలమున ఆమె వల్లరి (తీగ). హ్రీంకార శబ్దానికి అర్ధమే పరదేవత స్వరూపము. ఉపాసనా ఫలము నివ్వటానికి శక్తి కలిగి ఉన్నది. కాబట్టి ముందు చిన్నగా కనిపించి తరువాత పెద్దది అయిన తీగతో పోల్చబడింది. జపతపాదుల ద్వారా హ్రీంకారమ నేతను ఎప్పుడూ సంరక్షిస్తూ ఉండాలి.

**215. హ్రీంకార పంజర శుకీ :** హ్రీంకారమనే పంజరమందు ఆమె చిలుక వంటిది. పిల్లలు ఏడుస్తుంటే వాళ్ళని లాలించటానికి పంజరంలోని పక్షిని చూపిస్తారు. అలాగే సాధకుల మనస్సులను రంజింపచేస్తుంది. వారి వారి అదృష్టాన్ని బట్టి ఫలితాన్ని కూడా అందిస్తుంది.

**216. హ్రీంకారాంగణదీపికా :** అంగణము అంటే ముంగిలి. విశ్రాంతిస్థానము. హ్రీంకారమనేది ఈ అంగణము వంటిది. ఆ అంగణములో పరమేశ్వరి దీపము వంటిది. ఆ దీపము బయట లోపల కూడా కాంతిని ప్రసరింపచేసి చీకట్లను పారద్రోలుతుంది. అలాగే పరమేశ్వరి భక్తుల అభీష్టాలను తీరుస్తూ వారి అజ్ఞానాన్ని తొలగిస్తుంది. హ్రీంకారము యొక్క అర్థాన్ని తెలుసుకుని, మననం చేసుకుని నిరంతరము అభ్యాసము గనక చేసినట్లైతే, స్వయం ప్రకాశమైన ఆ పరమేశ్వరి సాధకులకు నుంచి అనుభూతినిస్తుంది.

**217. హ్రీంకారకందరాసింహా :** కందరము అంటే పర్వతాగ్రమునందున్న గుహ. హ్రీంకారమనే గుహలో ఆమె సింహము వంటిది. ఇక్కడ హ్రీంకారాన్ని కందరముతో పోల్చారు. పర్వతము మీద ఉండే గుహ ఊళ్ళో ఉండదు. ఊరికి బాగా అవతలగా, అరణ్యం మధ్యలో ఉంటుంది. అక్కడికి వెళ్ళటానికిగాని, ఆ పర్వతాన్ని చేరటానికి గాని అందరికీ వీలు కాదు. ఒక వేళ ఆ పర్వతాన్ని చేరగలిగినా దాని చివరనున్న గుహదగ్గరకు చేరలేరు. అలాగే హ్రీంకార మంత్రజపం అందరూ చెయ్యలేరు. కొన్ని జన్మల నుండి చేసుకున్న కృతము ఉండాలి. అలాంటివారే పరమేశ్వరిని స్మరిస్తారు. ఇతరమైన క్షుద్ర మృగాలు ప్రవేశించటానికి భయపడే ఆ గుహలోకి సింహం మాత్రమే ప్రవేశించగలుగుతుంది. అక్కడ తానున్నట్లుగా తెలియచేస్తుంది. చుట్టు పక్కల గోళ్ళతో త్రవ్వేస్తుంది. అక్కడ ఏనుగు కుంభస్థలం నుంచి రాలిపడిన ముత్యాలు కనిపిస్తాయి. ధైర్యం గలవారు ఆ ముత్యాలు ఏరుకోటానికి అక్కడికి వెడతారు. అలాగే దేవీ భక్తులు, హ్రీంకార మంత్రజపం చేసేవారు మాత్రమే అచటికి వెళ్ళి పరమేశ్వరి కటాక్షాన్ని పొందగలుగుచున్నారు.

**218. హ్రీంకారాంభోజభృంగికా :** హ్రీంకారమను అంభోజము నందు ఆ దేవి భృంగిక. అంబుజము. నీటియందు పుట్టినది పద్మము. భృంగము. నీలిమను ధరించునది. బాగా నీలవర్ణంలో ఉండేది. తుమ్మెద. భృంగిక అంటే ఆడుతుమ్మెద. అష్టైశ్వర్యాలను, సిరిసంపదలను ఇచ్చే శక్తి గలది హ్రీంకారము. అనేక రకాలయిన ఇతర అక్షరాలతోకలిసి ఉన్న హ్రీంకారము సువాసనలను వెదజల్లే పరాగముతో కూడిన పద్మములాగా ఉన్నది. పూలలోని తేనెను మాత్రమే త్రాగే తుమ్మెద అక్కడ ఆనందాన్ని అనుభవిస్తోంది. అన్ని పూలలో ఉన్న తేనెను తుమ్మెద త్రాగుతుంది కాని తేనె ఎక్కువగా దొరికే కమలము అంటే దానికి ఆసక్తి ఎక్కువ. అలాగే మంత్రంలో ఎన్ని బీజాక్షరాలున్నప్పటికీ, ఏ ఒక్క అక్షరాన్ని జపం చేసినా దేవి కరుణిస్తుంది. కాని హ్రీంకార మంత్రజపం చేస్తే పరమేశ్వరి కరుణ శీఘ్రమే కలుగుతుంది. అందుచేతనే పద్మము చుట్టూ తుమ్మెద ఎలా తిరుగుతుందో అలాగే హ్రీంకార మంత్రాన్ని అట్టిపెట్టుకుని పరమేశ్వరి ఉంటుంది.

**219. హ్రీంకారసుమనోమాధ్వీ :** హ్రీంకారమనే సుమన (పుష్పము) మునందలి మాధ్వీ (మధువు). కోరిన కోరికలు తీరుస్తుంది కాబట్టి హ్రీంకారము పువ్వుతో పోల్చబడింది. పూలు చాలా మెత్తగా, మృదువుగా ఉంటాయి. చాలా గౌరవంగా చూడబడతాయి. స్త్రీలు శిరస్సున అలంకరించుకుని

వాటిని గౌరవిస్తారు. అలాగే హ్రీంకారము కూడా ఉపాసనా వేళలో పరమపవిత్రంగా, ఏకాగ్రమైన చిత్తంతో ధ్యానించబడుతుంది. పూలనుండి తేనె వస్తుంది. వాటి నుండి కాయలు, పండ్లు కూడా వస్తాయి. పువ్వు నుంచి తేనె,కాయలు, పండ్లు వచ్చినట్లుగానే, హ్రీంకార మంత్రజపం చెయ్యటం వల్ల సాధకుడికి ఐహిక ఆముష్మిక ఫలితాలన్నీ దక్కుతాయి.

**220. హ్రీంకారతరు మంజరీ :** హ్రీంకారమనే వృక్షానికి మంజరి అంటే పూవు వంటిది. చెట్లకు పూలు పుయ్యటమనేది వాటి స్వభావము. వాటికోసం చెట్టు ఎక్కినవాడు పడిపోకుండా, అతడికి ఫలితాన్నిచ్చి తరింపచేస్తుంది వృక్షము. హ్రీంకారము కల్పవృక్షములాంటిది. దాని కొమ్మల చివర ఉండే పూలు, కాయలే మనము అనుభవించే ఫలితాలు. గురువు దగ్గర మంత్రోపదేశం పొంది, హ్రీంకారమనే వృక్షాన్ని ఎక్కినట్లైతే, సాధకుడికి కావలసిన కాయలు, పూలు, పండ్లు దొరుకుతాయి. అంటే అతడి కోరికలు పూర్తిగా తీరతాయి.

ఇక్కడితో ద్వితీయ కూటమి పూర్తి అయింది. ఇక తృతీయ కూటమి. అందులో నాలుగు బీజాక్షరాలుంటాయి.

***సకారాఖ్యా సమరసా సకలాగమసంస్తుతా***
***సర్వవేదాంతతాత్పర్య భూమిః సదసదాశ్రయా*** 43
***సకలా సచ్చిదానందా సాధ్యా సద్గతిదాయినీ***
***సనకాది మునిధ్యేయా సదాశివకుటుంబినీ*** 44
***సకలాధిష్ఠానరూపా సత్యరూపా సమాకృతిః***
***సర్వప్రపంచ నిర్మాత్రీ సమానాధిక వర్జితా*** 45
***సర్వోత్తుంగా సంగహీనా సగుణా సకలేష్టదా***

**221. సకారాఖ్యా :** తృతీయ కూటమిలో మొదటి బీజము సకారము. కాబట్టి సకారముతో కూడిన శ్రీవిద్యా వాచక శబ్దము కలది.

**222. సమరసా :** సమమైన రసము కలది. పానకము పోసిన పాత్రలో ఏ మూల నుంచి పానకము తీసినా ఒకే రుచిలో ఉంటుంది. అలాగే ఈ జగత్తులో ఈమె సమరస. ఈ జగత్తులోని జనులు వివిధ స్వభావాలు కలిగి ఉంటారు. వారిలో కొందరు సర్వజ్ఞులు, కొందరు అల్పజ్ఞులు. వీరి స్వభావాన్ని బట్టి జీవాత్మ, పరమాత్మ ప్రకాశిస్తుంటారు. కాని వేదాంత వాక్యాలు వినటము, మననం చెయ్యటము, మొదలైన వాటివలన "నేనే బ్రహ్మ స్వరూపాన్ని" అనే విషయం వ్యక్తం అయి జీవాత్మ పరమాత్మల మధ్య భేదం లేదు. రెండూ ఒక్కటే అనే విషయం అవగతమవుతుంది.

**223. సకలాగమసంస్తుతా :** సకల ఆగమములచే స్తుతించబడుచున్నది. సమస్త విషయాలను తెలియచేసే వేదాలను ఆగమాలు అంటారు. ఇంతకిమించిన తత్త్వము లేదని నిశ్చయంగా నమ్మిన ఆగమములచేత స్తుతించబడుచున్నది. ఆగమాలు ఆమె గుణగణాలను కీర్తిస్తాయి.

**224. సర్వ వేదాంత తాత్పర్యభూమి :** పరమేశ్వరి సర్వ వేదాంతముల యొక్క తాత్పర్యములకు భూమి. అంటే విషయము. వేదాల చివర ఉన్నవి మహావాక్యాలు వీటి తాత్పర్యములకు ఈమె భూమి అంటే విషయము. తాత్పర్య నిర్ణయానికి ఏడు సాధనాలున్నాయి. అవి

1. **ఉపక్రమము** : ప్రతిపాదించదలచుకున్న విషయాన్ని గ్రంథ ఆరంభంలో చెప్పటం.
2. **ఉపసంహారము** : ప్రతిపాదించదలచుకున్న విషయాన్ని గ్రంథం చివరలో చెప్పటం.
3. **అభ్యాసము** : చెప్పదలచుకున్న విషయాన్ని చాలాసార్లు చెప్పటం.
4. **అపూర్వత** : ఇంకొక ప్రమాణంతో ఈ విషయాన్ని చెప్పకుండా ఉండటము.
   ఉదా : వేదాంతము ద్వారానే బ్రహ్మ తెలియబడుచున్నది.
5. **ఫలము** : ఈ విషయం తెలుసుకోవటం వల్ల ఫలితము ఏమిటి ?
6. **అర్థవాదము** : ఈ అర్థాన్నే స్తుతించటం
7. **ఉపపత్తి** : యుక్తి వలన విషయాన్ని సాధించటము.

ఈ రకంగా తాత్పర్యం నిర్ణయించే బలాన్ననుసరించే అన్ని వేదాంత వాక్యాలకు ఉపాసనా జ్ఞానవిధి ఉన్నదని చెప్పాలి. కర్మకాండకు, ఉపాసనా కాండకు ఫలితము మోక్షహేతువైన జ్ఞానము. అఖండ చైతన్యానుభవమే వేదాంతము యొక్క ముఖ్యార్థము. 1) సమానాధికరణ్యాము 2) విశేషణ విశేష్యత 3) లక్ష లక్షణ భావము. అనే వాటి ద్వారా ప్రత్యగాత్మని తాత్పర్యంగా గ్రహించాలి.

**225. సదాశ్రయా :** సత్, అసత్తులకు ఆమె ఆశ్రయము. పంచభూతాలలోని నేల, నిప్పు, నీరు అనే మూడింటినీ, వాటి నుండి జరిగే వాటినీ సత్ అంటారు. గాలి, ఆకాశము, వాటివలన జరిగే పనులను అసత్ అంటారు. ఈ రెండింటికి ఉపాదకారణము ఆ పరమేశ్వరి.

**226. సకలా :** అన్ని కళలు కలది. ఉపాసన కోసం పదహారు కళలున్నాయనీ, షోడశకలాయుక్తుడైన పరమేశ్వరుణ్ణే ఆరాధించాలని ఛాందోగ్యోపనిషత్తులో సత్యకాముడికి చెప్పటం జరిగింది. పరమేశ్వరికి ఈ పదహారు కళలూ ఉన్నాయి. సహస్రారమే చంద్రమండలము. అక్కడ పూర్ణచంద్రుడున్నాడు. ఆ చంద్రుడికి వృద్ధి క్షయాలు లేవు. అతడు నిత్యకళాయుక్తుడు. అక్కడ పరమేశ్వరి ఉంటుంది. షోడశ కళాత్మకమైన ఆ దేవిని సహస్రారంలో అర్చించిన వారికి పునర్జన్మ లేదు.

**227. సచ్చిదానందా :** పరమేశ్వరి సచ్చిదానంద స్వరూపము గలది. ఎల్లప్పుడూ స్వయం ప్రకాశ తత్త్వముచే వెలుగొందుచూ ఆనందము, ప్రేమ తత్త్వము కలది. బ్రహ్మ సత్యము. బ్రహ్మ నిత్యము జ్ఞానము అనంతమైనది. ఆనందమే బ్రహ్మ అని శృతులు చెబుతున్నాయి. కాబట్టి ఆమె సచ్చిదానంద రూపిణి అంటే ఆమే పరబ్రహ్మ స్వరూపము. ఆమెకు మించిన వారుగాని, ఆమెతో సమానమైన వారుగాని వేరొకరు లేరు.

**228. సాధ్యా :** సాధ్యమగునట్టిది. మహావాక్యము మొదలైన వాటిని వినటం వలన బ్రహ్మ విద్య తెలుస్తుంది. అప్పుడు సాధకుడు సాధనా చతుష్టయముచే ఈమె సాక్షాత్కారము, ముక్తి సాధించగలుగుతున్నాడు. ఈ నామాన్ని కొన్నిచోట్ల 'సాధ్వీ' అని వ్రాశారు. ఒకనియందే ఇష్టము కలిగి, మనసా, వాచా, కర్మణా అతినినే స్మరించే స్త్రీ పరమపతివ్రత. ఆమె సాధ్వీ.

**229. సద్గతిదాయినీ :** సద్గతిని ఇచ్చునట్టిది. సద్గతి అంటే పునరావృత్తి లేనిది, సత్యమైనది, సుఖమైనగతి. గతి అంటే పొందబడునది, తెలియదగినది అని అర్థము. దేనిని తెలుసుకొనుచున్నామో అది గతి. తెలియనిదాని విషయమున గతి శబ్దము ఉపయోగించరాదు. ఫలితము తెలిసినప్పుడు దానియందు కోరిక గలిగి తగిన ఉపాయములను మనము చేపడతాము. అజ్ఞాత ఫలసాధనకు అటువంటి ప్రయత్నము కనిపించదు. బ్రహ్మవేత్తయే బ్రహ్మను గురించి తెలుసుకోగలుగుతున్నాడు. పరబ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు సాక్షాత్తూ పరబ్రహ్మ అవుతున్నాడు. పరదేవతా స్వరూపమే ముక్తి స్వరూపము. అదే సద్గతి. ఆ పరమేశ్వరిని ఆరాధిస్తే సద్గతులు ప్రాప్తిస్తాయి.

**230. సనకాదిమునిధ్యేయా :** సనకాది మునులచే ధ్యానించబడేది. మౌనము దాల్చినవారు మునులు. వారు మాట్లాడకుండా మంత్రాన్ని మననం చేస్తుంటారు. మనన శబ్దానికి సాక్షాత్కారము కలవారు అని కూడా అర్థమున్నది. జ్ఞానవైరాగ్యాలు గలిగి ముముక్షువులుగా మారిన సనక సనందనాది మహర్షులచే ధ్యానించబడునది. వీరు ఐదుగురు 1) సనక 2) సనందన 3) సనత్కుమార 4) వసిష్ఠ 5) శుకమహర్షులు. వీరు వ్రాసిన సంహితలనే సుభాగమ పంచకము అంటారు. సమయ మతస్తులకు సుభాగమపంచకమే ప్రమాణము.

**231. సదాశివ కుటుంబినీ :** సదాశివుడు ఈమెకు భర్తగా ఉన్నాడు. అందుచేతనే ఈమె సదాశివ కుటుంబినీ అనబడింది.

**232. సకలాధిష్ఠాన రూపా :** అన్నింటికీ అధిష్టాన రూపంలో ఉన్నది. ఇది అంతా బ్రహ్మ మయం. దీనికి వేరైనది లేదు. దానితో సమానమైనది కాని, దానికన్న అధికమైనది కాని ఇంకొకటి లేదు. సర్వమునకు అధిష్టానము బ్రహ్మ. ఆ పరమేశ్వరియే బ్రహ్మ స్వరూపము.

**233. సత్యరూపా :** సత్యమైన రూపము గలది. సత్యము అంటే జడము, అన్వృతము లేనిది. సచ్చిదానంద రూపము గలది.

**234. సమాకృతిః :** సమమైన ఆకృతి గలది. సచ్చిదానంద స్వరూపము ఆ పరమేశ్వరి స్వభావము. ఆమెరూపము హెచ్చుతగ్గులు లేకుండా సాముద్రిక శాస్త్రంలో చెప్పిన రీతిగా సమానంగా ఉంటుంది. ఆ దేవి గుణము, ఐశ్వర్యము, సౌందర్యము, బలము, వీర్యమూ, యశస్సు, గాంభీర్యము, ధైర్యము, జ్ఞానము, సర్వజ్ఞత్వము మొదలైన అన్ని గుణములయందు సదాశివునితో సమానమైనది. కర్మాధికారి పరమేశ్వరి. జీవులకు పక్షపాతము లేకుండా కర్మఫలితాన్నిస్తుంది. బాల్యము, యవ్వనము, కౌమారము

అనే దశలు లేకుండా ఒకే రకంగా ఉండే రూపం ఆమెది. అందుకే ఆమె 'వయోవస్థావివర్జితా' అని చెప్పబడింది. అంగుష్ఠమాత్రుడైన పురుషుడు ఎల్లవేళలలోనూ జనుల హృదయాలలో దాగి ఉంటాడు. అనటంచేత, సమానమైన ఆకారంతో ఆ పరమేశ్వరి ఉంటుందని భావము.

**235. సర్వప్రపంచ నిర్మాత్రీ :** ఈమె సర్వ ప్రపంచాన్ని నిర్మించింది. సంసారము అనాది. మోక్షము, శాశ్వతమైన స్థితి. కాబట్టి భూత, భవిష్యత్, వర్తమాన కాలాలననుసరించి సర్వ అనే శబ్దము వాడబడినది. ఈ ప్రపంచాన్ని నిర్మించింది ఆమె. అందుచేతనే నిర్మాత్రీ అని చెప్పబడింది.

**236. సమానాధికవర్జితా :** సర్వమును త్యజించినది. పరమేశ్వరి నిర్గుణ. ఆమెకు కులము, జాతి, గుణము, మొదలైనవి ఆపాదింపబడవు. వీటన్నిటికంటె శ్రేయస్సు అధికమైనది. తత్త్వానికి ప్రతిమ లేదు. దానికి సర్వాధిపత్యమున్నది. అది ఏకైకము. అద్వితీయము. దానితో సమమైన వారు గాని అధికులైనవారుగాని ముల్లోకాలలోనూ ఎక్కడా, ఎవరూ లేరు. కాబట్టి ఆ పరమేశ్వరి సమనాధిక వర్జిత.

**237. సర్వోత్తుంగా :** అన్నింటికంటె ఉన్నతమైనది. కార్యము కన్నా కారణము అధికమైనది. కాబట్టి అన్నిటికన్న ఆమె ఉన్నతమైనది. జగత్తులోని సకల భూతాలు విరాట్పురుషుని ఒక పాదము. మిగిలిన మూడు పాదములు అమర్త్యములై దివమున గలవని పురుష సూక్తంలో చెప్పబడింది. కాబట్టి ఆమె సర్వోత్తుంగ.

**238. సంగహీనా :** పరమేశ్వరి శరీర సంబంధము లేనిది. ఆమె నిత్య, నిర్లేపా - కర్మ సంబంధము లేనిది, నిర్మల, నిరాకార, నిరాకుల - భావవికారము లేనిది, నిర్గుణ, నిష్కల - విభాగములు లేనిది, నిష్కామ, నిరుపప్లవ - వృద్ధి క్షయాలు లేనిది.

**239. సగుణా :** గుణముల చేత వర్తించునది. సత్యము, కామము మొదలైన గుణములు ఆమె యందున్నాయి. తత్త్వము సర్వవిత్, గుణములు కలది. సత్యకామ, సత్యసంకల్ప అని శ్రుతి వాక్యము. పరమేశ్వరి త్రిమూర్తుల స్వరూపము. కాబట్టి ఆమెలో త్రిగుణములున్నాయి. అందుకనే ఆమె సగుణ.

**240. సకలేష్టదా :** సకలమగు ఇష్టములను ఇచ్చునది. ఇచ్ఛా విషయాలను రెండు రకాలుగా చెప్పవచ్చు. 1) ఇష్టములు 2) కామ్యములు. అన్ని కోర్కెలను తీర్చేది పరమేశ్వరి. సాధకులు ఆమెను అర్చించేటప్పుడు, వారి ఆరాధనను బట్టి వారికి కావలసిన కోర్కెలు తీరుస్తుంది. సంగీతము, సాహిత్యము, భోగభాగ్యములు ఇస్తుంది. అలాగే ముముక్షువులకు ముక్తినిస్తుంది. ఈ రకంగా ఎవరికి ఏ కోరికలున్నాయో, వాటిని తీరుస్తుంది.

***కకారిణీ కావ్యలోలా కామేశ్వర మనోహరా*** ***46***

***కామేశ్వర ప్రాణనాడీ కామేశోత్సంగవాసినీ***

***కామేశ్వరాలింగితాంగీ కామేశ్వర సుఖప్రదా*** ***47***

కామేశ్వర ప్రణయినీ కామేశ్వర విలాసినీ
కామేశ్వర తపః సిద్ధిః కామేశ్వర మనః ప్రియా 48
కామేశ్వర ప్రాణనాథా కామేశ్వర విమోహినీ
కామేశ్వర బ్రహ్మవిద్యా కామేశ్వర గృహేశ్వరీ 49
కామేశ్వరాహ్లాదకరీ కామేశ్వర మహేశ్వరీ
కామేశ్వరీ కామకోటి నిలయా కాంక్షితార్థదా 50

**241. కకారిణీ :** తృతీయ కూటమిలోని రెండవ అక్షరము కకారము. దానిచేత గుర్తించబడునది.

**242. కావ్యలోలా :** కావ్యములయందు ఆసక్తి కలది. వాల్మీకి, వ్యాసుడు మొదలైన వారు వ్రాసిన పురాణాలు, స్తుతులయందు ఎక్కువ ప్రీతి కలది.

**243. కామేశ్వర మనోహరా :** కామేశ్వరుని మనస్సును హరించినది.

**244. కామేశ్వర ప్రాణనాడీ :** పరమేశ్వరి, కామేశ్వరుని యొక్క ప్రాణనాడి. నాడి ద్వారానే ప్రాణము సంచరిస్తుంది. కాబట్టి ఆమె ప్రాణనాడి లేదా జీవనాడి. శరీరంలో ఉఛ్వాసనిశ్వాసలు ఇడా, పింగళానాడుల ద్వారా జరుగుతాయి. ఈ రెండింటికీ మధ్యభాగాన ఆధారచక్రం నుండి బ్రహ్మరంధ్రం వరకూ సుషుమ్నా నాడి వ్యాపించి ఉన్నది. ఆధారచక్రంలోని కుండలినీ శక్తి నిద్రలేచి సుషుమ్నానాడి గుండా సహస్రారం వరకూ చేరుతుంది. అక్కడ పరబ్రహ్మ సాక్షాత్కారం జరుగుతుంది.

**245. కామేశోత్సంగవాసినీ :** కామేశ్వరుని ఎడమ తొడమీద వసించునది.

**246. కామేశ్వరాలింగితాంగీ :** కామేశ్వరునిచే కౌగిలించుకొనబడిన శరీరము కలది.

**247. కామేశ్వర సుఖప్రదా :** కామేశ్వరునికి సుఖమునిచ్చునది. పరబ్రహ్మ స్వరూపమైన సచ్చిదానందమును సాక్షాత్కరింపచేయుటయే కామేశ్వరునకు సుఖము. భక్తునికీ, భగవంతునికీ భేదము లేదని చెప్పి శాశ్వత సుఖదాయకమైన ముక్తిని కలిగించునది.

**248. కామేశ్వరప్రణయినీ :** కామేశ్వరుని యొక్క ప్రణయిని. కామేశ్వరుని స్వస్వరూపమగు పరమానందమున ప్రీతి గలది.

**249. కామేశ్వర విలాసినీ :** కామేశ్వరుని విలాసమనగా జగదాత్మకమగు వివర్తము. అట్టి విలాసము కలది.

**250. కామేశ్వర తపస్సిద్ధిః :** కామేశ్వరుని యొక్క తపస్సు. జగత్తును సృష్టించాలనే ఆలోచనే ఈ తపస్సు. ఈ తపస్సును సిద్ధింపచేయటానికి ఆమె సాధనము. అంటే స్త్రీ పురుషుల వలన సృష్టించబడే ఈ జగత్తుకు ఆమెయే సాధనము.

**251. కామేశ్వర మనఃప్రియా :** పరమేశ్వరి, కామేశ్వరుని మనస్సునకు ప్రేమాస్పదమైనది.

**252. కామేశ్వర ప్రాణనాథా :** కామేశ్వరుడు ప్రాణనాథుడుగ గలది. కామేశ్వరుని ప్రాణమగు హిరణ్యగర్భుని పాలించునది. అంటే ఈమె భర్త కామేశ్వరుడు.

**253. కామేశ్వర విమోహినీ :** కామేశ్వరుని విమోహింపచేయునట్టిది. పరమేశ్వరునితో భిన్నమైన రూపం గలిగి, మనమిద్దరము దంపతులము అనేటటువంటి అజ్ఞానమైన భావన ఆయనకు కలుగచేసి మోహంలో పడేస్తోంది.

**254. కామేశ్వర బ్రహ్మవిద్యా :** ఈమె కామేశ్వరుని యొక్క బ్రహ్మవిద్య. కామేశ్వరునికి తత్త్వము, పదార్థములు అఖండాకారమును సాక్షాత్కరింపచేయునది.

**255. కామేశ్వరగృహేశ్వరీ :** కామేశ్వరుని యొక్క గృహేశ్వరి. గృహ అనే ధాతువుకు గ్రహించు, తీసుకొను అని అర్థములు. అనగా కామేశ్వరునికి సర్వజ్ఞానము అని భావము. గృహము అంటే ఆవాసము, ఇల్లు అని అర్థం కాబట్టి కామేశ్వరుడు గృహేశ్వరుడు. ఈమె గృహేశ్వరి.

**256. కామేశ్వరాహ్లాదకరీ :** కామేశ్వరునకు ఆహ్లాదము కలిగించునది. తృప్తివలన కలిగే సుఖాన్నే ఆహ్లాదము అంటారు. పరమేశ్వరుని నిత్య తృప్త రూపముగల శక్తి ఆమె.

**257. కామేశ్వర మాహేశ్వరీ :** ఈమె కామేశ్వరుని యొక్క మహేశ్వరి. ఈశ్వరిలకు ఈశ్వరి మహేశ్వరి. అంటే నిరుపాధికమగు ఐశ్వర్యము గలది. కామేశ్వరుని మహదైశ్వర్యము ఈమె యందే ఉన్నది.

**258. కామేశ్వరీ :** మన్మధునిచే ఉపాసింపబడిన కాదివిద్యా స్వరూపము. మన్మధుడు ఈ విద్యను దర్శించి భూలోకంలోకి తెచ్చాడనీ, అతడే ఈ మంత్రానికి ఋషి అనీ చెప్పటం జరిగింది.

**259. కామకోటినిలయా :** కామకోటి పీఠమందుండునది. తొంభై ఆరు పీఠాల మధ్యన గలది కామకోటి పీఠము. అదే శ్రీచక్రము. అంటే శ్రీచక్రమునందుండునది.

**260. కాంక్షితార్థదా :** కాంక్షితములైన అర్థములనిచ్చునది. కోరిన కోరికలు తీర్చునది. సాధకులకు ప్రసన్నురాలై వారి కోర్కెలు తీర్చునది.

**ల కారిణీ లబ్ధరూపా లబ్ధధీ లబ్ధవాంఛితా**
**లబ్ధపాపమనోదూరా లబ్ధాహంకార దుర్గమా** *51*
**లబ్ధశక్తిర్లబ్ధ దేహా లబ్ధైశ్వర్యసమున్నతి :**
**లబ్ధవృద్ధి ర్లబ్ధలీలా లబ్ధయవ్వనశాలినీ** *52*
**లబ్ధాతిశయ సర్వాంగసౌందర్యా లబ్ధవిభ్రమా**
**లబ్ధరాగా లబ్ధపతి ర్లబ్ధనానాగమస్థితి :** *53*
**లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధ హర్షాభిపూరితా**

**261. లకారిణీ :** తృతీయ ఖండములోని మూడవ అక్షరము లకారము. దానిచే గుర్తించబడునది.

**262. లబ్ధరూపా :** లబ్ధమగు రూపము గలది. రూపము అంటే ఇక్కడ లక్షణము అని అర్థము. స్వరూప లక్షణము, తటస్థ లక్షణము అనేవి సగుణ, నిర్గుణ పరములు. ఇవన్నీ ఈమెచే లబ్ధమగుచున్నాయి. నామరూపాలనేవి ఈమె ద్వారా లభ్యమవుతాయి.

**263. లబ్ధధీః :** లబ్ధమగు బుద్ధులు గలది. నిశ్చయాత్మకములు సవికల్పములు అయిన అంతఃకరణ వృత్తులను ధీశబ్దముతో వ్యవహరిస్తారు. ఉపాధి రూపంలో ప్రతిబింబాధిష్ఠానముగా మనకు ఆ పరమేశ్వరి వలన ఇవి లభ్యమవుతున్నాయి. అంతఃకరణవృత్తి యందు ఆరూఢమైన చైతన్యమే జ్ఞానమని, చైతన్య వ్యాప్తమైనది వృత్తి అని చెప్పబడింది. జడపదార్థాలు గ్రహించటానికి సామాన్యమగు అంతఃకరణ వృత్తులకు శక్తిలేదు.అనుభవము సిద్ధించాలంటే అంతఃకరణాది ఉపాధులతో ఉన్న స్వరూప చైతన్యమును ఫలచైతన్యముగా ప్రకాశింపచేయుచున్నదని చెప్పాలి. బ్రహ్మాయందు ఆరోపింపబడిన అజ్ఞానమును నశింపచెయ్యటానికి వృత్తి వ్యాప్తిని అంగీకరించాలి. దీని ప్రకారము తత్త్వమస్యాది మహావాక్య శ్రవణాదుల వలన కలిగే వృత్తి వ్యాప్తి ఈమె ద్వారా కలుగుతున్నది.

**264. లబ్ధవాంఛితా :** లబ్ధమగు వాంఛితము గలది. వాంఛితమనబడు ఇష్టఫలము ఆమెచే పూర్వమే లబ్ధమైనది అని అర్థము.

**265. లబ్ధపాపమనోదూరా :** పాపముల నొందిన మనస్సు కలవారికి ఈమె దూరముగా ఉంటుంది. పాప ప్రధానమగు మనస్సులను పొందినవారు పాపాన్ని గూర్చే ఆలోచిస్తారు. ఇటువంటి వారికి దేవత దూరంగా ఉంటుంది. ఆమెను గురించి తెలుసుకోవటం వారి వల్లకాదు. చెడు కర్మలు చేస్తూ, పాపపు ఆలోచనలు కలిగిన దురాచారులకు, దుష్టులకు ఆమె దూరంగా ఉంటుంది.

**266. లబ్ధాహంకారదుర్గమా :** అహంకార మొందిన వానిచే పొందరానిది. అహంకారమంటే అభిమానము.అభిమానము గనక దురభిమానంగా మారినట్లైతే వారు చేసే సాధనాకలాపము ఆమెను చేరదు. దేహేంద్రియాలలో సత్వగుణము లేకపోయినట్లైతే సుఖసంతోషాలుండవు.

**267. లబ్ధశక్తిః :** లబ్ధమైన శక్తి కలది. ఇక్కడ శక్తి అంటే సకల సామర్థ్య హేతువైన మాయా శక్తి. అది ఆమెచే లబ్ధమవుతుంది. సాధకులు ధ్యానయోగంలో మాత్రమే ఆ దేవతాశక్తిని దర్శించగలుగుతారు.

**268. లబ్ధదేహా :** విగ్రహము కలది. అంటే ఆమెకు రూపమున్నదని అర్థము. భక్తుల యొక్క కోరికలు తీర్చటానికి ఆమె ఒక రూపం ధరించింది. అదే పరమేశ్వరి.

**269. లబ్ధైశ్వర్యసమున్నతిః :** లబ్ధమగు ఐశ్వర్యమున్నతిగలది. అంటే ఎక్కువ ఐశ్వర్యముకలది. ఈమెను ఉపాసించిన వారికి మహదైశ్వర్యము కలుగుతుంది.

